# THE
# ... NITYA VYATYASUM

OR THE

...ENCE BETWEEN

...EMI... & THE ETERNAL

...N PROSE AND POETRY.

# అనిత్యనిత్య వ్యత్యాసము.

ఇది

పూర్వమున ఈ దేశమునకు సత్యవేదమును బోధించవచ్చి

గురువులలో నొకరిచేత రచియింపబడెను.

మూడవ కూర్పు.


నెల్లూరు

అర్చ్బి. జ్వాన్స్సుగారి ముద్రాక్షరశాలలో ముద్రించి

ప్రచురింపబడియె.

ST. JOHN'S PRESS, SUBEDARPET,

NELLORE

1926



# అనిత్యనిత్య వ్యత్యాసము.

## పీఠిక.

(మొదటి కూర్పు.)

ఏ వస్తువునకు నొక ముగింపు గలదు. చదువరి శాస్త్రియగుటకై చదువు నేర్చును, దండు జయించు గోరి జగడము చేయును, వ్యాపారి సంపాదనకొరకు వర్తకము చేయును, కాపు పంట నాశించి విత్తనము వేయును, జెట్టి తన్ను గాపాడుకొనుటకై సాము నేర్చును, ప్రయాణికుడు ఊరు జేర త్రోవ నడచును. భృత్యుడు సంబళముకొరకు యజమానుని కొలువు గొల్చును. ఈ చొప్పుననే ఈ లోకములో మోక్షమునకు ప్రయాణికులుగా నుండు నరులు తమ ముగింపేమని యెఱిగి ప్రవర్తింపవలయు. మనుష్యుని ముగింపులు నాలుగు: 1. మరణము, 2. తీర్పు, 3. నరకము, 4. మోక్షము. ప్రతి మనుష్యుడు చచ్చుట నిశ్చయము; చచ్చిన వాడొక్కొక్కడు తన పాపపుణ్యములకు దగిన లెక్క జెప్పుటకై తీర్పు బొందును; తీర్పు బొందినవాడు పాపాత్ముడుగా నుండెనేని, నరకమే వానికి నిత్యగతి; పుణ్యాత్ముడుగా నుండెనేని, మోక్షము సదా వానికి సంభావన. ఇది వేదసత్యము. సర్వేశ్వరుడు మనుష్యుని సృష్టించినపుడు, వాడు పుణ్యమార్గమునందు నడచి మోక్షము ననుభవింప కలుగ జేసినారేగాక పాపపుత్రోవల ద్రొక్కి నరకమున బడుటకు వాని కలిగించినవారు గాదు. అప్పటికి నిప్పటికి నెప్పటికిని దయగల సర్వే

రుడు, సకల మానవులు పరదేశమగు ఈ ప్రపంచమున పుణ్యపు ద్రోవగా నడిచి, మోక్షములో సుఖ మనుభవింప గోరుచున్నారేగాక, మరియొకటి గాదు. అయినందున మనుష్యుడు మోక్షమును తన యథార్థమైన ముగింపుగా నెంచుకొని, ఇందుకైన పరమ శాస్త్రమును నేర్వను, ఆ పరమరాజ్యముకొరకు పోరాడను, ఇందుకైన పుణ్య వ్యాపారము జేయను, ఆ పరమ ఫలమునకైన పుణ్యపు విత్తనమును విత్తను, ఇందుకైన పుణ్యసాధన చేయను, స్వదేశమై నిత్యసుఖమైన మోక్షము జేర పుణ్యపు ద్రోవలో నడవను, ఇట్టి సంభావనకొరకు సమస్తమునకు యజమానులగు దేవుని కొలువు కొలవను, తగిన బలమైన దృష్టాంతములగుండ, ఈ లోకముయొక్క అనిత్య సుఖమంతయు మాయ యని, పాపము సర్వేశ్వరునికి పొందని ద్రోహమని, నరకముయొక్క కఠోరమైన నిత్యాజ్ఞలు మహా భయంకరమైనవని, మోక్షము ఈడులేని మహా నిత్యభాగ్యమని, పూర్వమున పరమానందస్వాములవారు తెలుగు జనులకు బోధించి ఆంధ్రభాషలో ''అనిత్యనిత్య వ్యత్యాసము'' అను ఈ మహా ప్రబంధమును వచన కావ్యమున రచించిరి. ఇట్టి శ్రేష్ఠమైన పుస్తకమును గొప్ప చేసి వ్యాపింప జేయుట మహా యుక్తమని విశ్వాసపరులైన కొండవీటి మర్యన్న గారు పద్యకావ్యముగా జేయించిరి.

తెనుగున సత్యవేద గ్రంథములన్ని అచ్చువేయబడక, గలించుట జూచి ఇది గొప్ప పని యని ప్రయత్నించి, ''అనిత్యనిత్య వ్యత్యాసము'' అను ఈ ప్రయోజనకరమైన పుస్తకమును అందరికి నుపయోగముగా వచనమునను, పద్యకావ్యమునను అచ్చువేయించి, ప్రకటించితిమి.

క॥ వినినంతె చాలునంచును—మనమందుఁ దలంపకుండ మహా పుణ్యముచొ
 ప్పున మీచేనగు మాత్రము—దనర న్నడువంగవలయు దద్దయు భక్తిన్.

ఉ॥ కారణదివ్యసద్గురుని, కర్తను, దేవుని, జేసునాథునిన్
 ధీరుని, నా మహామహుని, దివ్య పరాత్పరుఁ జేరుపెట్లనన్:
 సారసుధీరసజ్జతను సన్నుతి జేయుచు నాత్మ శ్రీగురున్
 గౌరవమెంచగా బరమకారణ కర్తను జేరనయ్యెడిన్.





# THE DIFFERENCE BETWEEN THE TEMPORAL AND THE ETERNAL.

## PREFACE TO THE THIRD EDITION.

Judging from the many manuscripts even now found amongst our Christians, it seems there was in former years no book so much appreciated by them as the *Anitya Nitya Vyatyasum.* The same is proved by the fact that the book has been rendered into Tamil and Telugu poetry.

Rev. J. NIERENBERG, S. J., published in Spain during 1640 a book called *"The Difference between the Temporal and the Eternal"* which was, within a few years, translated into most European languages. (1) The *Anitya Nitya Vyatyasum* is certainly not a translation of the said book, which is much larger. But as the arrangement of the two books is the same and as even the same examples are quoted, one cannot but think that the writer in India had at least in his mind the work of Father NIERENBERG.

(1) English edition: Dublin, James Duffy & Co.

The author of the Tamil book seems to be REV. J. MAYNARD, S. J., who laboured in the Tamil country from 1661-1717. (cf. Fr. Besse S. J., App. to Cat. Patrum, S. J., in Miss. Mad.) In the Telugu poetry the priest is called *Paramananda guru*, (1) but it is not known whether this is the Indian name of Fr. MAYNARD, because he is one of the few priests, whose vernacular name, being unknown, is not given in the above list.

The Tamil edition published in Pondicherry says in the preface, that the *Anitya Nitya Vyatyasum* must have been written originally in Telugu, because it contains Telugu history. This remark seems to refer to the description of the fall of the Telugu kingdom of VIJAYANAGAR. However, no argument can be drawn from this, because the fall of that Telugu kingdom (1565) seems to have been known so well in Europe, that even FR. NIERENBERG himself described fully in 1640 the fate of its last king VENCATAPPA, in the chapter on the "*Littleness of Things Temporal.*" Moreover the first Telugu edition particularly contained many Tamil words, which would indicate a translation from Tamil.

The Tamil poem does not contain more than a dozen stanzas for each "*Vyatyasam*"; but the Telugu poem is larger and has been worked out as a large *Prabandham* containing a preface with four cantos.

The poet is a Vaidika Brahman, viz. SAMANTAPUDI MALLAYA, (2) son of PAPANNA of the Kasyapa Gotra. His name does not seem to be known in Telugu literature.

Following the custom of other Indian poets he gives in the preface several particulars about the writing of his *Prabandham*, but unfortunately he does not give any clue to the place where, and the time when his poem was written.

(1) పరమానంద గురువు.

(2) సామంతపూడి మల్లయ్య.

He composed it at the request of KONDAWITI MARYANNA, whose family, as mentioned in the preface, is given below. Perhaps some of our Catholic Kammas know enough about their forefathers as to be able to trace them in this list:

కొండవీటి చిన్నయ్య

పాపన్న × సుబ్బమ్మ

పెద్దన్న – గాదన్న – కొండయ్య – సూర్యన్న × అక్కమ్మ

చిన్నయ్య

We need not literally believe all that the poet says about the fame and power of Maryanna. Such descriptions are found in every preface of Indian poetry. However it seems that in those days the Kondawiti family must have had some influence. The fact alone that MARYANNA caused a "*Prabandham*" to be written (one of the seven *santanams*) seems to prove this.

From old manuscripts it is shown that the Brahman poet dedicated his book to MALLIKARJUDU (he who is white like the Jasmin) the name under which SIVA is honoured at the famous temple of SRISAILAM in the KURNOOL District. (1) Hence the prayers and invocations with which all Hindu poets open and close a canto, are all in honour of Siva, as well as the customary *Shashthyantumulu* (2) at the close of the preface.

The Christians usually copied these verses; but the first printed edition by Frs. *Rajanadar* and *Balanadar* (1881) did away with them,

(1) మల్లికర్జునుడు, (2) షష్ఠ్యంతములు.

keeping only those verses that could be applied to God in general. Moreover the word *Jesunadu* was substitued wherever "*Mallikarjudu*" occurred, and the preface closes with the word "*Sarveswara*", which was inserted instead of the six *Shashthyantumulu*.

In the two former editions the poetry, viz., preface and four cantos, was printed after the prose. But, as in other Indian books, there was no natural division between these cantos, which even began in the middle of a *Vyatyasam*. In the present edition a new division has been adopted; the poetry has been divided according to the different *Vyatyasams*, and after the prose of each the poetry is given. This division is the more natural, because, as stated before, the cantos began and closed abruptly, on account of the opening and closing verses having already been omitted. The prose can now be used as a kind of *tika* to the poetry.

The 14th "*Vyatyasam*" has no poetry. It seems to have been a later addition, since it was not even printed in the first edition.

The poetry of this book is certainly not of a high class and cannot stand comparison with the two other Catholic *Prabandhams*, viz., the *History of Tobias* and the *Vedantarasayanam*. But it is easier, and this may be the reason why it was liked so much by the Christians.

I March 1926. ST. JOHN'S PRESS,
NELLORE.



శ్రీ సర్వేశ్వరాయనమః.

# అనిత్యనిత్య వ్యత్యాసము.

## అవతారిక.

శా॥ శ్రీసాయుజ్య పదంబు నబ్బుటకునై చింతించెద న్భక్తి సం
భాసచ్చేతను, చేతశ్రేయసపదోద్భాసున్, మహోల్లాసునిన్,
శ్రీసర్వేశ్వరుని, న్మహామహుని, రాజీవాప్త కోటిప్రభా
భాసాకారు, నిరంజనున్, వరగుణున్, బ్రహ్మాండ భాండోదరున్.

మ॥ పరమైక్యప్రదమై, నిరామయమునై, పంకౌఘ సంహారమై,
పరమై, శాశ్వతమై, నితాంతకరుణాపారీణమై, యప్పరా
త్పరమై, నిర్గుణమై, నిరంజనమునై, బ్రహ్మాండ సంపూర్ణమై
పరఁగుం దత్త్వము దాని నెంతు నెద మత్ప్రాభీష్ట సంసిద్ధికిన్.

వ॥ అని యనేక లోకాధీశ్వర స్తోత్రంబు కావించి యెద్దియేనియు నొక్క
మహా పుణ్యేతిహాసంబు నాంధ్రభాషను రచియింపం దలంపు గొనియుండు
సమయంబున.

సీ॥ తన ఘనశ్లోకాంకతతులు సాంసారగ-సౌధప్రవీథుల సౌరు దేరఁ,
దన శౌర్యదావాగ్ని దర్పితారాతి గ-హనమును దరికొని కనలుచుండఁ,
దనదు వితీర్ణ కాంతామణుల్ సంతాన-విషభృత్సురభులతో వియ్యమందఁ,
దన మహాభాగ్య పద్మహితోదయము సమ-స్తార్థి దారిద్ర్యసంతమస మడఁప.

తే॥ వెలసి పొగడందు ఘన కొండపీటికుల క

లశపయోధి శశాంకుఁడెలమిని జిన్న
నృపతి పౌత్రుండు, పాపన్న నృపతి సుతుఁడు,
రమ్యరుచిహేళి మర్యన్న రాజమౌళి.

వ॥ వెండియుఁ బ్రచండవిక్రమభుజాదండతాండవితమండలాగ్రఖండితారాతిమండలుండును, దారాపటీరహారకర్పూరకైరవాప్తక్షీరపారావార పుండరీకాఖండలతుండిపాండురా సాధారణ రమణీయ కీర్తిసాంద్రుండును, గౌండవీ ట్యన్వయాంబునిధి సంపూర్ణ పూర్ణిమా చంద్రుండును, సుబ్బమాంబా గర్భపావనుండును, పాపన్నభూపాల పుత్రుండును, రసికాగ్రేసరుండు నగు మర్యన్న క్షితీశుండొక్క నాఁ డఖిల విద్వత్కవీంద్రనియోగామాత్య పురోహితవైయాకరణతార్కిక మీమాంసక పరిహాసకేతిహాసకపౌరాణిక వందిమాగధసుహృద్బంధుసేనానాయక సహితంబుగా నాస్థానమండపంబున మధురాలాపగీతవాద్యనృత్యవినోదలీలాకుతూహలమానసుండై యుచితాసనంబున సుఖాసీనుండై,

మ॥ తన గారాబు సహోదరు ల్మగురు పెద్దన్నాహ్వయుండుఁ, సుధీ
ఘనుఁడౌ రాయన నామధేయుఁడును, విఖ్యాతి న్వచోప్రౌఢతా
గుణికొండయ్య సుధీరుఁడుఁ, గరిమ బాగొప్పంగ ధర్మప్రవ
ర్తనచే సంతసమందె సంభ్రమము చెందఁ సాహసోత్సాహియై.

మ॥ ధరఁ గీర్తింపఁగఁజాలి యెంతయును సత్యస్ఫూర్తితో నాశ్రిత
స్థిరచింతామణి, సాధ్వీమానవతి పాతివ్రత్య నిష్ఠాధురం
దర సద్భాగ్యవతీలలామ కరుణోదారాత్మ యయ్యక్కమాం
బ రహిఁ భార్యగ నొప్పుచుండెఁ దనకుం బ్రామోద మింపొందఁగఁ.

తే॥ మానినీరత్నమౌ నక్కమాంబయందుఁ,
దనకు గారాబు ముద్దులతనయుఁ డెలమి
గలిగి సద్గుణమణిగణాకరుఁ డనంగ
చిన్నయాహ్వయుఁ డెంతయుఁ జెన్నుమీఱె.

సీ॥ చెలఁగి చేఁజాఁప నేర్చిన నాఁటనుండియు-నరులపై చేఁజాఁప గరిమ నేర్చె
ననిశంబు నడుగుఁ బెట్టిన నాఁటనుండియు-నరుల శీర్షములపై నడుగుఁబెట్టె,
నవనీతము గ్రసించినఁ నాఁటనుండి య-రుల యశోనవనీతములు గ్రసించె,
ఘనతగా నిలువ నేర్చిన నాఁటనుండి య-రుల సేనలను గెల్చి నిలువ నేర్చె

తే॥ నౌర ఘనకొండవీటి మర్యన్ననృపతి
తనయుఁడగు చిన్నయేంద్రుండు ధరణిఁ బ్రబలెఁ
బ్రబలుచున్నాఁడు జగతిని బ్రబలఁగలఁడు
ననఁగఁ బొగడందుఁ దంద్రికానంద మొదవ.

వ॥ ఇట్లు పుత్రమిత్రభ్రాతృజనసంయుతంబుగా సమ్మోదంబులో నిప్పశస్త సంతానంబునుం బడయం దలఁచి,

తే॥ పిలువఁ బనిచి నన్నుఁ బ్రీతితోడను జూచి
పలికె సకల మిత్ర బంధుజనము
లాలకింప ముదమలరఁ గొండవీటి మ
ర్యన్న ధీరమాళి యాదరమున:

క॥ సామంతప్రాఁడివంశ శిఖామణి మల్లయ, కవీంద్ర, కరమొప్పఁగ నీ
వామోదముగ రచింపుము-ధీమసమునఁ గావ్య మాదిదేవాంకితముగ.

ఉ॥ ఈసుమనీష, నీవు రచియింపఁగఁబూను ననిత్యనిత్యవ్య
త్యాసము సుప్రబంధము మహాంధ్రవచోనియతిరి రచించి స
ర్వేశున కంకితంబు విన వేడుక యానటు చేయు మెన్నఁగా
భాసురతం జమత్కృతిని బాయక, మల్లయసత్కవీశ్వరా!

వ॥ అని బహుమానపురస్సరంబుగా సుగంధద్రవ్యంబులు మదీయాంగంబునం బరిలేపనంబు చేయుచు జాంబూనదాంబరాభరణ ధనసహితంబగు తాంబూలంబొసంగుటయు, నేనును సంతుష్టాంతరంగుండనై కొంతప్రొద్దు కవితాప్రసంగంబు కావించి,

క॥ కృత్యంకితంబు చేసెద-నిత్యానందమయరూపనిఖిలేశునకుఁ
నిత్యం "బనిత్యనిత్యా-వ్యత్యాసం" బనఁ బ్రబంధవైఖరి వెలయఁగ.

వ॥ సర్వేశ్వరునకు నంకితంబుగా నా యొనర్పం బూనిన యనిత్యనిత్యవ్యత్యాసం"బను మహాప్రబంధంబునకుఁ గథా క్రమం బెట్టిదనిన,

జేమ జో.

# అనిత్యానిత్యవ్యత్యాసము.

## వివేకము.

సృష్టించుటకును, ప్రతిపాలించుటకును, నయముచేయుటకును, సర్వశక్తులయిన పరమ కర్తలు పరమగతి యనెడు మోక్షభాగ్యమును మనుష్యుడైనవానికి ఇయ్య చిత్తముగలవారై యుండుటవల్ల, మనుష్యుడు అటువంటి పరమగతిని సులభముగా పొందదగినట్లు ప్రపంచ వస్తువులను అందుకు ఒక యత్న సహాయార్థముగా నుండ కట్టడచేయ నవధరించిరి. ఇట్లుండగా మనుష్యుడు లోకపుమేలులను పరమకర్త కట్టడచేసినరీతి న్యాయముచొప్పున అనుభవింపక, క్రమము తప్పి అవియే తనకు పరమగతియని యెంచి ఆశాపాశముచే వానిని ఎడబాయని పట్టుదలతో కోరి వర్తించుటవలన, తన రక్షణమునకు విరోధము కలుగచేసికొనుచున్నాడు. ఇదియునుగాక, ఈ ప్రపంచ వస్తువులు మనకు మేలొనర్చ కలిగింపబడి యున్నను, మనుష్యుడు వానిని అక్రమముగా ప్రయోగించి వానిని అనుభవించుటవల్ల పాపములలోబడి తనకు నరకాజ్ఞ ప్రాప్తమవునటుల జేసికొనుచున్నాడు. తాను కొన్ని దినములు సుఖించెడు అనిత్యమేలులను నమ్మినందువల్ల తనకుగాను కలిగింపబడియుండు నిత్య మోక్ష రాజ్యమును నెడబాపు కొనుటయేగాక, ముగింపులేని నరక ఆజ్ఞలకు ప్రాప్తుడై పోవుచున్నాడు. అందువల్ల నరకమందలి కఠోర ఆజ్ఞలకును, మోక్షమందలి భాగ్యమునకును, గలిగియున్న భేదము ఎంతయని ఈపుస్తకమున కనబరుప బడుననుటవల్ల ఈ ప్రబంధమునకు "అనిత్యనిత్య వ్యత్యాస"మను పేరియ్యబడెనని ఎరుగగలవారలు.

అయితే, మోక్ష నరకములు చూచిన వారలెవ్వరని కొందరు బుద్ధిహీనులు చె

ప్పినట్లు నీవు నీమనస్సున తలంచను రాదు, చెప్పనురాదు. ఎందువల్లనన గ, నీఆత్మను, నిన్నును సృష్టించిన పరాత్పర వస్తువును శరీర కన్నులచే కానకయున్నను నీకు ఆత్మలేదనియు, దానిని సృష్టించిన పరమకర్తలేరనియు చెప్పవుగదా? అవ్విధముననే, మోక్ష నరకములను నీవు చూడకయున్నను అవి లేవని చెప్పసును, తలంచనునువద్దు. ఆలాగు చెప్పితివేని, దుర్గంధ నరకము లో బడినవారలలో నీవును ఒకడవు అని తెలిసికొందువు. అందులో నీవు పడకుం డునట్లు ప్రపంచ మాయసుఖములు ఎటు వంటివనియు, మహోన్నతంబయిన మోక్షముయొక్క సంతోష భాగ్యము సత్యానందదాయకమనియు, నరకాజ్ఞ లంపటలు ఎంతయో కఠోరములైనవని యు, సమస్త మానవులకు వచ్చెడు మర ణము ఎటువంటిదనియు, ప్రత్యేకతీర్పును పొత్తుతీర్పును వగదెంచు టెందుకనియు, పాపముయొక్క దోషమెంతనియు, దేవుని యిష్టప్రసాదముయొక్క శ్లాఘ్యత ఎంతనియు, మనుష్యునిగతి యెటువంటి దనియు, సాధ్యమైనంతవరకు ఒక్కొక్క టిగా విభజించి వివరముగా చూపుదుము. ఇదిగో వీనిని నీవు చదివిన మాత్రమున, లేక వినినమాత్రమున చాలునని తలంచక, గ్రహించిన న్యాయములచొప్పున నీ చేతనైనమాత్రము నడువ తెగించి దృఢమనస్సులో నుంటివేసి పిశాచియ నెడు శత్రువును జయించెదువు. సుకృత పుణ్యములనుచేయు వీరశూరుడవగుదువు. కొదవలేని సన్మార్గమున వర్తించెదువు. నరకముయొక్క క్రూరబాధలకు వెరచి నిత్యానంద మోక్షములో జేరి మోక్షవాసులతోకూడ ముగింపులేని ఆనంద సంతోషమును నిత్యకాలము అనుభవించెదవు అని ఎరుగగలవాడవు.



# వివేకము.

క॥ ధరణీసురులాదిగ నర-వరులున్ జ్ఞానోదయంబు పాటిల నొక నాఁ
డరుదుగఁ బరమానందుని-గురునిగ భావించి చేరి గురుతర భక్తిన్,

చ॥ వినుతి యొనర్చి యంతటను విన్నప మొక్కటి చిత్తగింపవే
యనుచు బహుప్రకారముల నందఱుఁ బల్కిరి "యో మహాత్మ నీ
వెనయనిదేది లేదు, మము వేడ్కఁ గృతార్థులఁ జేయఁగా దయా
వననిధి, దివ్యమైన యొక భాష్యము మాకెఱుఁగంగఁ జెప్పుమీ.

క॥ పరమానంద, మహాత్మా-పరతత్త్వజ్ఞానబోధ పరమార్థంబుం
బరమ పరాత్పరు సర్వే-శ్వరునిం జేరఁగ నెఱవాసంగవె మాకున్.

క॥ సర్వేశ్వరు వినుతించిన-నుర్విం బాపంబు దొలఁగి నొప్పును మాకున్,
నిర్వాణ మబ్బుఁ గావున-సర్వేశ్వరు భజన సేయ శక్తి నొసఁగవే?"

వ॥ అని యివ్విధంబునఁ గోరియాడుట విని యవనీసురాది మనుజుల నవలోకించి
పరమహర్షసమేతుండై పరమానందుం డిట్లనియె:

తే॥ వినుఁడు నరులార, మీకు నే విశదముగను
జెప్పుచున్నాఁడ ఘనభాష్య మొప్పిదముగ
నయము మీఱంగ మీకు నానంద మొంద
సద్గురుకటాక్షమున మీరు సంతసిల్ల.

క॥ ప్రకటిత సృష్టిస్థితిపా-లకులై మఱి పరమ కర్తలైనట్టి మహా
యకలంక మూర్తియై తగు-సకలాంతర్యామియైన సద్గురుఁ గనుఁడీ.

సీ॥ పరమ కర్తలు చాలఁ బరమ గతియె నెడ మోక్షంబు నరులకు మొనసి యొసఁగఁ
గర్తృత్వమును గల్గి ఘన నయముఁ గలవార-లై తామ సుందరా, సద్భూతముగ
మానవు లటువంటి మఱి పరమగతికి-సులభంబుగాఁ బొందఁ బొనస చేసి
తగినట్టుగాను దద్దయుఁ బ్రపంచపు నేల-నిమిత్తమై యొక యన్నుమిడఁ దలంచి,

తే॥ పాయక ధరిత్రిఁ గట్టడి సేయఁ బూని
యంత మానవరూపియై యవతరించి
గర్భమై యొంపు మీఱఁగఁ గన్యయొద్ద
నుండి పుట్టిరి జేసుక్రీస్తుండు పుడమి.

# మొదటి వ్యత్యాసము.

## నరక వేదనయొక్క యెరుక.

కారణ దివ్య పరమ సద్గురుడైన జేసునాధుడు సత్యవేద సువిశేషములో ఆనతియ్యా నవధరించినదేమనిన: "శపింపబడిన వారలారా! నిత్యాగ్నిలోనికి వెళ్లండి" యను భయంకర తిరు వాక్యము వ్రాయబడియున్నది.

సర్వజీవకోటుల సృష్టికర్తలును, సర్వమునకు నధికారముగలవారును, దయాపరులునై యుండెడు పరమకర్త తమచే సృజింపబడిన మనుష్యులందరికి తమయొక్క ఘనతర సంతోషమగు నిత్యానంద మోక్షమును పాలించ చిత్తముగలవారై యున్నారుగదా. అయితే లోకరాజును సేవించువారలలో రాజుయొక్క మనస్సునకు ప్రియమగునటుల నడచువారలెవరో, వారలు మాత్రము తగిన బహుమానములను పొందుదురుగాని నడవనివారలు రాజు చేయు బహుమానమును పోగొట్టుకొనునదిగాక, ఆయన మనస్సునకు ఆయాసమును కోపమును రప్పించినందున ఆజ్ఞ అనుభవించుదు రన్నట్లుగా, సర్వమునకును రాజాధిరాజులై యుండెడు పరమ కర్తలైనవారు తాము సృష్టించిన మనుష్యులలో తమయొక్క తిరు చిత్తముచొప్పున నడచు వారలకు మాత్రమే ఆనంద మోక్షమును సంభావనగా పాలించుదుమని యెరుక చేయ చిత్తమైరి. ఇవ్విధమున కొందరికి మోక్ష మియ్యుడమును, కొందరిని నరకమున త్రోయడమును, న్యాయముతో తీర్పు నొసగుటయు అందరును ఎరుగుటకై, లోకము ముగియుకాలములో చచ్చినవారలందరిని ఆత్మ శరీరములతో కూడ లేపి, వారు వారు చేసిన పాప పుణ్యములన్నియు నందరికి తెలియచేసి, చెడ్డవారలనందరిని ఆత్మ శరీరములతో నిత్యనరకమున త్రోసి, మంచివారలందరిని ఆత్మశరీరములతో తమ వెంటగూర్చుకొని నిత్యానంద పదవికి తోడుకొని పోవుదురు.

క్రీస్తువులారా, మీరు ఈ విధమున నరకమున త్రోయబడెడు వారలలో జమపడినవారలు గాకుండ, ఇప్పుడే పరమ కర్తయొక్క చిత్తముచొప్పున నడుచుండి,

వారి చిత్తమున కొప్పి నడిచెడువారేమనగా, వారు కట్టడచేసిన వేదకల్పనల చొప్పున నడచుటయు చెడని పుణ్యములను అనుసరించుటయు, వారి చిత్తము చొప్పున వర్తించుటయునగును. పుణ్యములకు విరుద్ధముగా నుండెడు దుష్క్రియలగు పాపములను జేసితిరేని, కర్తయొక్క తిరు చిత్తమునకు ఎదురాడినట్టవును. ఇటువంటివారలకు దుర్గంధ నరకమే సిద్ధించును. అటువంటి నరకములో వీరు పడకుండ అందులో పాపాత్ములు పడెడు చెప్ప సాధ్యముకాని కఠోరాజ్ఞలను కూడినమాత్రము బైలుపరుప నెంచియున్నాము. మేము చెప్పెడి న్యాయములను మీరు గ్రహించి మీ జ్ఞాపకములో నుంచుకొని నిత్యానంద మోక్షమునకు హేతువైన పుణ్యములను మాత్రము చేయ నాశించి, పాపములకు వెరచి, రోసి విసర్జింతురను నమ్మకముచే దుర్గంధ నరకమును, అందలిబాధలును ఇట్టివని మీకు తెలియజెప్పెదము.

ఇదిగో భూమియొక్క పాతాళములో బ్రహ్మాండమైన గుహ యొకటి కలదు. అందులో గట్టుగానని సముద్రమువలె ఏతట్టును అగ్ని నెరుపబడినదిగాను, ఎక్కడజూచిన నాలుగు దిక్కుల అగ్ని జ్వాలలు బుసబుసమని ఎగయునదిగాను, సూర్యచంద్రులయొక్క ప్రభలు అందు పారక ఎప్పటికిని కారుచీకట్లు కమ్ముకొనిన గదిగాను, విషముగల దుర్గంధములు నిత్యకాలము విసరబడునదిగాను, ఎన్నిక కణగని కఠోర కుష్ఠవ్యాధులు మొదలగు రోగములు అన్నియు వృద్ధిచేయునదిగాను, భయంకరమైన పిడుగు లెడతెగక యురుముచుబడి చెలగుచు నుండునదిగాను, అక్రమమైన యొరలడముచే అయ్యో యని యేడ్పులు వినబడునదిగాను, ఆ శబ్దములు నాదారక వినబడునదిగాను, ఎంచకూడని పిశాచులు ఆర్భటించి మొత్తుకొనడములు పిక్కటిల్లి యుబికి వెక్కునదిగాను, ఒకటిగాక సకల అక్రమములయొక్క ఉనికియైన చోటుగాను నుండు స్థలమే నరకమని చెప్పబడును.

అందులో పడి కూలిన పాపాత్ములందరు నిత్యకాలము దుఃఖసాగరములో మునిగి, మడియక మండి, చావక చచ్చి కుళ్లక కంపుగొట్టి, ఎడతెగని తన్నులును దెబ్బలును పడి పాట్లుపడుచుందురు. ఇదియునుగాక పరమ కర్తచే శపింపబడిన పాపాత్ము లందరును స్వామి ద్రోహులైయుండుటవల్ల పిశాచులకు గులాములై, నిరంతరము నీచులై అవలక్షణము అరోచకముగల ఊదులై కంపుబట్టి, ఎప్పుడును నిర్భాగ్యులై, తీరని ఆకలిని సహింపరాని దాహమును అనుభవించి,

ఎడతెగక శరీరము వణకి వణకి, పండ్లు పటపటమని కొరుకుచు కోడికి మించిన కోపములో మనస్సున మండి నొచ్చి, దూషణవార్తలతో ప్రలాపించి, మంచి దోవ యైనను జెప్ప తెలియని బుద్ధిచెడిన అజ్ఞానులై, దుర్గంధ నరకమను కష్టపు గుంటలోపడి నిత్యకాలము ఒరలుచు నెడతెగక పొరలుచు, ఆరని అగ్నిసంకెళ్ల లో కట్టబడి, పిశాచులచే చెరబడిన వారలై అపనమ్మకములో వట్టిపోని కన్నీళ్లు రాల్చి యేడ్చి, రక్షణములేక ప్రలాపించి, నెనరులేని నిర్దయులై, తమ్మతామే మారని ఖండితమైన అరోచకములో ద్వేషించి, నరకమును విడిచిపోవ నాశించినను వెడలజాలక అగ్నిలో నదుమబడి ఎప్పటెప్పటికిని పాటుబడుదురని యెరుగుదురుగాక. ఇటువంటి ఆరని అగ్నిసముద్రమనెడు నరకమున పాపాత్ములు పడి మునిగినవెనుక అందులో నెప్పుడును అదుమబడి యుండుటవలన, వారల యొక్క కన్నులలోను, చెవులలోను, నోటిలోను, ముక్కులలోను కాళ్లచేతులయందును, రోమద్వారములలోను, తోలు, నరములు, ఎముకలు, కడుపు, ప్రేగులు, రొమ్ము, హృదయములోను, అగ్ని ప్రవేశించి వారల సర్వాంగములలో దూరి ఉబ్బి బైటికి వచ్చుటవల్ల ఆవమున వేసిన కశెలు మండులాగున నరకమున ఆరని కట్టెలై మండుదురు. ఇది యునుగాక, ఇటికల గోడలో ఒకదానిపై నొకటి నొత్తుకొని యుండునట్టును, గానిగలో చెరకు నలుగులాగునను, నరకములో బడియుండెడు దుష్టాత్ములు ఒకనిమీద నొకడు పడి ఒత్తుకొని నలిగి, సొక్కి, పడిన పాపై యగ్నిసముద్రములో అంత్యములేని కాలము శరణులేక తారికుంగి, గస ఆరక నరకబాధలు పడుదురు.

అయ్యో పాపాత్ములారా, ఇటువంటి బాధల ననుభవింపనో, పసలేని దుర్మతముల ననుసరించితిరి! ఈలాగు కాలి మండనో దబ్బరదేవుళ్లను ఏకవస్తువు అని ఆరాధించితిరి! ఈలాగు పెట్లుబడనో బీదల నుపద్రవపరిచి అహంకారులై తిరిగితిరి. ఇట్లు కంపుబట్టనో మీ శరీరములకు నీళ్లుబోసి మినుకుజేసి సొమ్ములు ఆభరణములతో నలంకరించుకొంటిరి! ఈలాగు వట్టిపోని కన్నీళ్లువిడిచి యేడ్వనో వ్యర్థ ప్రపంచపు మేలులమీద మనస్సు సంతోషించి కామలీలలే సుఖమని యెంచి తిరిగితిరి! ఇట్లు నిందలుబడనో, పరులపై నుంచిన పగ మర్మ విరోధములను చచ్చుపర్యంతము విడువనొల్లమని సాధించితిరి! ఈలాగు పిశాచులకు దాసులై పడియుండనో, సద్గురువు యొక్క వార్తలు మరచి నడిచితిరి! ఈలాగు అగ్నిసంకెళ్లతో కట్టబడనో ఏలినవారి

యొక్క కల్పనలప్రకారము నడువక యుంటిరి! ఇట్లు తాళగూడని ఆకలి, దాహమును అనుభవింపనో విధించబడిన ఒక్కప్రొద్దు ఉపవాసములను అనుసరించక పోతిరి! ఇట్లు ఈ కఠోరదారిద్ర్యమనుభవింపనో, పరదేశకులకు భిక్షమియ్యకపోతిరి; ఈ కష్టపు గుంటలోపడి పొర్లాడనో, పరస్త్రీలను అలమటపరచి కామాతురులై నడచితిరి. ఇట్లు మనస్సు తాళజాలని దూషణములచే నిందింపబడనో, నోటనుండి దబ్బర ఆనల దూషణలు కొండెములను నీచమైన వార్తలను చెప్పి హతము సాధించితిరి. ఈలాగు పిశాచికి దాసులై తగ్గి తన్నులు గుద్దులు బడనో, మీ యొక్క తలిదండ్రాదులను కొట్టితిట్టి శ్రమపరచితిరి? ఈలాగున కదలని కట్టెలవలెనే ఒకరిపై ఒకరు పడి మొత్తుకొని యుండనో, కట్టడచేయబడిన తిరునాళ్లను ఆదివారములను ఆచరింపకయు, అప్పపూజ కానకయు సోమరులై తిరిగితిరి! అయ్యో పాపాత్ములారా, ఇంకను మీరు కర్తకు ద్రోహులై మరణపర్యంతము నడచితిరేని, యిదిగో ఇప్పుడు చెప్పబడినలాగు ఇకమీదట దుర్గంధనరకములో నిత్యకాలము లెక్క కణగని బాధల ననుభవించుదురనుటకు సందేహములేదు.

ఇవ్విధమున సకల బాధలు నిండిన స్థలమగు దుర్గంధ నరకములో శపింపబడిన ద్రోహులు పిశాచులక్రింద కాలి మండుచుండుటయేగాక, ముందు ఈ లోకములో ననుభవించిన సుఖ చెల్వములలో కొంతయైనను కానకయును, బంధుజనులయొక్క సహాయము పొందకయును, మిక్కుటమైన దుఃఖసముద్రములో మునిగి మనస్సు మండి నొచ్చి కాలుదురు. ఓరి పాపాత్ముడా, ఇటువంటి దుర్గంధనరకములో బడి కఠిన ఆజ్ఞలు అనుభవించువారలను నీ జ్ఞాననేత్రములతో చూచుటలేదా? వారలు పాపప్రద్రోవలో నడిచినందున నరకమున బడిరి. వారలవలెనే నీవును పాపమును విడువక ఆ మార్గముననే సాధించి నడిచితివేని, ఈ దుర్గంధ నరకమే నీకు నివాస స్థలమగునని యెంచి, ఇదిగో యిప్పుడే, కాలముండగానే, పాపమును విడిచి పుణ్యమును చేయ నాశించునది కార్యములలో కార్యమని తలంచి, పూర్ణముగా మనస్సుతిరిగి శీఘ్రముగా నట్టి పుణ్యములను జేయవలెనని పద్దుపట్టుదుముగాక.

# మొదటి వ్యత్యాసము.

## నరక వేదనయొక్క యెఱుక.

వ॥ అవధరింపుము, తత్పరమానందుండు బోధార్థులైన మహీసురాది మానవుల
నవలోకించి, యోసుధీవరులారా, మీకుఁగాఠిన్య ఘోర నరక విధానంబును
వినిపించెద వినుండని యిట్లనియె.

ఉ॥ కారణ దివ్య సద్గురుని, కర్తను, దేవుని, జేసునాథునిన్
ధీరుని, నా మహామహుని, దివ్య పరాత్పరుఁ జేరఁబెట్లనన్:
సారసుధీరసజ్ఞతను సన్నుతి చేయుచు నాత్మ శ్రీగురున్
గౌరతచేయఁగాఁ బరమకారణ కర్తను జేరనయ్యెడిన్.

తే॥ పరమ కర్తలు సద్దయాపరులు తారు
పరఁగ సృజియించినట్టి యా నరుల కెల్ల
మోక్షమార్గంబుఁ జూపి సన్ముక్తి నొసఁగ
నవతరించిరి ధరణిపై నద్భుతముగ.

సీ॥ మను జేంద్రులనుఁ గొల్చి మాఱక సేవించి-భక్తిప్రియంబులఁ బరఁగు నరుల
కబ్బును దగినట్టి లిబ్బి సన్మానముల్,-గొలువనివారి కే ఫలము లేదు,
అదియునుగాక గర్వాంధులై రాజును-బరిభవించినవారు ప్రాణహాని
యంతటి యాజ్ఞఁ దా రనుభవింతురుగదా-సరిమించు గా లేని సకలమునకు

తే॥ రాజరాజాధిరాజులై రమణఁ దనరు
ఘనతగురువర్యు లపవర్గదణి యనంగఁ
బరమకర్తలు మోక్ష సంపదలు సేవ
చేసినట్టి నరుల కీయఁ జిత్తమైరి.

చ॥ క్రమమున నేర్పుగాఁ బరమకర్తలు తారు సృజించినట్టి లో
కమున మనుష్యసంతతులు గ్రక్కున స్వాములవారి చిత్తవృ
త్తి మఱవఁబోక యేక సుమతిం దెలివొందియు వారిఁ బాయకే

తము నిటు కొల్లు రేనియు ముదంబున నిత్తురు కామితార్థముల్.

క॥ ముదమునఁ గొలువని పాపులఁ-దుదిమొద లెఱుఁగంగలేని దుర్మార్గుల నా
తుదలేని నరకవార్ధిని-బిదపం ద్రొబ్బుదురు ఘోర పీడలఁ బొందన్.

వ॥ మఱియు సుగుణులగు కొందఱకుం దమ సదానందభరిత మోక్షసామ్రాజ్యం
బొసంగుటయు దౌర్భాగ్యులగు మఱికొందఱను నరకాబ్ధిం బడఁద్రోయుట
యు, నచ్చట వార లనుభవించెడు సుఖదుఃఖంబుల వృత్తాంతంబులం దెలియఁ
బఱిచెద వినుండు.

చ॥ కుజనుల నెల్ల నన్నరకకూపమునం బడ ద్రొబ్బి యంతటన్
సుజనులనెల్ల నేరుపున సొంపమరం దన వెంటఁ గొంచునన్
విజయసదానుహర్ష పదవీస్థలికిం, బరమాపవర్గసు
వ్రజమునకున్, దయా న్వడిని వర్ధిలఁ దెచ్చెదరో నిజంబుగన్.

సీ॥ సుమతులార, వినుండు సూటిగాఁ జెప్పెద-వీనులఁ పండుగగాను మీకు,
దురితాత్ములైనట్టి నరుల నెల్లను ఘోర-నరకంబులో ద్రొబ్బనైన పనికి
మీరును వారిలో మిళితంబుఁ జెందక-యిపుడు సర్వేశ్వరు నెంచఁదలఁచి
పరమకర్తను జేరి పరిచయింపుచు వారి-చిత్తాన కనుగుణవృత్తి నడిచి

తే॥ కొదవలేనట్టి పుణ్యంబుఁ గొలఁది లేని
పరమ సంతోషవార్ధిలో భవ్యముగను
నోలలాడుచు మోక్షంబు మేలులొంది
ఘన పరాత్పరవస్తువుం గానవలయు.

॥ దుష్కృతి సహవాసంబున-దుష్కృతమే కల్గుఁగాక, దొరకవు మేలుల్,
దుష్క్రియల నేమి ఫలమగు,-దుష్క్రియలగు పాపములకుఁ ద్రోవలు వినుఁడీ.

॥ పాపాత్ముల నిటు నరకపుఁ-గూపారములోనఁ ద్రోసి ఘోరతరాజ్ఞల్
వాపోవ బాధ లిడఁగా-నా పాపుల కెవరు శరణ మచ్చటఁ జెప్పుఁడీ.

॥ కాఁబట్టి సుగుణులైన మనుజులారా, మీరటువంటి నరకపాథోరాశియందుఁ బడ
కుండుటకై మేము చెప్పెడి న్యాయంబుల విని యాలోచించి మీరును వానిని
మనంబునం దలంచి నరకయాతనలకు హేతువులైన పాతకంబులకు వెఱచి
దుర్గుణకదంబకంబుల వదలి రోషించి సముచిత నిత్యానంద మోక్షంబునకుఁ
గారణంబై యుండెడు సుకృతం బాలించి పరమకర్తను జేరుటకు సుజ్ఞానోదయం

బు నొందుఁడి. ఇఁకనుఁ బాపాత్ముల కునికిపట్టగు నరకవిధానంబు వక్కాణించెద వినుండు.

సీ॥ భూతలంబున నొక్క పాతాళమను మహా-విస్తారమగు గుహ వెలయుచుండు,
నందు నపారమైనట్టి సంభ్రమువలె-నే వంకఁ జూచిన, దావవహ్ని
ప్రజ్వరిల్లుచునుండుఁ, బైపైన నెఱపఁగాఁ-బడినదై బుసబుస వడిగ నెగయు,
నదిగాక చంద్రసూర్యప్రభల్ పాఱని-చీఁకట్లు గలచోట్లు జెలఁగుచుండు,

తే॥ నెచటఁ జూచిన దుర్గంధమెల్లఁ గలిగి
విషపుఁ దెమ్మెర లేదెసల్ విసరుచుండు,
దురుసు గలిగిన పిడుగులు నుఱుము లెప్పుడుఁ
జెలఁగుచుండును, నరకపుస్థితి యిది యగుఁ

క॥ అందుఁ గల కఠిన యాతన-లందియు ననిశంబు దుఃఖమందుచుఁ బడువా
రందఱు సమయక సమసీయు-నందున గ్రుళ్లకయుఁ గంపు కొట్టుదు రిటుగాఁ.

క॥ భూతప్రేత పిశాచులు-నాతతముగ మొత్తుకొనుచు నదరి యఱవగా
నే తెఱఁగున దరి గలుగును- బాతకమున నరకమందుఁ బడు మనుజులకున్?

క॥ పురుగుల గుంటలలోపలఁ-దరియింపని క్షుత్పిపాసతర పీడితులై
నరులటు మునుఁగుచుఁ దేలుచుఁ-బొరలాడుచు నుండు చోటు పొందుగను నిదే.

సీ॥ తీఱని యాఁకలి యాఱని దప్పులు-ననుభవించుచుఁ జాల నంగమెల్ల
వణఁకుచుఁ బండ్లను వడిమీఱఁ బటపటఁ-గొఱుకుచు, దురుసైన కోపమునను
మనమునఁ దత్తఱమంది మండుచును దూ-షణలైన వార్తలఁ గణఁకతోడ
నటు ప్రలాపించుచు హాయని యేడ్చుచు-మొనయగ యోయని మొత్తుకొంద్రు.

తే॥ ఖలుల సర్వాంగముల నెల్ల కనల నగ్ని
ప్రజ్వరిల్లుచు నీలాగు బాధ పెట్టి
కాలుచుండ, ఖలుల్ నరకంబులోనఁ
గట్టలై మండుదు రెప్పుడు క్రమముతోడ.

చ॥ నరకమునందు నుండు కుజనావళి మేనులయందుఁ గల్గు రం
ధ్రములు దొమ్మి దాదిగను, దద్దయుఁ గల్గిన రోమ పంక్తులం
బెరఁగిన రంధ్రముల్, జెలఁగఁ బట్టుగ నన్నిటియందు నగ్ని దా
నెరయుచు మండి కాలుచును నెత్తురు మాంసము, కట్టెలోయనన్,

క॥ స్వామి ద్రోహులు నిర్విధ-మే మఱక బహుప్రకార మేద్బుచు నెంతో
వేమాఱు ప్రలాపించుచు-నేమిం దోపకయె నరక మెనయుదు రెప్పుడున్.

వ॥ ఇత్తెఱంగు నేనాఁటికి నెడతెగని నరక కూపంబున మునుఁగుచుఁ దేలుచు, నిలు
కడ లేని బాధలను స్వకర్మానువశంబున ననుభవించెడు వారలెవరనఁగ:

క॥ మర్మ మెఱుఁగక మనుజులు-దుర్మతముల ననుసరించి దుష్కృతులై దు
ష్కర్మములను మనసొప్పఁగ-బేర్మిని జేసిన, నరకము పెల్లుగ నగునున్.

క॥ దబ్బఱ వేల్పుల నొక్కొక-కబ్బమునన్ విని, చరితము ఘనమని మదిలో
నుబ్బుచు నమ్మిన, నరకము-దెబ్బలఁ బడియెదరుగాక తెలియక మనుజుల్.

సీ॥ కామించి పరభామఁ గవయఁ గోరెడు వారు,-పరవిత్తమున కాసపడెడువారు,
సత్యంబు వదలి యసత్య మాడెడువారు,-దీనులపైఁ బెక్కు దెగడువారు,
క్రోధాన నొకరిపైఁ గొండె మాడెడువారు,-పరదూషణోక్తులఁ బలుకువారు,
నిర్దయాపరులైన నీచాత్మలగువారు,-జీవహింసలు చాలఁ జేయువారు,

తే॥ చేరి నమ్మినవారలఁ జెఱుచువారు,
ధర్మశూన్యులు నగువారు, దారుణమగు
నరకవార్ధిని బడుదు రేనాఁటికైనఁ
దరణమునులేక కఠిన వేదనలనొంద.

క॥ ఈ తీరు దుర్మదాంధులు-పాతకమని తెలియలేక బలిమిని దురితం
బాతతముఁ జేసి, నరకో-ద్ఘాతల పాలవుదు రధిక ఘాతలఁ బడఁగన్.

వ॥ ఇవ్విధంబునఁ బాపాత్ము లేమియు నెఱుఁగక, ధర్మ శూన్యులై తల్లిదండ్రి గు
రువు దైవంబని యెంచక, మాతాపిత్రాదులు ఖేదంబులనొందఁ జేయుచు,
దురాచార దుర్వృత్తి దుర్మార్గంబులం జొచ్చి, పరమకర్తం దెలియక చచ్చి
కారాగార కాఠిన్య ఘోర దుర్గంధ నరక పాథోరాశియందు నందరాని యమి
తంబైన గాఢతరంబగు బాధలం జెందుదు రదియునుంగాక.

# రెండవ వ్యత్యాసము.

## నరకముయొక్క ఆజ్ఞ.

దుర్గంధ కష్ట బాధలు నిండిన నరక పాతాళ మనెడు అగ్నిసముద్రములో బడి మునిగినవారలు, వాడు వాడు చేతితో చేసిన పాపములకును, కంటితో గనిన దోషములకును, చేతులతో చేసిన ధోంగతనములకును, అంగములచే సుఖించిన కామచేష్టలకును, కాళ్లచే నడచిన అక్రమములకును, అక్రమముగా వాక్కుచే పలికిన దబ్బరలకును, చెవులచే వినిన చాడి కొండెములకును, ముక్కున వాసనించిన పాప సంబంధమైన వాసనలకును; జ్ఞాపకమున నాశించిన వాంఛలకును, మనస్సున కోరిన లీలాశలకును; తలంపుచే తలంచిన ద్రోహములకును, బుద్ధికి తోచి తెలిసి చేటు చేయ తెగించిన ద్రోహములకును, ఇదిగో వీని కన్నిటికిని తగిన మహా కఠోర శిక్షల ననుభవించుదురు. అదెటువలెననగ, ఇదిగో బ్రహ్మాండమైన యురుములును పిడుగులును నరకమున బడిన పాపాత్ముల యొక్క రెండు చెవులలో దూరి చీలి ద్రోవకాగా అచ్చట మహా దుర్గంధమైన గంధకము కరగి యేరై బ్రహ్మాండముగా పొర్లి చుట్టుకొని వాని వాని చెవులలో బారును. ఇదే వాడు చెవులచే జేసిన పాపములకు సంభావనయని తెలుసుకొనండి.

నోటనుండి దూషణములు, చాడి కొండెములు, దబ్బరానలు చెప్పినందుకు నిపుడు ఆరని అగ్నియనెడు నరకములో బడి కాలి మండుచుండుటను వారలు తెలుసుకొని పండ్లు పటపటమని కొరికి, నాలుక చీలి చిరునాలుక అంగిట నంటుకొని, చిగుళ్లు పగిలి, నోటిద్వారా నిప్పువలెను, నురుగువలెను, రక్తము దుముకగా ఓ యని యొర్లుచు మండుచుందురు.

శరీర మనుభవించిన కామసుఖమునకు శిక్షగా నిపుడు నరకములో కదలని కట్టెలవలె వారలయొక్క సర్వాంగములు నిప్పు అంటుకొని మండి చీలి అపార వ్రణమై, బురదయు నీరును ఊరెడు పీనుగులై, దుర్గంధమగు కంపుగొట్టి శరీరముయొక్క నరములు, తోలు, ఎముకలు, ప్రేగులును, ఈరువదొమ్మలును కడుపు

ను ఊడెక్కి, నలిగి నలిగి, నలిబడి పగిలి కంపుబట్టి, హృదయము పగిలి, తల చిప్ప చీలి, మండి కాలుచుందురు. అప్పటికైనను ఆరదో యీ బాధ? లేదు లేదు. ఈ వేదన వదలక యెన్నటెన్నటికిని కుళ్లక కుళ్లి, చెడక కంపుబట్టి, చావక చచ్చి, నిత్యకాలము బాధ ననుభవించుచుందురు.

కంటిచేత కనరాని ఆశతో కని నానా పాపములను సుఖించినందుకు నిదిగో వారల రెండు కన్నులలో అగ్నియేరు ఎడతెగక పారి బైలుదేరును. రెండు కన్నులు గ్రుడ్డివై పోయినను; పిశాచులు భయంకర రూపములతో నుండుటయును, నరకవాసులు కాలుచుండుటయును, అట్టివారు గిరగిర చుట్టుకొని పడి బెత్తరపోయి లేచుటయును, బుసపెట్టుచు గసబోయుచు వణికి వణికి పొర్లాడుటయును, తన్నులు త్రొక్కిక్లి పడి క్రుంగి క్రిందబడుటయును చూచి, తామును అట్లే వేదనల బడి బెదరి తత్తరపడి పదరి యేడ్చుదురు. కన్నీళ్లు విడిచి ఎంత యేడ్చినను వారల కన్నీళ్లు తరగక కారుచుండునని తెలియగలవాడవు. ఓరి పాపిష్టి, డీసిసి నీవు తలంచక యుండుటేమి? ఈ కఠోర బాధలన్నియు కొంచెమనియో ప్రతి దినము నీ కంటిమూలముగా కట్టుకొనెడు పాపములను మట్టుపరచక యున్నావు!

ముక్కునకు పాప హేతువైన వాసన నెక్కించినందుకు నిపుడు ఎడతెగక కష్టమైన నరక గుంటలో దుర్గంధపు పీనుగులయొక్క కుళ్లు కంపును ఎక్కించి అందుచే ముక్కు పగులగా దానిద్వారా పొగలులేచి మండి చుట్టుకొని ఎక్కగా ముక్కు గుండా శ్వాసమురాక దగజాట్టుకొని బుసపెట్టి దద్దరిల్లుచున్నారు. ఓరి పాతకుడా! ఇట్లు నరకమున బడి బాధపడెడు నరకవాసులను నీవు తలంచుట లేదా? అల్ప సుఖమునకుగాను గదా యింత నిష్ఠుర నిర్బంధముల ననుభవింప వలసి వచ్చినది.

ఇదిగో కూడని దానిని మనస్సున ఇచ్ఛగొని ఆశించినందుకు, నెన్నటెన్నటికిని నారని నరకమున బడి తన్నుతాను అగోచించి, ఖండించుకొని, కాలి మాడి నొచ్చి భ్రమసి క్రుంగి క్రిందిట్లు మీదిట్లయి పదరి, అపనమ్మకములో నాలుక కొరుకుకొని గొమ్ము గుద్దుకొని పగులగొట్టుకొన యత్నించుదురు.

భోజనప్రియము ననుసరించినందుకు శిక్షగా ఘోరమైన నిప్పులో బడి కాలి మండి, ఆకలిదీర దాహమార నొక పిడికెడు తవుడును చేరెడు నీళ్లును సహితము కానక, మనస్సు మండి యరచి యరచి నోరుపగిలి, నాలుకనుండి నక్కిళ్లు పీయుబడి కడుపు వెన్నెముకకు అంటు

కొనిపోగా, వారు అయ్యయ్యో ఆకలిచే చస్తున్నాము, మూర్ఛిల్లుచున్నాము, తపించుచున్నాము, ఆకలితీర్చుకొన నేమియు కానమే, దాహము తీర నీరు కానమే, అలపు తీర నాదరవు కానమే, మఱి చెడ్డ పాతకులు మేమే యని ఇవ్విధముగా ఆర్భటించుచు నొర్లుచు చావక చచ్చి నిత్యవేదనల బడుచుందురు.

అయ్యో పాపాత్ముడా, యీలాగు నీ సర్వాంగమును గట్టుకానని అగ్నినరకములో నెల్లప్పటికిని కాలనికట్టెయై కాలి కంపుబట్టి పోవునది అల్పవేదన యనియో కామ సుఖమును నాశించి, శరీరదుర్గుణములను నణచక యున్నావు. నీ ముక్కులో నరకముయొక్క దుర్గంధమంతయు ఎక్కునది నీకు పరవాలేదనియో మోహసంబంధ పరిమళ వాసనను ముక్కున నాఘ్రాణించుచున్నావు, తల బుఱ్ఱ పగిలి చెవులు మూసికొని, కన్నులు చెడి, చేతులు కాళ్లు తెగిపడి, యెడతెగక నరకగుంటలో నిత్యకాలము పొర్లునది కొంచెమనియో ఆదివార అప్పపండుగలలో పూజకానకయు, అప్పు ఒక్క ప్రొద్దు ఉపవాసము లుండకయు, కడకు ఏడాది కొకసారియైన పాపవిమోచనము జేసికొనకయు నున్నావు. నిత్యకాలము దుర్మనసుగల పిశాచుల చేతులచే దెబ్బలు పడునది కొంచెమనియో ఆ పిశాచులయొక్క మంత్ర తంత్రములు పిల్లి శూన్యములు విని నేర్చి వానిని నమ్మియున్నావు. ముగియని నరకములో ఆరని కట్టెలయి మండునది కొంచెమనియో తల్లిదండ్రాదుల నిందించి కొట్టుటయు, చాడీ కొండెములు చెప్పుటయు, నపదూరు అభాండములను నాలకించుటయు మరి యిటువంటి మహా చావైన పాపములను విడువక చేయుచున్నావు. క్రూరమైన అసహ్యములో తన్నుతాను అరోచించి ఆరక కాలునది కొంచెమనియో పరులు చేసిన నేరముల నోర్వక చచ్చు పర్యంతము మర్మము సాధించి వైరాగ్యము పెట్టుకొనియున్నావు. నరకములో చావని చావు చచ్చునది తృణమనియో కొలపాతకము చేయ తలంచి దానిని నెరవేర్చవలెననియున్నావు. కఠోరబాధలలో కాలి, ఆరని దాహమును తీరని ఆకలిని అనుభవించడము కొంచెపాటిదనియో దరిద్రులయొక్క బీదతనమునకు మనస్సు కరగక నీ చేతనైనంత సహాయము చేయకయున్నావు. ఎన్నటికిని నరక చెరసాలలో మూయబడి క్రూర పిశాచుల కాలి తన్నులను దెబ్బలను పడి చెప్పరాని బాధలనుభవింపనో పరుల సొమ్ములు దొంగిలించి తిరుగ వాటిని నుత్తరించక యున్నావు. నిరంతరము నింద యవమానములలో తన్నులు దెబ్బలు

గుద్దులు పడునది కొంచెమనియో యితరులను స్నేహించక నిందించి ఉపద్రవపరిచి నిష్ఠురుడవై తిరుగుచున్నావు. శరీరమంతయు పుండ్లై పుచ్చి పురుగులుపట్టి కంపుగొట్టునది గవమాత్రమనియో స్త్రీభోగము నాశించి నడుచుచున్నావు. ఓరి పాపీ! నీ పాపాక్రమములను విడువక యున్నట్లయితే ఇట్టి బాధలుగల నరకమున నిత్యకాలము ఊరట జెందక యుండెదవు అని యెరుగుదువుగాక.

ఇదిగో ఒకరాజు పిశాచిని క్షణముసేపు మాత్రము చూచినందువల్ల బుద్ధిభ్రమసి మూర్ఛపోయి క్రిందపడి చెప్పినదేమనగా: లోకము ముగియుపర్యంతము గనగన మండెడు అవములో నన్ను వేసినను సహించి యుండుదునుగాని నేను చూచిన పిశాచిని తిరుగ కనినట్లయితే మనస్సు సహించియుండలేననెను. ఓరి పాపీ వింటివో, ఒక పిశాచిని చూచినందుకే యింత భయంకరమైన భీతి కలిగియుండగా నరకము లెక్క కగ్గళిమైన పిశాచములను ఎడతెగక చూచునదిగాక, వానిచే నిలువక తన్నులు బడి విస్తరముగా బాధింపబడునది ఎంతఘోరమని కనుగొనకయున్నావు? ఒక పిడుగు ఉరిమినందుకు అనేకులు క్రిందబడి చచ్చియుండలేదా; నరకమునననో [illegible]నగా: బ్రహ్మాండమైన యురుముల యొక్కయు పిడుగుల యొక్కయు శబ్దము లెడతెగక కలిగినందుచేత ముంచుకొను భయంకరమగు పెట్ల సందడినిని లెక్కలేని పిశాచులు ఒర్లెడి యొర్లడమునను నరణిత పాపాత్ములు అభయమడిగి ఆర్భటించెడు ఆర్భాటములనును నెట్లు ఓర్చియుండెదవు.

ఇదిగో యీ లోకములో గల యురుములను, పెట్లదుమ్ములను, పెద్ద నగారులను ఇంకను మరిగల శబ్దములు ఒక స్థళమున యేకముగా కూర్చి బోరుకొల్పినను దుర్గంధాగ్ని నరకములో వినబడు సందడికి ఈడుచేయ బూనినను ఇవియన్నియు ఒక పక్షి యొక్క యీలకైనను సరిరావని ఒక మహాత్ములయినవారు ఆనతిచ్చినది వినలేదా? అయ్యయ్యో పాతకుడా, ఇంత కఠినమైన ఆజ్ఞను నెట్లు ఓర్వవలెననియున్నావు. ఈ లోకమున ఒక పిశాచి ఒక పాపాత్మునికి కనిపించి నరకము యొక్క అగ్ని రవ నొకదానిని వాని చేతిమీద విడిచినతోడనే చేయి రెండుగా పగిలి గండిపడునట్లుగా చీలి యుండెను. స్వల్పమునకే యిట్లుండగా గట్టుకానని అగ్నిసముద్రములో నిత్యకాలము సర్వాంగమును కాలి మండి ఉడకడము ఎట్లుండునని వర్ణించువారలెవరు? కావున పాపాత్ముడా, కాలముండగనే జ్ఞానకన్నులు తెరచిచూడరా.

నరకమున బడినవారలు మేము తెలిసియు నిక్కడ పడవలయుననియే పడియున్నామని తమ బుద్ధి యెరుకచే నెరిగి యుండుటవల్ల, అట్టి వారల మనస్సునకు చావని చావై యుండి ఎల్లప్పుడును వారు గొణగునదేమనగా: మా బుద్ధి చెడి స్వామికి ద్రోహము జేసితిమి, నరకాగ్నియో మునుగియదు. ఈ యాజ్ఞలు మునుగియనివియు మారనివియు నిత్యకాలముండునవియునైన నరక వేదనలు అనుభవించవలెను. వేదకల్పనలను మీరి తెలిసియు ఈ నరకమున బడితిమి, మతి చెడ్డ వారలమైతిమి, నిత్యముగా చెడితిమి, బుద్ధి సామర్థ్యములచే నేర్చిన శాస్త్రములను, నభ్యసించిన విద్యలను మరచి యిక్కడ కాలుచున్నాము. భూలోకమున చెలువముగలవారమై యుంటిమి. మహిమ గౌరవము సొగసుగలవారలమై యుంటిమి. అనేకానేక సుఖ భాగ్యములను అనుభవించితిమి. ఇప్పుడు వానిలో నొకదానినైన కానక నీచులవలె పిశాచులచే తన్నులును కఠిన బాధల ననుభవించుచు నరకమున ఆరని మంటలలో మండెదరు.

పాపాత్ములారా, ఈలాగు ఆరని అగ్నిలో కాలడము మీకు గుణమా? పరమగతిలో ఘన సంతోషానందమున ఉప్పటిల్లడము మేలా? పై చెప్పినట్లు నీచులై నిందబడ మీకు నిష్టమా, మోక్ష రాజ్యంగ భద్రాసనములపై కుశలమైయుండ మీకు నిష్టమా? మీ జ్ఞాననేత్రములు తెరచి చూచితిరేని, మంచి త్రోవ నెరిగి యందులో మరణపర్యంతము కదలక నడుచుదురు. లేదా, పాపద్రోవలో నడిచితిరేని, యీ దుర్గంధ నరకమే మీకు అబ్బునని యెరుగగలవారలు.

# రెండవ వ్యాసము.

## నరకము యొక్క ఆజ్ఞ.

వ॥ అవధరింపుము. పరమానంద తాపసేంద్రుండు బోధార్థులైన సర్వాంసహా గీర్వాణాది మానవులకు సత్యంత కృపాపాంగ నిరీక్షణంబల మరల నిట్లనియె.

సీ॥ చేఁజేతఁ జేసిన చెడు పాపమునకుఁ గన్నులఁ గన్న దోషాల కెలమిఁ గోరి,
యంగాల సుఖియించినట్టి పాతకముల,-కలరు వాచోదోషములకు, నొనర
శ్రుతులార విన్న దుష్కృతముల, కమర నాఘ్రాణించినట్టి యకలుషములకు,
మనమున జ్ఞాపకమున నానఁగల కాంక్షనంటించునట్టి యయ్యఘములకును,

తే॥ బుద్ధి వెంబడి గుఱివెంటఁ బోయినట్టి
కల్మషములకు దుర్మదాఘంబులకును,
గఠిన దారుణ నరకసాగరమునందు
నిన్నిటికి శిక్షలెట్లన్న నెఱుఁగ వినుఁడి.

తే॥ మఱియుఁ జేఁజేతఁ జేసిన దురితములకుఁ
జెప్పఁ జూపఁగ రానట్టి గొప్పదైన
ఘోర యాతనలు నరకకూపమందుఁ
గలుగుఁ లెక్కకణఁగని యుగములలోన.

సీ॥ కన్నులఁ గన్నట్టి కల్మషంబున కటు-కన్నవ నెడతెగకయె కవించి
నిప్పు ఱేఱును బాఱఁ గుప్పున నంధుఁడై-పోయినంత, పిశాచభూతములును
ఘోర రూపములచేఁ దూఱి చుట్టుక యట్టి-పై కెక్కఁ బుసపెట్టఁ బడుచునుండి
దుఃఖించుచో వారి క్రొక్కుల తన్నుల-శాలయంబగుచును నదరి వణఁకి.

తే॥ కంటి కంకణములు వాగుగా తఱుగక
శాంతి బోవును, బాధల తరణమెన్న
టికిని లేకుండ నొందును సంకటంబు
వాని పరితాప దుఃఖ మేమనుదు నిపుడు?

క॥ అంగంబుల సుఖయించెడి-వెంగలులకుఁ గలుగు నరక వేదనలను నే
భంగి యని చెప్పవచ్చును,-పొంగించును వాని మేను పొరిపొరి వహ్నుల్.

క॥ వాచాదోషము లాడెడి-నీచునకు న్నరకమందు నిచ్చిన తప్త
తాచారిణిభూతాది పి-శాచులచేత శ్రమ బాధ సరగునఁ గలుగున్.

క॥ చెవులార విన్న యఘములు-కవును పిశాచములచేతఁ గడు దుఃఖంబున్.
అవమాన నింద సెపముల-నవి మొదలుగ ఘోరనరకనాదము వినఁగన్.

క॥ నాసామూలము వచ్చిన-దోసముచే నొందుదు రిటు దుర్గంధంబున్
వేసారి నరకమందు ని-వాసించున్, బాధలొందు వహి యెట్లన్నన్:

సీ॥ ఎడతెగకయె బాధలిడు ఘోరదుర్గంధ-నరకంబులోఁ బడి నలిఁగి నలిఁగి,
పురుగుల గుంటలోఁ బొరలాడఁ బ్రాప్తులై-ప్రేతములు పిశాచ భూతములును
జేరి బాధింపఁగఁ, జిచ్చుమంటల సెగలో - పొగలు మెండై చుట్టుఁ బొగలుచుండ;
తలపండు పగిలి తద్దయుఁ గర్ణములు మూసి-కొనిపోయి చెయికాలు కుంటు పగిలి

తే॥ పగలు రేయును గానక మిగుల నొగిలి
దిగులుగొని యో యటంచును దగుల నేడ్చు
నిటుల నాసిక మూలాన నెలయు దోస
ములఁ బ్రలాపించుచుందురు మూఢజనులు

చ॥ నరములు గుండెలుం బొలసు నక్కను శల్యము లెల్ల బ్రేవులున్
దురుసుగఁ గుక్షిలోఁ గలఁకతోడ నలింబడి స్రుక్కి తారి యా
కరములుఁ గాళ్లునుం విరిగి క్రంది ప్రలాపములోడ నమ్మహా
నరకమునందు నివ్విధమున న్మదిఁగోరెడు పాపు లేడ్వఁగన్,

క॥ తను దానసహ్యమొందుచు-మనమున ఖండనము నంది మండుచు మూర్ఛం
గనలేక జిహ్వ గరుచుక-తన రొమ్మును గొట్టుదురది తద్దయు వెసతో.

సీ॥ తల్లితండ్రాదుల తల్లడిల్లఁగఁ దిట్టి-కొట్టు దుర్మార్గులు, నెట్టనమునఁ
బాడి దప్పి యసత్యభాషలఁ నన్ఋతాలఁ- జాడివార్తలఁ జెప్పు ప్రోడలెల్ల,
సరిపోని దుర్గంధనరకంబులోపల-నాఱని కష్టులై యందు సెగల
పొగలచే మండుదు రగణితంబుగఁ దమ్మ-తా మరోచించుచు, దనివి లేక.

ఆ॥ కడుఁ బిశాచమంత్ర ఘనతంత్ర యంత్రముల్
నేర్చినట్టి నరులు నెవ్వరైన
ఘోరమైన నరకకూపంబులోఁ బడి
పొరలుచుండుదురు కుబుద్ధి వలన.

మ॥ పరవిత్తంబుల దొంగిలించిన మహాపాపాత్ము లేనాఁటికిం
దరణోపాయములేక నిందితులునై దావాగ్నిలోఁ జొచ్చి యే
మరకే వేధలఁ జెంది యంతటను దుర్మార్గావమానంబులన్
దురుసౌ దెబ్బలు మిక్కలం బడుదురౌ దుష్టాత్ము లిభ్భంగిమై

సీ॥ కామినీ భోగసాంగ్యతమును నడిపెడి-వారలఁ నిరతంబు ఘోరమైన
నరకదావాగ్ని నేమఱక యే నాఁటికిఁ-గడతేరకయె మండఁగా నొనర్చి
బాధింతు, రదిగాక పరఁగ నొక నరేంద్రుఁ-డొక్కనాఁడు పిశాచి నక్కజముగ
వీక్షించి బ్రమసియు, తత్క్షణికంబున-మూర్ఛనొందియుఁ జాల మోస మాయె

తే॥ ననుచు భూమి ముగియుదాఁక నన్ను నావ
మందు గనగనమండెడు నగ్నిలోన

నుంచినను మిగుల సహించియుందుఁగాని
యా పిశాచినిఁ జూడ లేననియె మరల.

తే॥ ఆ నరేంద్రుఁడు క్రమ్మఱ నేను దిరిగి
యీ పిశాచినిఁ జూచినయెడల నాదు
మది సహింపదన, నరకమందుఁ జూడ
నిలుచునే యెవ్వరికైన నెమ్మనంబు?

ఆ॥ ఉఱుము నుఱిమి పిడుగు నరుదుగాఁ బడెనేని
నఱచి చచ్చువారు నరులు భువిని,
నరకమందుఁ గలుగు నుఱుముల పిడుగుల
యార్తరవములెట్టు లోర్తు రప్పుడు.

తే॥ ఒక మహాత్ముండు గనుఁగొని యోలి నరక
మందుఁ గల దుర్విధంబుల మనుజులార
యానతిచ్చిన తెఱఁగు మీ రాలకింప
విస్తరించెద శ్రద్ధతో వినఁగవలయు.

సీ॥ ఒక పిశాచి యమ్మహాత్మునకు దృశ్యమై యప్డు-నరకంబులో వహ్నినట్టె వాని
చేతిమీఁదను దన చేతిమీఁదుగ నొక్క-బొట్టు పిడిననంతఁ బట్టలేక
చెయి రెండు వ్రక్కలై చీలి మండెను గాన-నరకదావాగ్ని సాగరమునందు
దొబ్బిన నచ్చట గబ్బియై మునుఁగుదు-నేనాఁటికిం దరియించలేక

తే॥ బాధనొందుచునుందు రీభంగి నెప్డు
గనుక మానవులార నిక్కముగ వినుఁడి,
యట్టి వేధలఁ బడకుండునట్టు కాల
ముండఁగాఁ జేయుఁడి సుకృతముల సరగున.

వ॥ మఱియు నరకంబులోనుండు పాపాత్ములు మొరపెట్టు తెఱంగు వినుఁడి.

ఉ॥ కావలె నంచు నిందుఁబడఁ గావలసెం, దమి నొంది ముందు స
ద్దేవుని నమ్మకే రుచిరదేహమునందున సొమ్ముఁ బెట్టి హే
లావతులన్ సుఖించితిమి, లాలితశోభన రూపశక్తిచేఁ
గావర మింత చేసె నరకంబున యాతన లొందుచుండఁగన్.

మ॥ మును భోగించిన భోగభాగ్యసుఖసమ్మోదంబు లిందయ్యె యో

కనలేమొక్కటియైనఁ గానమకటా గాఢాగ్నికూపంబునన్
బెను సంకిళ్లఁ బడంగ నొందితిమి హా పెక్కండ్ల యోయంచు రో
దనముం జేయుచు నిట్లు బాధితులునై తాపింతు రెల్లప్పుడున్.

తే॥ మనుజులార వినుఁడు, మఱి పాపిజనులెల్ల
మోరలెల్లఁ జిన్న పోయి యేల
బుద్ధిలేని నిండు మూఢబుద్ధులమైతి
మయ్యయో యటంచు నప్పుడంద్రు

ఉ॥ మానవులార వింటిరె కుమానస పాపి జనాళి యివ్విధం
బా నరకాగ్నికంధిఁ బడి పాప మిదంచును నింక దేవునిన్
గానఁగలేక శ్రీ పరమ కర్తను జేర నెఱుంగ మాని యి
ట్లా కడు బాధ పొందుదురు లాలిత మోక్ష శుభంబునొందకే.

వ॥ ఇక్కడి మానవులకు నేమియు నెఱుంగని నేరమివలన భయంకర దుర్గంధ నరకాగ్నిపారావారంబునం బడరాని పాట్లు పడుటయు ముదంబో, లేక యనంత కల్యాణంబగు మోక్షరాజాంగ భద్రాసనంబున నివసించి నిత్యపరమానందగతి రాజ్యంబుఁ బాలించుటయు ముదంబో, యీ రెంటియం దొకటి స్వమనీషానుసారకర్మానువశంబు ననుభవింపవలయునుగాన సుజ్ఞానసంప్రాప్త పరమగతి కేగుట యుచితంబుగదా యని మతిమంతులైన వారెఱుంగవలయు నిత్తెఱంగున.

# మూఁడవ వ్యాఖ్యానము.

## నరకముయొక్క విశేష ఆజ్ఞ.

దుర్గంధ నరకమును కనినవార లెవ్వరనెడు పామరులయొక్క పలుకడమునకు తడకట్టుగా దుర్గంధ నరకములో సంభవించెడు విశేషాజ్ఞలు ఇట్టివని ఒక మహాత్ములైనవారు చూచివచ్చి చెప్పినప్రకారము మేము దానిని బయలుపరచెదము. పరాకులేక వినగలవాఁడవు:—ఇదిగో భూమియొక్క పాతాళములో కడగానని యగ్నిసముద్రమును కంటిని. అందులో నెన్నికకు నణగని స్వామి ద్రోహులు, సముద్రములోకదా చేపలు ఈదినట్టు, ఈది ఈదుచు నానా ఆజ్ఞలు పడ

నది కంటిని. అదెటువలెనంటే, ఒకనిని అనేక పిశాచులు పట్టుకొని అగ్నితో కట్టబడిన ఒక యిరుకటమైన స్థలములో నిష్ఠూరముగా నిలువబెట్టి దెబ్బలుకొట్టి కఠోరముగా కొక్కరించి బుస్సుమని వెక్కిరించి భయంకరముగ తన్నులు తన్ని వాని నడినెత్తిన గండిచేసి అందు కరిగిన గంధకమును సీసమును బోసి కుదించి వానిని గిరగిర త్రిప్పి ఘోరాగ్ని పాతాళములోనికి పడద్రోసి క్రూరబాధలు పెట్టుచుండిరి. వీడు లోకములో కామమే సుఖమని యెంచి కామాతురుడై నడచినవాడని తెలిసికొంటిని. ఇదిగాక మరియనేకులను బాధించుట చూచితిని, అదేలాగనగ: వారలను తల క్రిందుగా వ్రేలగట్టి గొఱ్ఱెపిల్ల చర్మము ఒలిచెడులాగున వారల తోలు దిగలాగి ఒలిచి కండలన్నియు నజ్జునజ్జుగా నరికి ఎముకలు తునుకలు తునుకలుగా కత్తిరించి, ప్రేగులు దొమ్మలీరువలు వెళ్లబీకి, మహా ఘోరాగ్నిలో త్రిప్పిత్రిప్పి కాల్చునది కంటిని. ఇదిగో యీ యాజ్ఞలు పడువారెవరనగా, లోకములో నన్యాయముచేసి పరులను అటమటించి వారల సొమ్ము సంబంధములన్నియు దోచుకొనిన రాజులును దొరలును వీరలేయని తెలిసెను, మరియొక ప్రక్కన పిశాచులు ఒకనిని పట్టుకొని యినుప గుదెలతో పడదంచి కుక్కను ఒలిచినట్టు వాని చర్మము నొలిచి కరిగిన సీసము వానిపై కుమ్మరించి మహాగ్నిలో కుదించి ముంచి కాల్చునది చూడగా వీడు లోకములో గురికాడైయుండి న్యాయములను అటమటించి వేదలయొక్క సొమ్మంతయు నాచుకొని తిరుగ నుత్తరించనందువల్ల నీలాగు నిత్యాజ్ఞలు పడుచున్నాడని తెలిసెను. మరియవతల బోయి చూడగా, ననేక పిశాచులు కన్నులయందు నగ్ని రవలు వెళ్లగా మిణుకు మిణుకుమని గుడ్లురుముచు పులులవలెనె బుస్సుమని నోటినుండి అగ్నిజ్వాలలు విడుచుచు గనగన మండెడు ఇనుప గుదెలతో కొందరి తలచిప్పల నెగుర తాటించి, మెదడు నేల గ్రుమ్మరించి వారల సర్వాంగములను గుదెలచే నలియ మర్దించి కష్టపుగుంటలో త్రోయుటను గంటిని. ఈ దురాత్ములెవ్వరనగ దుర్మతముల ననుసరింప నేర్పించుకొని దొంగగురువులై తిరిగిన వార లీలాగు నెడతెగక నిత్యబాధలు పడుదురని కనుగొంటిని. మరి అవతల చూడగా గట్టుగానని సముద్రములో చేపలుగడా ఈదుచు గంతులు వేయునట్టు, అగ్నిసముద్రములో నెన్నికలేని పాపాత్ములు ఈదుచు బుసబెట్టుచు గసలు బోసికొని యోయని యొర్లుచు దరినంటక నిలుకడలేక యెగిరియెగిరి పడి గంతులు

వేయుచు అగ్నిసముద్రములో నిత్యకాలము కాలునది గంటిని. వీర లెవ్వరనగ: సత్యవేదము చేకొనక పోయినవారలును ఒకవేళ నిర్మలవేదము చేకొన్నను దాని కల్పనలచొప్పున నడువక దబ్బరానలు బెట్టి తలిదండ్రులను నిందించి నానా పిశాచి తంత్రములుచేసి అప్పపూజ కానక ఆరవకల్పన మీరి మరణపర్యంతము ఘోర పాపములలో కుక్కలవలె తిరిగిన పాపాత్ములని తెలిసెను. మరి అవతల తల యెత్తి పైన చూడగా ఒకనిని అనేక పిశాచులు చుట్టుకొని యొక చక్రములో వ్రిరికించి బిగియకట్టి ఆ చక్రములో గల చీలల మొనలన్ని వాని దేహమాద్యంతము పొడుచుకొని తటాయించి వెళ్లనదిమి చిక్కగట్టి చుట్టచుట్ట దిగచుట్టి క్రిందికి విదిలించి అడుగులేని ఘోర పాతాళమున పడద్రోయగా పొర్లుకొని పడు సమయమున వాడు పదరి ఆర్భటించెడు కఠోర శబ్దము విని నరకమంతయు గడగడ వణకి అందులో గల పిశాచులన్ని భయపడి బెత్తరపోయి అభయ హస్తమియ్యవ్లోయని మొరాళించి ఆ చక్రములో కట్టబడిన వానిని దూషించి తిట్టుచు, వీడే గదా ముప్పది వెండికాసులకు ఆశపడి తన దివ్యాచార్యుడైన జేసునాథుని దుష్ట గురువులకు నమ్మి యొప్పగించిన జూదాసు ఇస్కారియోత్తనెడు పరమ ద్రోహియయిన శిష్యుడు! ఇదిగో వీడు చేసిన మహా ఘోర పాతకమునకు మాలో కూడ ఈ నరకమున నిత్యకాలము ఇట్లు పాట్లు పడమని స్వామి తీర్పుజేసి కట్టడయిచ్చినందున ఆ మహా ద్రోహిని విడువకండి, పట్టు పట్టు, కొట్టు కొట్టు, నరుకు నరుకుమని పిశాచులు కేకలు వేయుచుండుటను విని యీలాగున నరకవాసులు నిత్యకాలము ఆజ్ఞ పడునది తెలిసికొంటినని ఆ మహాత్ములైనవారు చెప్పిరి.

ఓరీ పాపాత్ముడా, వింటివో ఓరుగ నరకము గనినవార లెవ్వరని తలంచుచున్నావా? ఇదిగో, నీ పాపము యొక్క మరులు విడువ, నిది చాలకపోయినట్టయిన, మరియొక విశేషము వినగలవాడవు. ఒక రాయనిదగ్గర బహు దినములు సేవించిన పెద్దప్రాయముగల ఒక సేవకుడు మరణము పొందిన దినమే వాని సతి తన పురుషుడు చచ్చిపోయెనుగదా, వాని యాత్మము ఎక్కడ నున్నదో యని ఎరుగ మనస్సుగా నుండెను కనుక సర్వేశ్వరుడు ఆమెకు నొక దర్శనము కనుపింప జేసిరి. ఏలాగనగా, ఆపె పురుషుని ఆత్మము నరక పాతాళములో పడినది. అట్లు పడగానే అనేక పిశాచులు ఆ యాత్మను చుట్టుకొని ఎఱ్ఱగా కాగకాలిన బహు చురుకైన మొనలు గల చీలలు నిండిన ఒక యినుప చట్టము వానికి

త్రొడిగించి ఆ మొలలు వాని శరీర మా ద్యంతము దూరి గుచ్చుకొని లోపలికి దిగునట్లు మహా క్రూరముగా కొట్టి తన్నులు తన్ని, ఓరీ నీవు లోకములో వీర శూరుడవై తిరిగినందున నరకములో నీకు వచ్చిన సంభావన ఇదేరా యని చెప్పుచు పిశాచులు వానిని బట్టి అగ్ని బగ బగమని యెగసీ మండెడు మంచముపై పరుండబెట్టి వానిని నలిపి నలిపి కన్నులు ముక్కు చెవులు నోరు సకల రోమద్వారములలో రక్తము ఏఱ్లుగా పారగా ఎముకలు పెళపెళ విరుగ త్రొక్కి త్రొక్కి తన్నితన్ని నలియద్రొక్కి ఇదిగో లోకమున నీవు కామ విలాసములచే మొనగాడుగా తిరిగినందుకు నీకు నిత్యకాలము గా దొరకిన బహుమానము ఇదేయని చెప్పుచు నానా వేదనలు పెట్టునది గనిన యా స్త్రీ మహా భయపడి అసహ్యించి అయ్యయ్యో యని ఆర్భటించి నా జోడా చెడితివా, స్వామియొక్క కల్పనలు మరచి నీ మనోవాంఛచొప్పున నడిచినందువల్లగదా యీ నిష్ఠుర నరకాజ్ఞలకు లోనైతివని చెప్పి భ్రమసి బుద్ధి కలంగి గడగడ వణకి ఎద పగిలి నేల కూలినది.

హా పాతకుడా, నరకమును కనినవార లెవ్వరని యింకను చెప్పుదువా? నరకమున్నదని నిశ్చయించి దానిలోబడ భయపడవా? భయపడి పాపము విడిచి పుణ్యమార్గముబట్ట తెగువజేయవా? ఇదిగో పాపపుమరులు విడువ నిది చాలక పోయినయెడల ఇంక కొన్ని విశేషములు వినుము: నీవలెనే మహా పాతకుడై యున్న ఒకడు తాను చేసిన పాపాక్రమములకు నరకమే సిద్ధించునని భయపడక నానావిధ పాపములలో మునిగి తేలుచుండెడు సమయమున ఒక మహాత్ము లైనవారు వానికి నానావిధ బుద్ధులను జెప్పి ధర్మ తపముచేయ అనేకసారులు బోధించినను, వాడు విననివాడై యుండెను. ఒకనాడు ఆ మహాత్ములైనవారు వీనిని జూచి, ఓరి తమ్ముడా, నా దగ్గరకు రారా, నేననేకమారులు నీకు బుద్ధి చెప్పినను విననని సాధించెదవుకదా? ఇదిగో నిన్ను ఒక చిన్న మనవిమాత్రము అడుగుచున్నాను. అదేమనగ: నీ పడక మీద నీ రాత్రి పండుకొనునపుడు నీకు సరిపోయిన తట్టు ఒరగుకొని, అట్లనే ఆ తట్టు ఈతట్టు కదలకయుండి ఉదయము గు పర్యంతము ఉంటివేని నీకు బుద్ధి రావచ్చునని, అందుకు వాడు ఓహో మంచిది అలాగున నుండెదనని చెప్పి తనకు సరిపోయిన ప్రక్కన పండుకొని నిద్రజేయ చూచెను. కొంతసేపు పండుకొనియుండి చూడగా నిద్రపట్టక శరీర మంతయు కదలక పోయి తలత్రిప్పి చే

రేతట్టు తిరుగ మనస్సువచ్చినను తానిచ్చిన మాటను తలంచి కదలక యుండెను. మరికొంత సేపటికి వెనుక తలనొప్పియు శరీరమున కంటగింపును అధికమై, సుఖమైన పడకమీద పరచియుండెడు దూది మెత్తయును తలగడ దిండును గులక రాళ్లవలె నొత్తుకొనసాగి తల బరువై మంటలెగయగా మనస్సు కలంగి బహు చంచలుడాయెను. ఇదిగో యిట్టి మనస్సు కలాపములో తనలో తానిట్లు అనుకొనుచున్నాడు: అయ్యో పాపీ సుఖముగల పడకమీద పండకొని మెదట ఒరగుకొనిన ప్రక్కనమాత్రము తెల్లవారువరకు ఉండజాల ననుచున్నావుకదా? అయితే దుర్గంధ నరకపు మారని కఠోరాగ్నిమంటలను ఎట్లు సహింపబోవుచున్నావు. సుఖమైన దూదిమెత్తయొక్క మంటనే తాళజాల ననెదవు; ఆరని అగ్ని నరకములోని మారని ఆరని మంటల నెట్లు సహించెదవు! చేసిన పాపములకుగాను నీలోకమున సాధ్యమైనంతవరకు తపస్సు చేయక పోయినట్టయిన కఠోర నరకమే నీకు సిద్ధించును. పుణ్యములను చేయ కాలయాపనము చేయుటెందుకు? మరణ మెప్పుడు వచ్చునో తెలియదు కనుక అది రాకముందరనే పుణ్యత్రోవలో నడచి పాపములను వర్జించి ధర్మమార్గమును పట్టి మోక్షము పొందవలెనని తెగువజేసికొని లేచి అంతట తాను చేసిన పాపములకై బహుగా నేడ్చుచు తెల్లవారగానే గురువుల పాదముకడకు బోయి మంచి పాపసంకీర్తనము చేసి మరణపర్యంతము ధర్మమార్గమున నడిచెను.

అయ్యో పాతకుడా మేలుకొని యున్నావా? నీ పాపపు నిద్రముబ్బు విడిచెనా? మా అర్భటింపులు నీ చెవిలో పడెనా? ఇకనైనను కొంతసేపు నరక కఠోర వేదనలను తలంచి పాపత్రోవలో నిదివరకు నడిచినది చాలునని యెంచి నిత్యానంద మోక్షమగు పరమగతిని పొంద ఈ మంచికాలములోనే పుణ్యమును చేయ పద్దుపట్టగలవాడవు. పాపమును విడువనని సాధించి తిరిగినయెడల ఇదిగో యిప్పుడు చెప్పబడ్డ దుర్గంధ నరకములో నీవు నిత్యకాలము ఆరని కట్టెవై కాలి మండబోదువని యెరుగుదువుగాక.



# మూఁడవ వ్యత్యాసము.

## నరకముయొక్క విశేషాజ్ఞ.

వ॥ ఇవ్విధంబున నత్తాపసోత్తముండు తదోర్ధ్వభార్థియైన మానవులకు వక్కాణించి మరల నిట్లనియె;

చ॥ ఇదియునుగాక నారకము నెవ్వరు నీ ధరఁ జూచినారనన్
మది చెడి పల్కువారలకు మన్ననలేక భయంకరంబుగా
మదమున ఘోర దుర్నరకమందుఁ దగం బడినంతఁ గల్గు భీ
తిద కఠినాజ్ఞ లెట్లనినఁ దెల్పెద మానవులార విందురే.

సీ॥ అదియు నెట్లన్న, మహాత్ములైనట్టి వా-రొకనాఁడు గని వచ్చి యొనరఁ జెప్పి
నట్టి విధంబును నరులార చెప్పెద;-నరక మెవ్వరు చూచితిరని చెప్పు
నా దుర్మదాంధులు నరకాగ్నిజలధిలో,-జలధిలో మీలఁదు చందమునను,
మునుఁగుచు నీఁదుచు మొనసి నానాజ్ఞల-వేదనఁ బడుదురు వినుమెటులన

తే॥ నొక్కని నసేక భూతము లొంది యంత
నగ్గలంబైన తన్నుల మొగ్గఁ దన్ను
చును గఠోరాతి నిష్ఠురాలను గుదించి
వేఁడి సీసంబు కన్నులన్ విడుతు రెలమి.

ఉ॥ ఒక్కొక నిట్లు పట్టి నరకోద్ధృత ఘోర దవాగ్నిలోనఁ బెం
పెక్కవ చేయుచుం గరఁగి పెక్కు సెగం దనరారు సీసమున్
ముక్కున నోటిలోన దిగ ముష్కరమై నడునెత్తి రంధ్రముల్
గ్రక్కునఁ జేసి పోసి కనఁగానని బాధ లిడుం బిశాచముల్.

క॥ కటకట వీరెవరన, పర-కుటిలాలకలను సుఖించు కుత్సితులరయన్.
ఇటులు పిశాచులచేతం-బటుబాధలఁ బడుదురెప్పుడు పావకజలధిన్,

చ॥ ఇదియునుగాక కుత్సితుల నెల్లను జూచితిఁ బాధఁ బెట్టఁగా,
నది మఱి యెట్లనం దగరు నట్టె పడంగను ద్రోసి కోసి దా
నిది యజినంబుఁ దీయుటకు నీడగువారిని నట్లు సేయుచుం

బడపడి కండలాది కడుపందునఁ గల్గున దగ్ని సేయుచుఁ
ఆ॥ ఇటుల బాధ లొందు నింద లెవ్వారనఁ
ప్రజలనెల్ల దుఃఖపడఁగఁ జేసి
పరధనాల కాశపడి దోఁచుకొన్నట్టి
మనుజపతు లటంచ్రు మర్త్యులార.
తే॥ మఱియొకని బట్టుకొని యయోమయము గుదెల
తోడఁ బడఁదంచి లేడిని తోలు తీసి
నటులు గావించి కరఁగినయట్టి వేఁడి
సీసమెల్లను బైనిండ బోసి రపుడు.
క॥ న్యాయమును వీఁడు వీడి య-న్యాయముగా నటమటించి యట పేదల సొ
మ్మే యెడల వేసికొనియెను-బాయునె వీఁడిట్లు పాటు పడినప్పటికిఁ.
సీ॥ మఱి యావలం బోయి యరయ ననేక భీ-కర పిశాచుల యెల్ల కన్నులందు
గడువహ్నికణములు వెడలగ, మిన్ను-మి-న్నను నెత్తునా గొప్ప కనులునురువు
కొని పృథుల వ్యాఘ్రమునుబోలె నార్భాట-మున నోళ్లలోనుండి యనలకీల
లటు వీడుచుండఁగా నార్పుచు నినుప గు-దెలతోడ కొందఱం దివిరి దూఱ
తే॥ నెంచి తలచిప్ప లెగురఁ దాడించి యందు
మెదడు నిలగ్రుమ్మరిల వారి మేనులన్ని
గుదెలచేతను నలుఁగంగఁగొట్టి కష్ట
నరకకూపంబులో ద్రొబ్బినారు వినుఁడు,
తే॥ ఇట్టి దుర్మార్గు లెవరన నిలను దుర్మ
తము ననుసరించి మేమును దగఁగ మీకు
గట్టిగా గురువులమని గర్వులెల్ల
నీ మహా వ్యథలను బొంది యేడుచుదురు.
మ॥ కడలేనట్టి భయంకరైక నరకాగాధాగ్నిపాథోధిలోఁ
బడి మ్రొలైపడి గంతువేయుచు, మహాబాధఁ గసల్ బోయుచుం,
గడు నాధారములేక యీఁదుచు, దరిం గానంగఁ బోలేక ని
ల్కడ లేకుండ కలంత కాలమిటలం గాలంగ నైరయ్యేడఁ
శా॥ వారెవ్వారన, సత్యవేద రచనావ్యాకంబు నైకోక ని

స్సారంబై తగఁ గల్పనల్ పదికినిం చాండాల వైరాన ని
ష్కారత్వంబున దబ్బ ఱానలిడి దుష్కార్యాన దుస్తంత్రులై
యాఁగో కల్పన మీరినట్టి ఖలులకా బాధ వచ్చుందుదిన్.

క॥ తలితండ్రాదుల నెంతో-చులకంగాఁ జూచి, మదిని శోకము నొందన్
సలిపినఁ, బరుల శపించిన-ఖలు లిత్తఱి నరకమందుఁ గాలుదు రెపుడున్.

క॥ ఇఁకను నావలఁ జూచిన-శంకింపఁగరాని బలు పిశాచు లెలమితో
నింకక యొక్కకనిం బెను-హుంకృతితోఁ బాధిడిరి మహోన్నతి బలిమిన్.

సీ॥ ఆప్పిశాచులనేకమై యొక్కనినిఁ జుట్టు-కొని నెట్టుకొని మట్టుకొనుచు నంత
నొక్క చక్రముమీఁద నోగును గట్టిగా-నిఱికించి బిగియ నిర్కించి కట్టి,
యా చక్రములఁ గల్గునట్టి క్రొవ్వాడియా-మొలలు శరీరంబు మొదలు తుదల
ద్రక్కులు గావించి పెక్కు చీరగఁ బైకి-వెళ్లఁగా, నదుముచు వేఁడిఁజుట్టి

తే॥ పట్టి చిక్కగ నొనరించి పైకి మరల
నెత్తి క్రిందికి విదళించి నెట్టినపుడు
పొరలుకొని సుడివేళల నొరలి కెరలి
పదరి సాపి యార్భాట శబ్దంబు నరచెఁ

గీ॥ పరఁగ వీ రెవ్వరనఁ, బరాత్పరసువస్తు
రూపముం గాంచి జేసుగురువును గాని
గురువులకు నొప్పగించి దుర్గుణులునైన
వార లీరీతి నరక నివాసులగుచు,

మ॥ కడు జూదాసుగుణైక హీనతర డిస్కార్యోత్తుఁ డౌ ద్రోహియై
కడ కా శిష్యుఁడు ఘోరమైన నరకాగాధనలాంభోధిలోఁ
బడి యీలాగున బాధలొందఁగను దత్స్వాముల్ నియోగించు క
ట్టడిరీతిన్ వ్యథలా పిశాచు లిడి కొట్టన్ సాగి రెల్లాజ్ఞలన్

వ॥ ఇత్తీరు నత్తపోధనుఁడా మహా ఘోరదుర్గంధ నరకదవానలాంభోరాశియందు గల చందంబులెల్ల నరసి యరుగుదెంచి వినుమని వక్కాణించిన తెఱంగున, బాహ్యారంగంబుగా మానవులారా, మీకును సుజ్ఞానోదయ సంప్రాప్తంబగుటకై చెప్పితి నదియునుంగాక యేతత్ప్రపంచ మాయాజాలంబువలన నేమియు నెఱుగ నేరని మూఢజనంబులకు నాలాగు నరక పాతాళ వ్యథాప్రాప్తంబుగాకుండ

మీకు నింక నొక మహాత్ములైన వారి వలన వినిన చిత్రవిచిత్రంబు వినుపించెద వినుఁడి.

సీ॥ ఒక మహీనాథుని యొద్దఁ గొల్చెడి వాఁడు-సేవకుం డొకఁడు నీ క్షితిని ముందు
సాకల్య సౌభాగ్య సంపదల్ తులఁదూఁగు-సకలమైనట్టి కోరికలు నెమ్మి
ననుభవించుచు పలునాళ్ళు నీ రీతిని-రాజును సేవించి రమణ నంత
నొకనాఁడు మృతుఁడైన, నొప్పారఁగా వాని-యిల్లాలు సుజ్ఞాన యిందువదన

తే॥ తన మనోనాథుఁడు చనిపోయిన దినంబు
వాని యాత్మయు నెచట నివాసమయ్యె
ననుచుఁ దెలియంగఁ దలఁచి యా నలిననేత్రి
యాదిదేవుని చింతించె నట్టివేళ.

క॥ అంతట సర్వేశ్వరుఁడా-కాంతకు నొక దర్శనంబుఁ గనుఁగొనఁ జేసెం
గాంత మది నేమి గలదో-యంతయు నెఱుఁగంగఁ జూచె నదియెట్లన్నన్.

శా॥ ఈ నాళీకముఖీలలామ మది నిండారంగ సర్వేశ్వర
ధ్యానారూఢినియై సుషుప్తిని మహోద్గాఢాద్భుతం బొప్ప చం
దానం గాంచెను దర్శనంబు నొనరం దథ్యంబుగన్ జ్ఞప్తికిన్.
గానై నాథుని యాత్మ ఘోర నరకాగాధానలాంభోధిలోన్.

వ॥ ఇవ్విధంబున నావధూమణి ఘోరదుర్గంధ నరకాగాధదావానలకూపాగంబు లోనఁ బడియున్న స్వకీయ ప్రాణనాథుని యాత్మకుం గల సకలమైన బాధలుం గనియె నదియెట్లన్నను.

సీ॥ అవ్వధూమణి మనోహరుఁడైన కాఠిన్య-హృదయ దుర్మార్గుఁడు వదల కపుడు
భూతలస్థిత మహా పాతాళసంగత-కఠిన భీషణ నరకానలాబ్ధి
యందునఁ బడినంత నాపిశాచులు వాని-బాధల పెట్టిన భంగి వినుము
ఎఱ్ఱగాఁ గాఁగిన యినుప చట్టొకటి దా-నికి వాఁడిగల మొలల్ నిండి యుండ,

తే॥ నదియు మైనిండఁ దొడుగుకొమ్మనుచు గొట్ట
నంత నా మొలలెల్ల సర్వాంగములను
నాటఁగను దన్నినందున గాటమైన
బాధలియ్యఁగఁ జెప్పిన భంగి వినుము.

క॥ ఘోరుఁడవై నిర్దయచే-గ్రూరుఁడవై తిరిగినందుకును నీ రీతిన్

దారుణ బాధ లిడందగు-నౌరా యని యప్పిశాచులార్చిరి నుడువన్

క॥ నిక్కముగ నీవు పరకల-వాక్యంబులఁ గోరి మారవరరూపముతో
నిక్కుచు మొనగాఁ దిరుగుచు-నక్కాంతలఁ బొందినందుకనిరి వెతలిడన్.

వ॥ ఈ ప్రకారంబున నప్పిశాచు లనేక విధంబుల బాధించుచున్న విభుని యాత్మ గని యసహ్యించి యన్నాళీకానన యిట్లనియె:

శా॥ అయ్యయ్యో యని యార్పుచుం గలఁగి హాహా యంచు దుఃఖించి హా
నయ్యా కంపము నొందుచున్ భ్రమసి యక్కుఁ డా వడిన్ గుద్దుచున్
దయ్యంబుం దలపోయుచుం బొగులుచున్ దైన్యాన, నా జోడ నీ
వియ్యేడ్పుల్ పడనాయెఁగా చేడితివో విజ్ఞానహీనుండవై.

వ॥ అని యామత్తచకోరాక్షి పెద్దకాలంబు నిద్దురబోయి మేల్కాంచి లేచి తాఁగల లోఁ గన్న దుర్గంధ నరకదావానలాకూపార గతుండగు స్వనాథుని బాధావిశేషంబులన్ డెందంబునం దలంచి విస్మయంబును దుఃఖంబును భయంబును వికారంబైన మమకారంబును గదుర నంగలార్పం దొణంగె నెట్లన్నను.

శా॥ నా జోడా నను నేలినట్టి విభుఁడా నా నేస్తకాడా, యయో
రాజుం గొల్చుచు గర్వివై విపుల శూరత్వంబునం జిత్తభూ
తేజోవిభ్రమలీలఁ జేసితివయో, దేవుంగనన్ లేకయే
వాజల్ పోయుచు నీ వెతల్ బడుట నీ వాశించినట్టాయెనో.

తే॥ భావమందున స్వామి కల్పనల మఱవ
స్థిరమంటంచు మనోవాంఛఁ దిరిగినందు
వలన నింతటి నిష్ఠురవ్యథలు పడఁగ
వలసె నోఁ గద, నీకు నెవ్వరికి నింతె.

వ॥ అని యిట్లెక్కువడి నక్కోమలి ప్రలాపించి యంతట స్వాంతంబునకు విరక్తిమార్గంబైన సుజ్ఞానంబు దెచ్చుకొని సర్వేశ్వర ధ్యానారాధినియై, తపంబు పండి నదై కేవల మోక్షరాజ్యంబునకుం జనియె నంత.

క॥ నరులార, తెలియలేదా-వరుసగఁ నే జెప్పుచున్న వాక్యము లెల్లన్,
నరకము మోక్షము నీ రెం-డరయంగా నింక మాకు ననియెద వినుఁడీ.

చ॥ అదియునుగాక మాకు నరయ న్వినిపించెద వీనులారఁగా
ముదమున నాలకింపుఁడీ యమోఘతరంబగు కీడు మేలులన్,

క॥ ఈ తీరున మఱునాఁడా-ప్రాతఃకాలంబు వచ్చుపర్యంతంబుఁ
జేతశ్చలనము నొందక-యీ తెఱగున నిద్రపొందిడి యెలమిని రాత్రిఁ

వ॥ అనవుడు నాకర్ణించి యా మనుజుండు వల్లె యని యుల్లాసంబు వెల్లుదా నుప్పొంగు తిల్ల, నల్లన తదీయ వాసరాంతంబునందు నిజమందిరంబున స్వకీయభోగశయ్యాప్రదేశంబుపై నత్తమిల్ల నివసించి యమ్మహాత్ముల నియోగంబు మనంబునం దలంచి యెంచి యంచితంబుగా నటులం జేయంబూని యప్పుడు,

తే॥ తనకు సరిపోయినట్టి ప్రక్కను వసింప
నొరిగి యంతట కదలక యొక్క విధము
నుండి యేమియుఁ గదలక యుండునపుడు
నిదురపోయినఁ గాదని నిదుర వదలె.

క॥ సాయంకాలము మొదలుగఁ-బాయక యీ రీతినుండి ప్రాతఃకాలం
బే యెప్పుడుఁ జనుదెంచునొ-హా యని మదిలోనఁ దలఁచి యత్తఱినుండెఁ

ఆ॥ ఇటులు కొంతసేపు నెంతో మహా బల
వంతమునను మనసు పట్టి యుండె
నంత నంగములకు నతికాక యయ్యెను,
గఠిన మహిత శైప్యకాగ్ని వలన.

క॥ కాయమునకుఁ బలు సంకట-మై యటు బదరీ నిశాతమయ కంటకసం
ఘాయతిఁ బానుపు, దిండ్లుం-బాయక మఱి గొనుగు రాళ్ల భావన యయ్యెఁ

క॥ తల యెత్త రామియూ, మఱి-తల యెత్తిన గదలుటదియుఁ, దాపసునొద్దం
దల యెత్తరామియానని-తలయెత్తక యుండె వారు దరిలేని తఱిఁ.

వ॥ ఈ తీరునఁ దల యెత్తరాని బరువునకును, కాలుచేతులను నాడించలేని బాధకును, శరీరమందలి యతి విహారంబైన వికారంబునకును, దాళఁజాలక మనంబునం గలంగి చాంచల్యంబు సెలంగనంతటం దిగ్గున లేచి యగ్గురుభావుని సన్నిధికిం జని తన వృత్తాంతంబంతయు నెఱింగించిన, నమ్మనుజునకు నత్తపోనిధియైన మహాత్మం డిట్లనియె:

శా॥ అయ్యో నాయన యింత మాత్రమునకే హాహా యనంజెల్లునా?
నెయ్యానన్ మునుపెంత చెప్పితినిరా నీ కేడకున్ బుద్ధి లే
దయ్యయ్యో, నరకాన నెట్లు? భవదీ యాత్మాశయం బొప్పఁగా

విదితముగాఁగఁ దన్నరక వేధలకై తగు పాపముల్, శుభ
ప్రదమగు మోక్షరాజ్యగత భాగ్యముకై తగునట్టి పుణ్యముల్.

సీ॥ పూర్వము నొక పాపిపురుషుండు-వెఱవక నానా విధాల ననారతంబు
దారుణమైన పాతకములు చేఁజేత-నెఱిఁగి చేయుచునుండె నీగుకొనుచు;
నంతట వాని కర్మానువశంబునఁ-బాపరాహిత్యంబు పరఁగుకొఱకుఁ
గేవలమైన ముక్తిప్రదాత యనంగ-నొక మహాత్ముఁడు వచ్చి యొనర వాని

తే॥ కెలమి సాక్షాత్కరించి సాకలితమైన
విధులఁ బోధించి మిక్కిలి విమల మతులఁ
జెప్పుచును ధర్మతపమును జేయుమన్న
వినఁగ నొల్లక యుండె నమ్మనుజుఁడపుడు,

క॥ వానిఁ గృతార్థుని జేయుట-కై నయవినయముల నమ్మహాత్ముఁడు నెంతో
నానా విధసమ్మతుల ని-శీనిధి బోధింప సాగె సేనా దినముల్.

శా॥ అన్నా రార యటంచుఁ బిల్చి యొక నాఁడత్యంత సంప్రీతితో
విన్నావా యొక మాట తండ్రి యనుచున్, విభ్రాంతి నింకొక్కటిం
కన్నావా, ననుఁ గన్నవాఁడ యనుచున్ గారాము గావించుచుం
దిన్నంగాఁ దనచెంతఁ జేర్చుకొనఁగన్ దీవించి లాలించుచున్,

క॥ ఇత్తెఱఁగున బోధించెడి-యుత్తరములు వాని కంతటొనరఁగ మదిలో
హత్తెను జ్ఞానోదయమై-చిత్తము బహు మగ్నమయ్యె శ్రీగురునందున్.

ఉ॥ అప్పుడు వానితోడ ననె నమ్మహనీయతపస్వి: యోరి నీ
విప్పుడు సేయుమొక్కటియు నెట్లన: నీనిసియందు నీకు నిం
పొప్పు భవద్విరాజిత సుఖోన్నత శయ్యను నిద్ర పోవఁగా
నప్పుడు నేను నీకు ననినట్టి తెఱంగునఁ బండు కొమ్మనెన్.

క॥ నా విని యత్తెఱఁగున నేఁ-గావించెద నో మహాత్మ క్రమమానతి నా
కీవే యిప్పుడె దయతో-నా విని పల్కె ననుకంప నత్తాపసుఁడున్.

శా॥ ఓరీ పాపఁడ, నీవు నీనిసి సుఖం బొప్పారు నీభోగ శ
య్యారాజంబున నత్తఖిల్లునెడ, నీకానందమౌ ప్రక్క నిం
పార న్నెమ్మి నొరుంగు కే మరల నే ప్రక్కం గదల్చ్బక యు
ల్లోరానం జలియింప కొక్క తటినందున్ నిద్రచేయుండిరా.

శయ్యాగ్రాననె పండలేవు నిక నీ చావెట్లు వినిపింపురా.
సీ॥ సుకమైన పాన్పుపై నొక ప్రక్క-కాసంత-పండుకొమ్మ యన నుండలేని
వాఁడవు, దారుణావారిత దుర్గంధ-నరకదావాగ్ని సాగరమునందుఁ
బడరాని పాట్లు నేభంగిని బడియెద-వోరి, నీ మది నెట్టులోర్చెదవుర?
యయ్యయ్యో, యింక సాయంకాలమాదిగా-నర్యమోదయ కాలమంతముగను
తే॥ కదలక మొదల కొక్క ప్రక్కను వసింప
లేనివాఁడవై యా నరకానలాబ్ధి
లోన నావ్యధలును లెక్కలేని యుగము
లే విధంబునఁ బడి వసియించెదవుర.
క॥ అదిగాక భూమినందున-నదరక బెదరకయుఁ జేసినట్టి యఘంబుల్
మదిఁ దలపోయుచు వదలక-చెదరని మతిలోఁ దపంబు సేయం దగదే?
శా॥ ఆకర్ణింపుర, యా పరాత్పర సుప్రేమాకారు సర్వేశ్వరున్
జోకంగూర్చి తపంబుఁ జేసినఁ లభించున్ నీకుఁ గైవల్యమే,
యీ కైవల్యము నబ్బకుండినెడలన్ నీకా దినంబందునన్
శోకోద్యన్నరకానలాంబుధి లభించున్ బాధలం బొందఁగన్
క॥ నీ సేయు నఘమును వదలి-వేసారక సేయఁదగదె విమల మనీషన్
భాసుర తపము ధరిత్రిని- శ్రీ సర్వేశ్వరునిగూర్చి శ్రేయముకొఱకున్
తే॥ నీవు చేసిన పాపంబు లెనిన యెడల
లెక్క కగ్గలమై యుండు, లెక్కలేని
యుగము లేలాగు దుర్గంధయుత కఠోర
నరకదహనాబ్ధిలోఁ బడి నలిగెదవుర.
ఆ॥ ఎంతమాత్రమైన నిలలోన సర్వేశ్వ
రుని గుఱించి తపము నొనరఁ బుణ్య
మెప్పుడు సేయ నెడల పాపపుమర్లునఁ
గానఁ బడవలె నరకానలాబ్ధి.
సీ॥ వెఱవక చేసిన, దురితంబులెల్లను-నశియించువాఁడు జ్ఞానంబు పొందు,
నల్ల సర్వేశ్వరు నభినుతించినవాఁడు-పాపరాహిత్య సద్భావుఁడవును
బాపరాహిత్య సద్భావుఁడయిన వాఁడు-పుణ్యంబు చేయును భూమియందుఁ

బుణ్య సత్క్రియలను బూని చేసినవాఁడు-కైవల్యరాజ్యంబు గరిమఁ జేరుఁ.

తే॥ ఘనతఁ గైవల్యరాజ్యంబు గల్గెనేని
యేమి గావలె నతనికి, నితరసౌఖ్య
చింత లేటికి, నేజోలి సేయ నేల,
పరమ సంతత సంతోష భావుఁడతఁడు.

ఆ॥ చావు రాకమున్నె నరగ సుజ్ఞానియై
కాలమెల్ల వెళ్లకమునుపుగద
పుణ్యములను జేయఁబూనిన వానికి
మోక్ష రాజ్యమబ్బుఁ ముదముతోడ.

ఆ॥ అఘమువలనఁ బుణ్యహాని యటంచును
బుద్ధియందు దిగులు పుట్టవలదె?
దిగులు పుట్టెనేని తెప్పునఁ బుణ్యుఁడౌఁ
బుణ్యుఁడైనవాఁడు పొందు ముక్తి.

వ॥ అని యివ్విధంబున నమ్మహాత్ముండు వక్కాణించిన యుత్తరంబు లాకర్ణించి యమ్మనుజుండు తన్నుఁ దా నవలోకించి తనయందుఁ గించిన్మాత్రంబైనను సుకృతంబులేమి యెఱింగి యసహ్యంబైనట్టి స్వకీయాఘంబులవలన ఘోరదుర్గంధనరక దవానలాంభోరాశియందుఁ బడనొల్లక మనంబున ఘనంబుగాఁ గల్లోలంబులంనొంది సుజ్ఞానంబుతోడనే కేవల విరక్తిమార్గుండై, యగ్గురువర్యునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు మోడ్చి యనేక విధంబులం గొనియాడుచు దీనవదనారవిందుండై యిట్లనియె.

ఉ॥ ఇప్పుడె యో మహాత్మ, సెలవీవె, తరింప నుపాయమెద్ది, మా
యప్పవు నీవె నా గురుఁడవైనతటిం గడతేర్పవయ్య, నం
జెప్పెడివారు లేకయె కుచిత్తుఁడనై, చెడిపోతినయ్యయో,
తెప్పున నింకనైన మతిఁ దెల్పఁగ ధర్మతపంబుఁ జేసెదన్.

వ॥ అని కొనియాడుటం జేసి పరమహర్ష హృదయాంతరంగుఁడై యమ్మనుజునకు నత్తాపసోత్తముం డిట్లనియె.

క॥ ఇకనైన బుద్ధి తెచ్చుక-యకలంక స్థితిని నిశ్చలాత్ముఁడవై ధా
ర్మికతతో ధర్మతపము పొ-చ్చిక సర్వేశ్వరుని గూర్చి చేయుము భక్తి.

వ॥ అదియునుగాక సుజ్ఞానహీనుండై ధర్మతపంబాచరింపక నరుండు సుకృతంబు జేయనొల్లక మోక్ష మార్గంబునకు దూరంబై విచారంబు నొంద ఘోరంబైన నరకానలాకూపారంబునం బడి పొరలాడుచుం బడరానిపాట్లc బడవలయు నని యా మహాత్ముcడు చెప్పినపిమ్మట నా మనుష్యుcడు సెలవుపుచ్చుకొని యింటికిc బోయి మరణించు పర్యంతంబు పుణ్యమార్గములో నడిచి కైవల్యరా జ్యంబుc జేరెను.

క॥ విన్నావcటరా మనుజుcడ-యెన్నటికి ముగింపులేని యిద్ధారుణగా
ఢోన్నతిగల నరకానల-కన్నిధిలోc బడcగ నేల కష్టించుటకై.

# నాలుగవ వ్యాఖ్యానము.

## నరకము యొక్క నిత్యాజ్ఞ.

ఎన్నటెన్నటికి నారని అగ్నిసముద్ర మనెడు నరకములో చెప్పతరముకాని బాధలు పడుటయే నిత్య బాధ లనబడును, ముగింపులేక బాధలు పడుట యనగా అర్థ మేమనగ: ఏ కాలమునందైన దుర్గంధ నరకము యొక్క కఠోర నిర్బంధములు తక్కువపడక మారక తీరక ఆరక సతతముగా నుండుటవలన వానికి లోనై కాలి మండడమును, నిలువక దెబ్బలు పడడమును, నిర్బంధ బాధలలో ఓయని యొర్లడమును, నివి మొదలగు నాజ్ఞలను నిత్యకాలము ననుభవించుటవల్ల నిత్యాజ్ఞలని ఎరుగుదువుగాక. అయ్యయ్యో పాతకుడా, కొంతకాలము పుణ్యమును చేయ ప్రయాసపడనందువ నెప్పటికిని ముగియని నరక నిర్బంధ బాధలకు లోనయ్యెదవు. హా పాపాత్ముడా, ఈ లోకమందుండు సన్నని దుమ్ము నంతటిని చిన్న రవలుగా నెంచినను, పారమైన సముద్రము యొక్క నీళ్లన్నిని బొట్లు బొట్లుగా నెంచినను, భూమిమీగల వృక్షముల ఆకులన్నిటిని ఎంచినను పరమండలమున కనిపించెడు నక్షత్రములన్నిటిని లెక్కించినను, ఈ లెక్కలన్నియు నొకటిగా కూర్చితే ఎంతగునో, అన్ని కోటానకోట్ల సంవత్సరములు గడిచినను నరకమో ముగియదు. దాని తక్క ఉగ్రమును తక్కువపడదు. అం

లో నీవు మండెడు మంటలకును, తినెడు తన్నులకును, పడెడు నింద యవమానములకును తరుగులేదు, దుర్మనస్సుగల పిశాచులు చేయు నిష్ఠుర కఠోరములు తక్కువ పడవురా, ముగియవురా, తీరవురా, మారవురా; మారక తీరక ముగియక ఆరక నిత్యకాలము మండుదువు. కుళ్లక కంపుకొట్టుదువు. తట్టార్చక తన్నులు పడుదువు. దీనిని చూచికదా నరకవాసులు చచ్చునది వాసియని యీ పార్శ్వమునకును ఆ పార్శ్వమునకును దూరి పారిపోదురు. అయితే నరకమున ఎచ్చోటను దుర్గంధపు కీలును గంధకమును గుగ్గిలమును కరగి పారెడు కష్టపు గుంటలో తల్లక్రిందుగా పొర్లుకొని దొర్లి చుట్టుకొని కాలి యోయని యొర్లి పండ్లిగిలించి ఆశించినను చావు రాక భయంకర పిశాచులు చుట్టుకొని తిట్టి తన్ని బరికి పొడిచెడు చోటుననే చత్తుమా యని నేల కూలుదురు. ఇదిగో వీరలు తన్నులు దెబ్బలు వేటులు పోటులు పడినను చావక పడియుందురు. ఇవ్విధమున నెడతెగక పడెడు దెబ్బలు కొదవపడక మండెడు అగ్ని యారక ఘోరమైన ఆరాటము నొప్పులు మారుపడక మనస్సు చంచలము ఆరక తీరక యెప్పటికి నాజ్ఞలు పడుటయే నిత్య బాధలై యుండునని ఎరుగుదురుగాక.

ఓరీ పాపాత్ముడా తెలిసెనా? పాపాత్ములకు రాబోయ్యెడు సంభావనయేమని కనుగొంటివా? అయ్యో పాతకుడా, ఇప్పుడొకనాడు ఒక్కప్రొద్దు నుండనోపననుచున్నావు! ఎన్నటెన్నటికిని తీరని ఆకలిని ఆరని దాహమును ఎట్లు తాళవలెనని యున్నావురా? ఇప్పుడు నిత్య మేలులు వెదకుటకై కొన్నాళ్లుమాత్రమే కష్టపడలేననుచు ఈ లోకములోని అల్పపు మేలులపై వాంఛబెట్టి తిరుగుచున్నావు. ఆరని నిత్య నరకాగ్ని మంటలో కాలడ మెట్లు సహింపపోయెదవురా? ఇప్పుడు నాల్గునాళ్లు విరక్తితో నుండలేననుచున్నావు. ముగింపులేని కాలము శరీరము ఊదెక్కి పుచ్చి పురుగులు బట్టి కంపుగొట్టుచుండడము ఎట్లు మనస్సొప్పి యుందువు? ఇప్పుడు పరులు చేసిన ఒక చిన్న నేరమును సహా ఓర్చియుండలేవుకదా, ఎన్నటెన్నటికిని నరకమున పిశాచులకు దాసుడవై తన్నులు దెబ్బలు పడి హీనుడవైయుండ నెట్లు ఓర్వవలెనని యున్నావు? ఎన్నటికిని నిట్లు వదలని యాజ్ఞ బాధలం బడునది తృణమనియో పాపమార్గమున నడుచుచున్నావు? అయినను నరకమునకు పొయ్యెడువాడు పోవునుగాని నేనందులోనికి పోననుదువు కాబోలు! మంచిదే, అటువంటి నిత్య బాధలు గల నరకములో పడకుండునట్లు నీ శరీరముయొక్క దుర్గు

ణముల నణచి దానిని దండించి పాపా
క్రమములను విడిచి న్యాయముతో నడ
చుచున్నావా? లేక నరక బాధలలో ప
డకుండ నీపాపములకు తపస్సును, దా
నధర్మములును చేసి, ఏకవస్తువగు దేవు
ని ఆరాధించి ఆయన కట్టడచేసిన దేవా
రాధన పూజ వందన జపధ్యానాది అను
ష్ఠానముల తప్పక యనుసరించుచున్నా
వా? లేదుకదా? ఇవి లేనట్టయిన నరక
మునకు పాత్ర్యుడువాడు నేను కాదని
యెట్లు చెప్పెదవురా? అనేకులు దిఢీలు
న తలంచని కాలమున పాపములో చ
చ్చి నరకమున పడుచున్నారు. ఇదిగో
ఒక సాదృశ్యమును చెప్పెద వినుము.

పారీస్ పట్టణములో నీవలెనే మ
హా అశుద్ధ పాపములలో మునిగియుండి
న ఒక దొర వ్యాధిగాబడి అవస్థగా
నుండునది విన్న ఆయూరి మేత్రాణులు
వానిని విచారింపబోయి వానిని జూచి
తమ్ముడా, నీవు ఈరోగముచే చచ్చిన
ట్టయిన నీయాత్మ ఏ స్థలమునకు పో
యి యుండునది నీవే వచ్చి మాతో చె
ప్పుమని చెప్పి లేచిపోయిరి. అలాగే
యాదొర చచ్చి ముప్పది దినములు గ
డచినపిమ్మట వాని యాత్మము మేత్రా
ణులకు కనిపించి నా అహంకారముచేత
ను ఆరవ కల్పనకు విరోధముగా చేసిన
పాపముచేతను నేను నరకమున పడి
యున్నాను. అయితే దేవరవారిని ఒక
సందేహముమాత్రము అడుగుచున్నాను.
అదేమనంగ, నేను చచ్చి యిప్పటికెన్ని
సంవత్సరము లాయెనని యడిగెను. అం
దుకు మేత్రాణులవారు నీవు క్రమించి ము
ప్పదినాళ్లుమాత్ర మాయెనని చెప్పిరి.
అప్పుడు వాడు అయ్యయ్యో! యీ ము
ప్పదినాళ్లలోగా దుర్గంధ నరకమున బ
డిన వారలను చూచితే ఎడతెగక జడివా
న కురిసినట్టే లెక్కకు అణగనివారలు
నరకములో పడినందువల్ల లోకము ముగి
యుకాలము వచ్చినదని తలంచి యుం
టినే యని చెప్పి వెంటనే మహా ఘోర
నరక పాతాళములో పడెను.

ఓరీ పాపాత్ముడా, మేము చెప్పినది
వింటివా! చాలదా! మా సంరక్షణమైన
అమ్మలు నీహృదయమందు నాటలే
దా? విడవవా నీ పాపమార్గము! చాలిం
చవా నీ మంకు భ్రమ! ఇదిగో నీవలెనే
లెక్కలేని జనము నిత్య నరకాగ్నిలో
దినదినము వేనవేలుగ పడి ఎన్నటెన్న
టికిని కాలెదరని వింటివికదా? ఇకనైనను
నీవందులో బడక పాపమును వర్జించి
దివ్య కర్తకు సేవచేసి ఉత్తమ పుణ్య క్రి
యలలో ప్రవర్తింప తెగువజేయుటే కా
ర్యము! లేనట్టయిన అనేకులు తలంచని
సమయమున నరకములో పడినలాగు
నీవును పడుదువు అని ఎరుగుదువుగాక

# నాలుగవ వ్యత్యాసము.

## నరకముయొక్క నిత్యాత్మ.

వ॥ అవధరింపుము తత్పరమానందగురువు బోధార్థులైన మహీసురాది మానవుల నవలోకించి: యో సుధీవరులారా మీకు నింకఁ దన్నరకపు నిత్యాత్మను వినిపించెద, వినుండి యని యిట్లనియె.

ఉ॥ ఎన్ని దినంబుల నిర్ఘ్బం-ధోన్నతి నరకంబునందు నుండవలె ననం
బన్నుగఁ దలపోసిన, మఱి-తన్నరకస్థితి దినాలఁ దప్పక వినుమీ.

సీ॥ ధరణీ పరాగ రేణు రజఃవ్రజంబెల్ల-గణుతించినట్టి యా గణ్యమెల్ల,
నుదధులలోపల నొప్పారు నొక్కొక్క-బొట్టుగా నెంచిన బొట్టులెల్ల,
ధారుణీస్థిత సర్వ ధారుణీరుహముల-యాకులన్నియు నెంచినట్టి లెక్క,
చదలందు రిక్కల సముదాయమెల్లను-గణుతి చేసినయట్టి గణితమెల్ల

తే॥ సమ్మిళితమొదఁ జేయఁ దత్సంఖ్యమిగుల
నెంతయు నగునో తప్పక యిన్ని కోట్లు
ఘనతర సంవత్సరంబులు గడచిన, నిఁక
సలిలయోనిపయోధిలో నిలువవలయు.

తే॥ ఇట్టు నరకానలాబ్ధిలో నెనసి నీవు
పెక్కు సంవత్సరములెట్లు వేఁగెదవుర
మంటలకు, దంటలైన దుర్మతి పిశాచు
లిడెడి బాధల తన్నులకే విధంబు.

క॥ ముగియక యాఱిక మాఱిక-సెగలం బొగ లెగయ మండ సాగెదవటరా
మిగులఁగ వెతబాధలుఁగల-యగణిత నరకానలాబ్ధియందు నఘాత్మా.

ఉ॥ కల్లక కంపుకొట్టుటయు ఘోరపిశాచులు తన్న సాగినం
జెల్లుగఁ దన్నులంబడుట ప్రీతియొ? సీసము కాఁగుచున్న బల్
త్రుళ్లగు వేఁడిగుంతలను ద్రొబ్బిననంతటఁ దల్లక్రిందుగా

నాళ్ళు చెడంగఁ బొర్లుడి యయ్యో యని యొర్లఁగ మర్లొ చెప్పరా?
క॥ పండ్లిగిలించుచు దిక్కె-వ్వండ్లో యని యొర్లి యొర్లి వారక యెంతో
కండ్లు చెడి నరకవహ్నుల-వేండ్లకు దాళెదవ దెట్లు వెతలం బడుచున్?
క॥ ఈ విధమున నరకస్థలు-చావైనన్ రాదటంచుఁ జల్లాఅని యె
న్నో వెతలొందుచుఁ గుందుచు-గావింతురు రోదలు నేడ్పుకరణిన్ వినరా.
ఉ॥ ఇప్పుడు క్షుత్పిపాసలకు నించుక యోర్చుటలేక వీఁక న
ల్లప్పుడు ఘోరమైన నరకానలనీరధిలోఁ బడంగ నె
ల్లప్పుడు తీఱనాఁకలికి నాఱని దప్పుల కోర్చి యుండఁగా
నొప్పుచునున్న వాఁడవా, మహోన్నత బాధలనెల్లఁ బొందుచున్.
తే॥ నిత్యమైనట్టి మేలుల నెఱుఁగలేక
వగ ననిత్యపుమేలులఁ వాంఛఁ దవిలి
పొగిలి పడి నమ్మితివి, యెట్లు సెగలఁ బొగల
మండు నరకదవాగ్నిలో మండెదవుర.
ఉ॥ ప్రాయము గల్గి బాళి నిలఁ బట్టఁగలేక మనంబులోఁ దమిం
బాయక కామినీమణులపై మతి నిల్పి సుఖించి రత్నభూ
షాయుత గంధసారముల సౌఖ్యముతోడ నలంకరించు నీ
కాయము పుచ్చి యూది చెడు కంపును గొట్టును నారకంబులో
చ॥ పరు లొనరించునట్టి యొక పాటి యపాయము లేని నేరముం
గరుణ వహించి యోరువక గ్రక్కున దండన చేసి యమ్మహా
నరకదవానలాంబుధి ననారతముం బడరాని పాట్లచేఁ
దరగక యా పిశాచులకు దాసుఁడవౌదువు తన్నులుం దినన్.
క॥ ఇటువంటి నరకపావక-తటినీవరమందు నా వెతల్బడుటదియే
త్రుటిగాఁ జూచితివో త-త్పటు బాధలు పడెడువారె పడియెద రనుచున్.
సీ॥ అవుర యీలాగున నతిఘోర నరకాన-బాధలొందఁగ రానిపనికినైన
సర్వేశ్వరస్తోత్ర సారసాప్త ప్రభా-తతులచే నజ్ఞానతమ మణంచి,
యమ్మహాదేవుని నర్చించి వందనం-బాచరించి జపంబుఁ బరఁగఁ జేసి,
యాతని ధ్యానించునట్టి యనుష్ఠాన-మేక చిత్తంబుతో మిగులఁ జెలఁగు
తే॥ ధర్మతప మొనరించినఁ, ధార్మికతను

పాపనిచయంబునెల్లను బాఱఁద్రోలి
మోక్షరాజ్యంబు గైకొని ముదముతోడ
సంతసిల్లెదవట నీవు జ్ఞానవైన.

వ॥ అదియునుంగాక దుర్గంధనరక నివాసు లెటుందురన వినుము.

సీ॥ పూర్వాన పరిజన పుణ్యులుండెడి యొక్క-నయమైన ఘన పట్టణంబు గలదు,
తత్పట్టణంబులో ధరణిపుఁడొక్కఁడు- పెద్దకాలంబు సంప్రీతిని మని
కాలంబు చేయుడు కడపటి రోగము-సంప్రాప్తమై యందు సమయు వేళ,
మిగులఁ దత్పురి హితమిత్రాణులైనట్టి-ఘను లేగుదెంచి మన్ననఁ దలంచి

తే॥ కాంచి, యో తమ్ముఁడా, నీకుఁ గాలమృత్యు
వౌర చింతింపవలదని యాదరించి
నీవు సమసినపిమ్మట నీవె మరల
వచ్చి నీ యాత్మ యెందో వాక్రుచ్చి పొమ్మ.

క॥ అని మంచిది యనిపించుక-చనిరి నిజస్థానములకుఁ జక్కఁగ వారల్,
జనగా నా మనుజేంద్రుఁడు-దనరఁగ నరకమున కేగఁ దా మృతుఁడయ్యెన్.

వ॥ అంత నా యొకమీఁదు మృతుండై చని వెండియుఁ ద్రింశద్వాసరంబులు వెలువడిన పిమ్మటం దదీయ పట్టణ మిత్రాణులైనవారికి దృష్టంబై యున్న, నా మను జపతి యాత్మఁ గనుంగొని వేగ మిత్రాణులైనవా రిట్లనిరి.

క॥ ఎందు వసించితివయ్యా-యెందులనుం డిచటి కిప్పు డేతెంచితివి
వందులఁగల చోద్యంబుల-నందఱు నాలింపఁ జెప్పు మరమరపడకే.

తే॥ అనిన నాలించి నరపతి యాత్మ యనియెఁ
జిత్తగింపుఁడి విన్నవించెదను మీకు,
జ్ఞానహీనుండనై యేను గర్వమునను
జేయు నఘమున నరకంబు చెందె నాకు.

క॥ ఆఱువ కల్పన కెంతో-వైరంబగు నఘముఁ జేసి వారక యిటులన్
ఘోరనరకానలాబ్ధిని-జేరి వసింతిని, వెతలఁ జెందఁగ వినుఁడీ.

ఉ॥ మీ కరుణాకటాక్షమున మీరొనరించినయట్టి కట్టడిం
బ్రాకట మొప్ప నిచ్చటికి రాగలిగెం గద నాకు మాత్రముం
జేకొనె నీ క్షణంబు, మఱిఁ జేరఁగ నా నరకాగ్నిలోన నా

శోకము నెల్లకాలమును జొచ్చెదు బాధలు నేమి సెప్పుదుర్.
క॥ దేవరవారిని నింకొక-భావన యరయంగ విన్నపము చేసెదనో,
మీవల్లనె యా సందియ-మేవల్లనునైన నెఱుఁగ మేలగుఁ సుమ్మా.
మ॥ అది యెట్లన్నను విన్నవించెదనయా యాలింపుఁడీ, కొంచె మె
ట్టిదటంచుం దలపోయఁగావలదు నిప్డే నేను గాలంబుఁ జే
రు దినంబాదిగ నెన్ని వత్సరములే రూఢిన్ మృతంబౌటయో,
యిది నాకానతి యీరయా వినియెదన్ హీనత్వమాదుఃఖినై.
క॥ అనవుడు విని హసియించుచు-మినుకుచు వచియించు వేగ మైత్రాణిఘనుం
డనుకంపను వినుమని య-మ్మనుజేంద్రుని యాత్మ కపుడు మఱియు దరణన్.
ఉ॥ నీవు క్రమించి పోయినది నేఁటికి ముప్పది వాసరాలిలన్,
నావుడు నాలకించి సుగుణాకర, యో కరుణారసాత్మ, వి
న్నావటయయ్య యద్భుతమునైనది యా నరకానలాబ్ధిలోఁ
దా వసియించినంతటను తద్దయు నీ దినముల్ మదిం గనన్,
తే॥ దినము సంవత్సరంబుగాఁ దెలియఁ దోఁచు
నట్టి దారుణ నరకానలాబ్ధిలోనఁ
బడిన వారాల లెక్కింపఁ బడుటకైనఁ
గనఁగ సంఖ్యానవిద్య లేదనఁగ వినుఁడి.
వ॥ ఇత్తఱి ఘోరదుర్గంధ నరకానలాంబుపార గతులైన మానవు లసంఖ్యంబై యు
డుటం జేసి యిజ్జగ మొగి మునిగెడి వగ యని తగం దలంచితినని వచిం
తత్సమయంబున స్వకీయకృతదారుణ నానా దురిత దుష్కర్మవశంబున య
యెకిమీని యాత్మ క్రమ్మఱ నరకంబునకుం జనియెనంత.
ఆ॥ ఓరి పాపి, వింటివో యింకనైనను
నాగి దురితములెల్లను నణచెదవో,
ధర్మతపము సేయఁ దలఁచితివో లేదో
తెలియ మానసమున దృఢముగాను
తే॥ నేను జెప్పెడి వాక్యాలు నీకె కాక
యితర నరులైనవారికి నెల్లఁ దెలియఁ
జెప్పుచున్నాఁడ, గాన నిశ్శ్రేయసములు

నెఱుఁగ జ్ఞానోదయంబు లభించుకొఱకు.

తే॥ ఘోరనరకాగ్ని బాధ కఠోరమనియు
నట్టి యాజ్ఞలఁ బొందుటనయము గాద
టంచు నవి తప్పి తాఁ దరియించుకొఱకుఁ
దెలియఁ జెప్పితి జ్ఞానంబు తేటపడఁగ.



# అయిదవ వ్యాఖ్యానము.



## ప్రపంచపు చెల్వములయొక్క అల్పతనము.

దుర్గంధ నరకముయొక్క కఠోర నిత్య వేదనలు మహా కఠినములనియు ఇటువంటి యాజ్ఞలకు లోపడరాదనియు అందులో పడక తప్పించుకొను తెరువు ఏలాగనియు తెలివి జ్ఞానముల చేత తెలిసికొనడము మనుష్యుని యొక్క సత్కర్మ మేసరి. అందుకు తెరు వేదని యడిగితే వేని సకల పాపాక్రమములను వర్ణించి మంచి పాపసంకీర్తనము చే తన యాత్మను శుద్ధీకరించుకొని పొగవలెనే కానకపొయ్యేడి ప్రపంచ మేలులను నమ్మక, యేక దేవునిమాత్రమే వెదకి వారి చిత్తము చొప్పున నడచుటే క్రమమైన తెరు వని ఎరుగగలవాడవు.

అయితే లోకముయొక్క అల్ప మేలులకు పునాదియయ్యేడు బంగారు, వెండి, ముత్యములు, నవరత్నములు, పట్టు, జవ్వాజి, పునుగు, కస్తూరి మొదలగు వానినన్నిటిని సంపాదించినవారలకు బహుమానపు వరుసలు, రాజ్య ప్రతిపాలనము సంప్రాప్తమవుననియు స్త్రీ చెల్వభోగములు తక్కువగాకుండ జరుగుననియు వీరశూరత్వప్రతాప మహిమలు కూడ ఒనగూడుననియు ఇట్లు తలంచిన లోక మనుష్యులు ద్రవ్యములనే వెదకుచు పాటుబడుచున్నారుగాని సద్గతికి మార్గమైన సుకృత పుణ్యములను వెతకుటలేదు. అయ్యో, ఇటువంటి ప్రపంచపు మేలులు

ఎన్నాళ్లు నిలుచును?

సత్యవేదవాక్యము చొప్పున ఈలోకపు మేలులన్నియు వ్యర్థములలో వ్యర్థమును, నీడలలో నీడయునై యున్నవి కదా. అదెటువలెననగ, ప్రపంచపు మేలులన్నిటిని ఒక్కొకటిగా విడదీసి వాటిని విచారించినట్టయిన, ద్రవ్యసంపాద్యము కలిగి స్త్రీ భోగమునందు సుఖించునదియు, పరిణామముతో హర్షించి కీర్తి బహుమానముతో ప్రతాపించునదియు, వీరశూరత్వముతో ప్రతిపాలించి మహారాజై లోక సుఖభోగములను అనుభవించునదియు ఇవియేగదా ప్రపంచపు మేలులు! ఇదిగో వీనిలో దేనినైనను విచారించి చూడగా న్యొక్కటైనను నేటయిన భాగ్యమై నిలుచుచున్నదా?

ఎందుకనగ, బంగారు వెండి యనబడునవన్నియు మంటియొక్క యూట. ఖెల హెచ్చుయిన పునుగు జవ్వాజి కస్తూరి యనబడినవన్నియు మృగముల యొక్క అశుద్ధము. పట్టుపట్టావళులన్నియు నేసెడు పురుగులయొక్క నార. ఇదిగో వీనిలో నేమైన భాగ్యము కలదా? రోతైన యీ ప్రపంచపు మేలులు అనుభవించు వానికి మనఃచింతలు తీరక సుఖములో సహితము నానా సంకట దురితములు తటస్థించుచున్నవి. ద్రవ్యములలో సిక్కును, వీరశూరత్వములో అలపును, స్త్రీ భోగములలో వెగటును చెడ్డ వ్యాధులును, ఇవ్విధమున ప్రపంచ సుఖభోగము లెంతకెంత యధికరించునో అంతకంత మనస్సు చంచలమును, బుద్ధికి మైకమును, ఆత్మకు నష్టమును కలిగి యుండుననుటకు సందేహములేదు.

ఓరీ పాతకుడా, ఇటువంటి రోతైన సుఖభోగములకుగానో నిత్య పరమగతిని మరచి తిరుగుచున్నావు? మంటియొక్క యూటకుగానో న్యాయమైన మార్గమునకు తొలగి దూరముగా పోవుచున్నావు? మృగముల యొక్క అశుద్ధమునకో నీ యాత్మమును నిత్య నరకములో పడద్రోయుచున్నావు? ఈ నీచ కంపైన మోహ సుఖమునకో నిత్యానంద ఘనతర సంతోష పదవిని దారబోసికొనుచున్నావు? ఈ మంటిగడ్డ సుఖములకో నడకయని పరుగని యెంచక రాత్రి పగలని తలంచక పాప పుణ్యములని విచారించక అగచాట్లు పడుచున్నావు? ఇదిగో అనుదినమును ఈ మాయలోకపు చెల్వములు అనేకులను అక్కడక్కడ ఇహపరాదులకు మోసగించెడు ఘాతుకములని వినలేదా?

ఇదిగో ఒకరాజు మోహ సుఖముతో తన రాజ్యము నేలుచుండగా వానిక్రింది ప్రజలే గుమికూడి వచ్చి వానిని పట్టుకొని బ్రహ్మాండమైన పెట్లువేసి నేలకు

పడతన్ని చేయరాని భంగములన్ని చేసి రెండు చేతులును తెగనరికి వీధి వీధిని ఈడ్చుచు త్రిప్పినపిదప కాటికి తీసికొనిపోయి తలనరికి పారవేసివచ్చిరి. కంటివా, లోకపు మేలులలో సుఖమెక్కడ? స్థిరమెక్కడ?

ఈలాగు మరియొక దళకర్త అనేక సీమలను జయించి పట్టుకొని తన వశపరచుకొని మహా వైభవముతో రాజ్యము ఏలుచు కష్టములో చిక్కి తానున్న పట్టణములోనే రెండు కన్నులను పీకించుకొని కట్టిన సీమలన్నియు పోగొట్టుకొని పరదేశమునకు బోయి భిక్షమెత్తుకొని దరిద్రుడుగా పడి చచ్చెను. వింటివా, ఈ లోకములో పరాక్రమశాలియై యున్నవాని చెల్వ సుఖములు ముగిసిన గతి.

మరియొక రాయడు తన రాజ్యము దారబోసికొని కీర్తి గౌరవములను పోగొట్టుకొని కడకు చిన్నవాండ్రకు చదువు నేర్పుకొన యొక బడి కట్టుకొని మరణపర్యంతము అట్లనే కాలముపుచ్చి క్రమించెను. కంటివా ప్రపంచ చర్యలు చేయు ఘాతుకము!

ఇంకొక రాయడు డెబ్బది రాజ్యముల నుకొట్టి జయించి ఘనులుడై యుండగా, తుదకు ఒక ధూర్తునిచే చిక్కి రెండు చేతులు నరికించుకొని గులామై యుండి గతించెను. ఓ ప్రపంచపు మరులుచే నిండినవాడా, మహా ఘనముగా నెంచి బహు అభిలాషతో సంపాదించవలెనని నీవు ప్రాకులాడి వెదకెడు లౌకిక భాగ్యములయొక్క శాశ్వతము వింటివికదా? ఇట్టి ప్రపంచపు చెల్వములను బుద్ధిమంతులు నమ్మెదురా? నిత్యానంద పదవియైన మోక్షము నొసగ నవధరించెడు పరమకర్తను సేవించడమును, వారి చిత్తముచొప్పున నడువడమును శాశ్వతమైన భాగ్యముగా నుండునుగాని ఇతరములన్నియు నీడయొక్క నీడగా నున్నవనుట వాస్తవమే సరి!

ఓ భాగ్యాభిలాషుడా, ప్రపంచ అల్ప భాగ్యములమీద నీకు గల పట్టు వదలుటకు ఇది చాలదా? చాలదంటే యింక వినుము. విజయనగరపట్టణములో అనేక రాజ్యములకు నధిపతియై కర్తగా నుండిన వేంకటపతి యను రాజు సమస్తమునకు నరపతి యనిపించుకొని లెక్కమితములేని దళములను గూర్చుకొని మహా శౌర్యముతో ననేక రాజులను జయించి పట్టిన కార్యమును పోరాడి నెరవేర్చువాడును, తన ప్రజలను రక్షించువాడును, బ్రహ్మాండమైన తురకల దండును సంహరించి వీరులకు వీరుడైనవాని తల తెగనరికి శూరత్వపు బిరుదులను కొనినవాడును, సముద్రనాథు డనిపించుకొని ఏనుగలను సహితము పట్టి మర్దించు

బలశాలియై మహా వైభవముతో లోకమునకంత అధిపతి రాజు నేనే యని చెప్పుకొనుచున్నవాడును, రాజ్యము పోగొట్టుకొని, గౌరవము దారబోసికొని, పట్టణమునుండి వెళ్లదరిమించుకొని, మహా దుఃఖమునొంది పరదేశిగా పడి చచ్చెను. కంటివా, యీ లోకములోని మాయమగు చెల్వసుఖభోగములను నమ్మినవానికి వచ్చినగతి తెలిసెనా?

అనేకమైన సైన్యములను జయించిన మహా రాజయినవాని భార్య రాణి మిగుల రూపవతి రాజుయొక్క మంత్రులలో మహా సౌందర్యముగల ఒకనిని ఆశించి వానిని పిలువగా వాడు కారాదన్నందువలన ఆమె మనస్సు కోపపువెఱ్ఱి రేగి శుద్ధ విరక్తుడైన మంత్రిని చంపింప నూహించి రాజుదగ్గరకు వచ్చి ఇదిగో ఫలానివాడు నన్ను పిలిచి పట్టవచ్చెనని చాడిచెప్పగా, రాయలు ఉగ్ర కోపగములవాడై ఆ మంత్రిని రావించి తల నరికించెను. ఆ మంత్రియొక్క భార్యయో తన మగని శిరస్సు చేతబట్టుకొని రాయని ముందర దానిని విసిరివేసి, ఇదిగో నా స్నేహముగల పెనిమిటియొక్క తల నరికించి నెరజల్లినది మీరేనా? ఆయనమీద మోపిన నేరము ఏమి? కారణ మెక్కడ? మీరు మోపిన నేరము శుద్ధ అబద్ధమని ఇప్పుడే చూపుదును. ఆ నేరమును, కారణమును ఒప్పించువారు కలిగినయెడల ముందుకు రాగలవారు అనుచు కాలిన యినుపముద్దను చేత నెత్తగానే దాని చేయి కాలలేదని రాయడు చూచి తన భార్యమీదనే నేరము కద్దని యెంచి దానిని పిలువనంపించి విచారణచేసి దానిపైన నేరముమోపి గులాములచేతికి నొప్పగించి మహా అవమానముగా వీధి వీధిని త్రిప్పి లాగించి దెబ్బలు కొట్టించి మండెడు ఆవములో వేసి కాల్చివేయుమనెను. కంటివా ఓరి పాపీ! ఈ రోతైన పాపసుఖమునకు వచ్చిన ఆజ్ఞ! ఇట్టి కంపుబట్టిన పాపమునకుగాను నరకమున బడు మనుష్యు లెంతమంది యని చూచితివా? ఈ అశుద్ధరోత ఆశకుగాను నీ యాత్మను చెరచుకొని కలంతకాలము ముగియని నిర్బంధ నరకమున పడబోవుచున్నావా?

ఎఫెజసను పట్టణమున మహా సుఖముగా సంచరించుచుండిన స్త్రీ పురుషలిద్దరు ఎడబాయని నేస్తములో నున్నపట్ల పురుషుడు మరణించెను. పురుషుని మరణమగుటయు భార్యకూడ వానితో చావవలెనని తెగించి తన పురుషుని పూడ్చిన సమాధిముందర పడి యేమియు తినక చచ్చెదనని రాత్రియు బగలు ఎడతెగక ఏడ్చుచుండెను. అందుకు సమీపములోనే ఒక దొంగను గాలమున వేసి

ప్రేతమును ఎవరును దొంగలించుకొని పోకుండ ఒక బంట్రౌతును కావలియుంచిరి. సదరు స్త్రీ యేడ్చెడు శబ్దమును వీడు విని ఆపెదగ్గరకు వచ్చి లలితవార్తలచే దాని తల దడివి దాని దుఃఖము పోవనును దాహము తీరనును ఆకలి తీరనును అనో్న్దకము లిచ్చి మనస్సు కుస్తరించి ఊరట చెప్పి లాలించి కడన పాపమునకు ఒప్పజేసి సేనాసేపు పాపములో కాలము గడుపుచున్నపుడు వాడు కావలికాయుచుండిన దొంగయొక్క ప్రేతమును వాని బంధువులు వచ్చి ఎత్తుకపోయిరి. తరువాత ఆ సేవకుడు వచ్చి ప్రేతమును కానక మహా అంగలార్పుతో సమాధి యంచున ఏడ్చుచున్న స్త్రీ యొద్దకువచ్చి చెప్పగానే ఆమె వానిని జూచి మంచిది సి వెండుకును జడియవద్దు, నేనే నీకు జవాబుదారి, ఇదిగో నా పురుషునియొక్క ప్రేతమును ఈ సమాధినుండి బైటికితీసి యెత్తుకపోయి ఆ గాలమునకు ఎక్కించుదము రండి యని చెప్పి ఇద్దరును సమాధి త్రవ్వి తెరచి తన స్నేహ పురుషునియొక్క శవమును ఎత్తుకపోయి గాలమున వ్రేలాడ వేసి ఆ బంట్రౌతును తానును అన్యోన్యులైయుండిరి.

ఓరీ పాపీ, లోకులయొక్క అక్కర ఎంత స్థిరమనియు లోకనడత ఎట్టిదనియు కంటివా? అనిత్య మాయభోగములను నమ్మవద్దు. ఆశించనువద్దు! ఎందుకు ఈ మాయ చెల్వములను నమ్మి వానిపై ఆశనుంచి నిత్య నరకమునకు పోవలెనని ఉబ్బులూగెదవు? ఈ రోతకో నిత్యానంద మోక్షమునకు పొయ్యెడు మార్గము మరచి నరకబాట తెగద్రొక్కెదవు? ఓరీ భ్రమపట్టినవాడా, ఇదిగో ఈ ప్రపంచ సుఖభోగములన్నియు నీలాగు మాయకొల్పి మనుష్యుని యాత్మను చెరచి పరమగతిమార్గము చేరకుండ ఆటంకము జేయుచున్నవని ఎరుగుదువు గాక. ఇది తెలిసి యిక నైనను బుద్ధితెచ్చుకొని యీలోక మేలులను నమ్మక పాపమార్గము బొత్తిగా విడిచిపెట్టి పుణ్యత్రోవలో పరిశుద్ధుండవై వర్తింపగలవాడవు.

# అయిదవ వ్యత్యాసము.

## ప్రపంచపు చెల్వముల యొక్క అల్పతనము.

వ॥ అవధరింపుము. తత్పరమానంద గురువు మఱియుఁ జెప్పినదేమనఁగా: ఇవ్విధంబున మానవుండు జ్ఞానంబు దెలిసికొనుట సత్కర్మంబని, మనంబునం దెలిసి ప్రపంచలీలాజాలంబులగు మేలుల నమ్మక నెమ్మి సమ్మహా దేవుని స్తోత్రంబు గావింపఁ జేరి తదీయ మానసానుకూల సేవా ధురీణుండై మోక్షము పొందవలయును. మఱియు నహంకారంబున నమ్మెడి ప్రపంచపు మేలులవలన ప్రయోజనంబు లేదది యెట్లనఁగ వినుము ।

సీ॥ కాంచన రజతాది గల ధనంబులు వజ్ర-వైడూర్యమాది సద్వైక మణులు
మృగనాభి మొదలుగాఁ దగు సుగంధ సువస్తు-వులను జీనాంబరంబులును గోరి
సంపాద్యములు చేసి సరకితో వర్తక-వ్యవహారములలాభ మమరఁ బొంది
ప్రౌఢులై బహుమానభావనల్ పొందుచు-భాగ్యసంపన్నులై యోగ్యమగను

తే॥ రాజ్య మేలుచుఁ గామితార్థముల నెల్ల
ననుభవించుచు శౌర్యధైర్యములతోడఁ
జూడఁ గన్నుల పండుగై చోద్యముగను
ధనికులై మానవులు వేడ్కఁ దనరుదు రిలఁ.

క॥ అనుచుఁ దలంచుచు నుండెద-మనుజులు మాయాప్రపంచమయిన యకించిత్
జని తానిత్యపుమేలుల-మనమున నమ్మినను, గలదె మఱి పుణ్యములున్.

ఆ॥ నీరు మీది బుగ్గ నిక్కమై, యేనుఁగు
మ్రింగినట్టి యక్కపిత్థఫలము
గరిమ యగుచుఁ గింశుక ప్రసూనమురీతి
యనఁగ నాఁ బ్రపంచమందుమేళ్లు.

క॥ ఇట్టి ప్రపంచపు మేలుల-నట్టిగ మఱి నమ్మి ధనమె కాంక్షించెడి
పట్టున సుకృతముఁ గోరరు-మట్టెఱుఁగక జ్ఞానహీన మానవులెల్లన్.

క॥ నిత్య మటంచును మఱియు న-నిత్యమగు ప్రపంచమందు నెఱసిన మేళ్లన్
సత్యముగ నమ్మనేలి, య-సత్యముగుం గాక సుకృత సౌఖ్యము గలదే? 6
క॥ నారీసాంగత్యంబును-శూరత్వము ధీరతయును క్షోణీపత్వం
బారయ ధనికత్వము గం-భీరతయుఁ బ్రపంచమందు మేళ్లనఁ బడగా, 7
క॥ నిన్నిటిలోపల నొకట్టై-నన్నిత్యంబైన మేలు నరయఁగఁ గలదా,
(సొన్న మని కోరఁబోయిన- వన్నెలకై మంటియూట వడిఁ దనరుఁగదా. 8
మ॥ వెలహెచ్చైన పునుంగు కస్తురియు మా వేడ్కైన జవ్వాజియుం
జెలువైనట్టి సుగంధవస్తువులు కడున్ సింగారమై నిత్యమై
వెలయున్ మంచి వటంచు నెంచినను నీవింపార నాలింపరా,
యిలలో నుండఁగఁ దుష్టిగాని యది నీ కెల్లప్పుడున్ జేటవున్, 9
తే॥ కాన పట్టుపటావళుల్ క్రమముతోడ
నిత్యమైనట్టి మేళ్లుగా నెమ్మనమ్మ
నమ్మఁగా నది పురుగుల నారగాదె
వానియందున గరిమ నివ్వాటిలుటకు. 10
శా॥ ఓరీ రోతగు నీ ప్రపంచపు ఘనం బొప్పారు నా మేళ్ల వే
మాఱుం గోరి భ్రమించి తా రనుభవంబందంగ పిమ్మ్ట న్మహా
శూరత్వంబున సంచరింపఁగఁ గడున్ సొంపార మైలంపటల్,
నారీ సౌఖ్యములన్ సుఖింపఁగను నానా బాధ దుఃఖంబవున్ 11
తే॥ ఈ ప్రపంచపుఁ జర్యలు నెంత కెంత
యధికరించునో తప్పక యంతకంత
మనముచంచల మవును విస్మయముగాఁగ
సందియంబేల వినరా వెసం దిరాన. 12
క॥ ఇటువంటి రోత చర్యల-కటుగా నిత్యమగు పరమగతి మఱచి చరిం
చుటఁదగునె, నీకును మంటి-యూటయుఁ బ్రియమె, పరమగతి దూరముకాగా
తే॥ నరకకూపాన భవదాత్మ నణఁగఁ ద్రొబ్బఁ
దలఁచి యా మృగముల యశుద్ధంబుఁ గోరి
యంగమెల్లను ఘుమఘుమ యనుచుఁ దావి
యుప్పతిల్ల నలఁదుకొనియుండు టదియు 14

ఆ॥ అట్టి నీచు కంపు లణగిన మోహాంగ
ములకు నిత్యహర్షములయినట్టి
పరమగతియు ననెడి యరుదైన యపవర్గ
పదవి వర్ణనంబు పాడియగునె?

వ॥ ఇత్థంగి నేమియు నెఱుంగ నేరని క్రూరులైన దుష్కృతిమానవు లీమాయా ప్రపంచ చర్యానుమోదులై, పాపపుణ్యంబుల విచారింపక నీచవర్తనులై, చరించినయెడల వారికి మోక్ష భాగ్యం బెప్పుడైనఁ గలదే, యది యెట్లన్న వినుము.॥

క॥ ఇదిగో మున్ దొక నరపతి-మదమొప్పారంగఁ జాల మోహాసుఖమునన్
మదమున రాజ్యం బేలుచు- నదరక బెదరకయు నుండె నభయాత్ముండై.

ఆ॥ వాఁడు సేయు దుష్టవర్తనలకు నెల్ల
మది సహింపఁ బోక యదిరి పడుచు
నిజ పరిజనచయము నెల్ల వచ్చి బిరాన
కూడి పట్టి కొట్టు గొట్టి కొట్టి,

మత్తకోకిల॥

గొబ్బునం బెను దెబ్బ లెక్కువ గొట్టి ధారుణి పైఁబడన్
ద్రొబ్బి తన్నులు తన్నుచుం బలు దుడ్డుచున్ బహు తిట్టుచున్
నిబ్బరంబును వీడి యేడ్వఁగ నీక, చేతులు ఖండనం
బబ్బురంబుగఁ జేసి వీథుల నార్చుచున్ వెసఁ ద్రిప్పుచున్

క॥ అటుమీఁదటఁ దటమటమున-గటకట యని పోక త్రిప్పి కాటికిఁ బోఁగా
నటునటు తొలంగ నీకయుఁ-గటుకనఁ దల నఱిరంతఁ గాటిం బడగన్.

తే॥ అంతటన్ భూమిపతి మృతుండగుచు నరక
దావపావక నీరధిలో వసించి
సకలమైనట్టి వేదన నికట బాధ
లందుఁ బొందెను గాఢశోకాత్ముఁడగుచు.

క॥ జనపతి చనిపోయినఁ బరి-జనసంఘము లెల్లఁ బిదప సంతోషమునన్
మని రటు, కొన్ని దినంబులఁ- జనిపోయిరి నరకవహ్ని జలధికి వారున్.

తే॥ వింటివటరా మనుష్యుఁడ వీనులార
నీ ప్రపంచాల్ప చర్యలు నిక్కముగను

టక్కుపిక్కులు, వీనిలో నొక్కటైన
నిత్యమైనది కాదుగాని యనృతంబు

వ॥ టక్కుపిక్కులవి యెట్లన్న వినుము.

క॥ మఱియొక భూపాలుఁడు తన-ధర యేలుచు భోగసంపదలఁ దులఁదూఁగన్
గరిమ నొక నాఁడు తద్విభుఁ-డురువుగ నొడ్డోలగంబు నుండెడి వేళన్.

ఉ॥ ఏగతి యుండె నా దిన మిలేశుఁడు నయ్యెడ సంభ్రమంబుతో
దీనుస మొప్ప నప్పుడది తెప్పున సందని పిక్కువార లా
భూమిపు నొద్దఁ జేరి మఱి పొందగ నిచ్చి యమంద ధీరులై
యానును జేంద్రునిం దునిమి యంతటఁ దామును జచ్చి రచ్చటన్.

క॥ పిక్కు లనంగా నివి యగు-నక్కజముగ నీ ప్రపంచమందు నుతింపన్
నిక్కముగ వినుము చెప్పెదఁ-డక్కులు మఱి యెట్లటన్న డాంబిక మగురా

సీ॥ ధర మున్ను మఱియొక్క దళనాయకుండైన-ధీరుండు శూరుండు క్రూరుఁడతఁడు
రాజిల్లుచు ననేక రాజ్యములను గట్టి-నరుల నెల్లఁబడంగ నఱికి గెల్చి
విజయమై ప్రబలి యక్కజముగ మానసేచ్ఛా-విహారముగ రాజ్యముల నేలి
యటుమీఁదఁ గొన్నాళ్లకతనికి భోగంబుఁ-దీఱి నిర్భాగ్యుఁడై తెలివి మాలి

తే॥ వాఁడు తాఁ గట్టుకొన్న సర్వసహాలను
మగలఁ బోఁగొట్టుకొని నిజపురిని తనదు
కనులు పీఁకించుకొని యొ నిర్ధనికుఁ డగుచు
దుష్కృతియు నేమి చోపని దుర్బలుండు.

మ॥ పరరాజ్యంబుల భిక్షమెత్తుకొనుచుం బొట్టుం బడెన్ మిక్కిలం,
బరదేశిక్రమమై వెతం దిరిగి నిర్భాగ్యానఁ గూలెం గదా,
ధర నే మేలులు నిత్యమైనవియొ, తథ్యం బంత నేఁ జెప్పెదన్,
వరుసన్ సత్యముఁ బుణ్యమే పదవి యా వాలాయముం జూడఁగన్

తే॥ టక్కు పిక్కులు మర్మముల్ ధూర్తతనము
కలిమిలేములు సుఖదుఃఖగర్వములును
ధైర్యశౌర్యగంభీరముల్ ధాత్రియందు
నిత్యమా నే, యనిత్యమై నెఱయునుగద.

చ॥ మఱియొక రాజు ముందు బహుమాని సుమానస రాజమాన్యుఁడై

సిరులు దొలంగి తా నెప్పుడుఁ జేసెడి రాజ్యములెల్లఁ బోయి యే
దొరతన మారి, లేమి నటు దుర్బలుఁడై బ్రతుకంగలేక వీం ౧౹
డరయఁగఁ జూచి యొక్కటియు నందు వసించెను వాఁడు రిక్తుఁడై

క॥ ఆ వీటి చిన్నవాండ్రకు-నే వేళం జదువుఁ జెప్పి యిలలోఁ బ్రతుకున్
భావించి కూట మొక్కటి-గావించుక యుండె వాఁడు క్రమమునఁ జెప్పన్

ఆ॥ ఈ విధమునఁ జెప్ప భావించి యప్పురి
చిన్నవారినెల్లఁ జేర్చుకొనియుఁ
జదువుఁ జెప్పుచుండి సరగఁ గొన్నాళ్లకు
వాఁడు చచ్చెఁ దన్నివాసమందు. ౭౭

తే॥ ఈ ప్రపంచపు మాయా మహిత విలాస
వైభవంబు లవేమి శాశ్వతము వినర;
మోక్ష మొసఁగఁగ నవతార మూర్తులైన
పరమకర్తలఁ జేరుట భాగ్యమదియు,

వ॥ మఱియు, విజయనగర పట్టణము నేలిన వేంకటపతి యను రాజుయొక్క మర
ణము వినుము. ౭౮

చ॥ మఱి తొలి యొక్క శూరుఁడు సమస్త మహోన్నత భాగ్యశాలియై
నరపతియా నటంచును ఘనంబుగ సర్వజనంబు లెన్నఁగా
నరిగి దళాలు గూర్చుక మహాపటు శౌర్యముతోడ నెల్ల భూ
వరుల నశింపఁ జేయఁగను వారక ధైర్యభయంకరాంకుఁడై

క॥ అటుమీఁదటఁ గొన్నాళ్లకుఁ-బటుశౌర్యం బణఁగి వాఁడు పండై స్వమహా
పుటభేదనంబులో నం-తట దుర్బలుఁడగుచు వెళ్లఁ దఱుమంబడియెన్, ౭౯

తే॥ తుదకుఁ బరదేశిచందమై యొదిగి యొదిగి
తిరుగుచుం బరదేశాలు తిరిగి తిరిగి
కూడు గానక యేడ్చుచుఁ గుండ కోల
ధారియై కొన్నిదినము లీ తీరున మని,

క॥ కడసారికి సమయఁగ నె-క్కడి దిక్కెవ్వారులేని కష్టపుఁ జావై
పడి పెద్దనిదురవోయెను-బుడమిని మొనగాండ్ల కబ్బు భోగంబు లివే. ౮౦

క॥ ఇట్టి ప్రపంచపుఁ జర్యల-నెట్టనముగ నమ్మినంత నేమి ఫలంబౌ?

గట్టిగను బరమ కర్తల-పట్టించుగ రాదె సరగ భక్త్యుక్తులచే

సీ॥ మఱి ముందునొక మహా మనుజాధినాథుండు-సర్వ భోగములతో నుర్వి నేలెఁ
వాని భార్యయె రాణి, వయసు ప్రాయముగల-ముద్దుల యొయ్యారి మోహనాంగి
తన మనోనాథుని దండ నుండెడి మంత్రి-వరులలో నొక మంచి వన్నెకానిఁ
బడుచుతనంబున బాగైన నెఱజాణ-వాని మోహించిన వారిజాక్షి.

తే॥ యంత నొకనాఁడు కూరిమి యాఁపలేక
తమకముననందుఁ గని వాని నమరఁ దనదు
సరస కటు వేగ రప్పించి సరసమంజు
భాషలను బొందుమని కీరభాషియనియె.

ఆ॥ తన్నుఁ బొందుమనుచుఁ దరలాక్షి యడిగిన
పిదప ప్రాణహానిభీతి తలఁచి
వాఁడు పలికె దీనవదనుఁడై యోతల్లి
వలదు నిట్టి పనులు కలలనైన.

వ॥ అని యనేక విధంబుల నమ్మంత్రివర్యుండు మనంబున భయంబు గదుర, నయ
వినయభక్తియుక్తిశక్త్యనుసార వందనీయవాక్యంబుల నాయంబుజాక్షికి నేత
ద్రాజద్రోహంబు సేయ నోపనని తెలియంజెప్పి వియోగమార్గ గతుండై
చనియెనంత,

మ॥ వనజాతేక్షణ వానిపై నలిగి, నివ్వాటిల్లు వాంఛల్ వృథా
పనియైనందుకు దుఃఖమంది పెను కోపావేశమంతంతకున్
మనసం దగ్గలమై వడిం బెఱిగి యమ్మంత్రీశ్వరుం జేరు మా
యను జంపింపఁ దలంచె రోషవతియై యన్యాయముం గోరుచున్.

ఉ॥ మాసిన చీరె గట్టి ముఖమండలమందు లసద్విలాసమా
వాసి తొఱంగి యంగముల వన్నియ యటున్, వెల హెచ్చుసొమ్ములం
దీసి వికార చేష్టలను దేరి సఖీమణి యుండఁగా నిశన్
భాసురతం దమిన్ సురతభవ్యసుఖానకు వచ్చె నాథుఁడున్.

క॥ తలయెత్తి నిరీక్షింపక-తల వంచుక యేడ్చుచున్న తరుణిం గని భూ
తలపతి యద్భుతమందుచుఁ-బలికెం బలుకాడ వేమి పనికే యనుచున్

ఆ॥ నీవు దుఃఖ మంద నేటికి నింతగా

గాసిఁ జెంద నేమి కారణంబు?
చిగురుఁబోణి, నాకుఁ జెప్పవే యనినను
బలికె విభునితోడఁ బద్మగంధి.

క॥ భూవర యేమని చెప్పుదు-దైవము నామీఁద నింత తలపడి యకటా
యీ వెత లిడదగునే యిటు-నీవల నీయనుభవంబు నేటికిఁ గలిగెన్.

తే॥ అధిప నీపాలఁ బడి యింత యనుభవంబు
ననుభవింపంగవలసెఁగా వినుము నేను
భూమిలోపల బ్రతికినఁ బుణ్యమేమి
యరయ నీమంత్రి చేసినయట్టి పనికి.

మ॥ అదియెట్లన్నను విన్నవించెదను నిన్నైన న్నిరీక్షింపకే
మదమున్ మించి భవత్సుమంత్రి యిటు దుర్మార్గానకుం జొచ్చి న
న్నిదిగో పొందఁగఁ బట్టవచ్చెను గదా నేనప్పుఁడో మూర్ఖుఁడా,
యదిరా తల్లిని నంట వచ్చెదవు పాపా, యంటి భూవల్లభా.

క॥ కంటకమై వాఁడటు న-న్నొంటరిగా నుండఁ జూచి యొగి దుడుకున నా
చంటిపయి నిజనఖంబుల-గంటి పడం బట్టి చెఱచె గనుఁ డివ్విధమున్.

వ॥ అని బహువిధంబుల విన్నవించిన విని మనుజవల్లభుండు మనంబున సచివునిపై నత్యంత కోపావేశంబును, స్వపత్నిపై కరుణాకటాక్ష నిరీక్షణంబును తోఁప, రోషంబునం బెరుఁగుచు నగ్గరితను దుఃఖింపవలదని బలవంతంబున నూరార్చి, దిగ్గున లేచి కొలువుకూటంబునకుం జనుదెంచి యందు నివసించి యాతిత్వరితంబునఁ దలవరులం బిలిపించి సుమంత్రి శిరంబు ఖండించి వేగిరము రండని త్రికరణంబుగా సెలవిచ్చిననంతటం జని తలవరులు రాజాజ్ఞా విధంబునఁ దత్సుమంత్రినిం జేరి తల నఱికి వచ్చి క్రమ్మఱ నరపతికిం జెప్పిరంత.

ఆ॥ తత్సుమంత్రి జాయ తన పతి తలఁగొట్టి
వేయఁ జూచి, యింత యేమి పొసఁగె,
దైవమా యటంచుఁ దలపోసి దుఃఖించి
భూమి విభుని జేరి పొలఁతి పలికె.

క॥ భూనాథ, యేమి నేరమి-నా నాథుని మస్తకంబు నఱికించుటకున్?
గాన వినఁ దెల్పు మనుచున్-నానా విధముల వచించె నా సఖి దొరతోన్.

ఉ॥ పంచపాది॥

అప్పుడు దానిఁ జూచి మనుజాధిపుఁ, డో నలినాక్షి యింత నీ
విప్పుడు చెప్ప నేల, మదియించి యహంకృతితోడ నీ విభుం
డొప్పి యొనర్చె నేర మది యొక్కటి, నీ విటు లేదటంచునుం
దప్పక బాసఁ జేయుమన, దానికి నొప్పెను నీరజాక్షియుఁ
దెప్పునఁ దెచ్చి రయ్యెడలఁ దీరఁగఁ గాఁగిన యినుపముద్దయుఁ.

ఆ॥ ఇంతి యప్పుడు వచ్చి యెట్టిగాఁ గాఁగిన
యినుపముద్ద చేత నెత్తి పట్టి
యిదిగొ మంత్రివర్యుఁ డేమి నేరము సేయ
లేదటంచుఁ బలికె మోదమంద.

ఆ॥ కలికి చేతు లేమి కందక యుండుట
చూచి భూవిభుండు చోద్యమంది
యార తత్సుమంత్రియం దసత్యములేదు,
నేరమనఁగ మనదె నేరమగును.

చ॥ అని తలపోసి డెందమున నా యబలావిభునిం దలంచి, యో
ఘన సుగుణాఢ్య మంత్రివర, కావఁగ నైతిని నిన్ను నయ్యయో,
తునిమితి నిర్నిమిత్త మిది దోషము నాకు లభించెఁ గాక నా
వనరుహనేత్ర యింత పని వారక సేయ నెఱుంగ మానినిఁ.

ఆ॥ నీదు సత్య మిపుడు నీజాయవల్లను
దెలియ వచ్చె, నపుడు తెలియ నైతిఁ
బాపకర్త్రియైన పణఁతియా మత్ప్రియ
చేసె, నేమి నేను జేయ వచ్చు.

క॥ ఇంత యసత్యం బాడిన-యింతి యగు మదీయ జాయ నిఁక నిలుపంగా
నెంతటికైనఁ సాహసి-యెంతని, యీ క్షణమె చంప నింపగు మదికిఁ.

వ॥ అని మనంబున వితర్కించి యసత్యపాపకర్మిణియైన స్వకీయ జాయపై నగ్గ
లంబగు కోపావేశంబునఁ దాళంజాలక యొప్పటి తెఱంగున నత్తలవరులం
బిలువ నంపించి వారలతో నా భూనాథుఁ డిట్లనియె.

చ॥ తలవరులార మీరును మదాజ్ఞను దెప్పునఁ బాపకర్త్రియా

లలన మదీయ జాయను బిఱాన వడిం బురిచుట్టుఁ ద్రిప్పుచుఁ
దల యటుమీఁదట న్నఱకి తప్పక తెప్పున రండు పొం డనన్,
సెలవులు మూఁడుగైకొని విశేష గతిం జని రంత శూరులై.

చ॥ తలవరు లేగి తన్నృపతిదార, నయో కుటిలాత్మురాల, నీ
తలఁపది యుండెనో, వెతలఁ దారుట కై మఱి రోఁత చావుకున్
దలఁచితివో, యటంచు సిగఁ దప్పక తెప్పునఁ బట్టి యీడ్చుచున్
గలవరపో నదల్చుచునుఁ గట్టిరి త్రాళ్లను గొట్టి రెంతయున్.

గీ॥ ఇటులు నానావిధపు బాధ లిడుచునంత
నీడ్చుకొని పోయి వెక్కుచు నేడ్చుదాని
నూరిచుట్టును బడిమిగా నొనరఁ ద్రిప్పి
చావఁగొట్టిరి పిదప రాజాజ్ఞతఱిని.

క॥ రాజు మనంబును జర్యలు-రాజునకుండు నిజభార్య రట్టడి బ్రతుకున్,
రాజొద్దిమంత్రి చావును-రాజిల్లగ నివి ప్రపంచ రచనల టంచున్.

వ॥ ఇవ్విధమున నత్తాపసోత్తముండు తదోబ్బధార్ధులైన మానవులకు వక్కాణించి మరల నిట్లనియె.

క॥ ఓరీ విన్నావటరా-యీ రీతి ప్రపంచచర్యలెల్ల ననంగాఁ
గారాని తుచ్ఛభోగము-లై రాజిలు మేళ్ళఁ బాపు లాశింతు రిలన్.

క॥ ఇటులు ప్రపంచపుఁ జర్యలె-కుటిలాత్ము లెఱుంగ లేక కోరుదు రిచ్చన్
బటుదుర్గంధ భయంకర-పటిమా నరకానలాబ్ధిఁ బడఁ దలఁచి యిలన్.

క॥ ఇంకను నేమని చెప్పుదు-శంకింపఁగ లేక లోకచర్యలవిధమున్,
గొంకకయైనం జెప్పెదఁ-బొంకముగా నరుఁడ వినర బోధార్థివియై.

చ॥ మఱియొక పట్టణంబున సమంచిత సంపదలం జెలంగి మే
ళ్లరయఁగ నొక్క మర్త్యుఁడొక యంగన నేస్తము గూడి పాయకే
మురిపము ముద్దులూర బహు ముచ్చట లిచ్చుగ నాడుకొంచు నా
గరితను గేహినీవిధముగా నొనరించుక యుండె వాఁడిలన్.

క॥ పడఁతి మఱి వాని నేప్రొ-ద్దెడఁబాయని మనసు మోహమెంతోఁ జెప్పన్
గడలేని మమతతో నుం-డెడి విధమున నుండె వాని డెందము గరఁగన్.

మ॥ ఇటు లన్యోన్యముతో మహా మమతతో నేప్రొద్దు నయ్యిద్దఱున్

పటిమం గొన్నిదినంబు లిట్లటి మహా భాగ్యంబులో నుండ, నం
తటఁ గొన్నాళ్లకు వాఁడు గంతుకొనినం, దద్వాసరంబెల్లఁ దా
నటు మూర్ఛిల్లె వెలంది యుల్లమున దుఃఖంబెల్ల వ్యాపింపఁగా.

తే॥ విభునితోఁ గూడఁ గూల నావెలఁది తలఁచి
క్రమముగా వాని భూస్థాపితమగు తత్స
మాధిపైఁ బడి నివసించి మరల మనసు
రాక యుండెను బగలిదిరాత్రి యనక.

సీ॥ తద్ధాత్రియం దొక్క తస్కరు నక్కడ-సరసగా నుండెడి కొఱత వేసి
యా శవం బెవ్వరైనఁ దీసి వేసెదరంచుఁ-దత్పురి ధారుణీధవుఁడు నొక్క
భటుని కావలి యుండఁ బనిచిన, వాఁడు శ్మ-శానము కాపాడ సంచరించి
యాకామినీ శోకమాలించి దండకు-వచ్చి కాంతను జేరి యిచ్ఛగించి

తే॥ నయ వినయ మోహకర దయానియతి మార్గ
ములను భాషించి లాలించి మురిపెమొనర
నాదరణతోడ క్షుత్పిపాసాదులార
నన్నపానంబు లొసఁగె నానందమొంద.

ఆ॥ మనసు కుస్తరించి మమత లంటఁగఁ జేసి
విభుని మీఁద వాంఛ విడువ నుడివి
దనపయిని తలంపు దనరారఁ గావించె
యుక్తి శక్తి చుంబనోక్తి భటుఁడు.

వ॥ ఇట్లంగి నాయంగనామణి మనంబు నుపొంగించిన భటుని యింగితం బెఱింగి యంగీకరించి, శోకంబును లేశంబైన నుండ నీక, నాశంబు గావించి నిశ్చల చిత్తయై తన యనుంగు సంగడికానిపై మోహాదిభ్రమలు వదలి తద్భటానుకూలినియై లీలామనోలోలజాల కామితార్థంబులం గలసి మెలసి వానికి సుఖాను భోగానుభవంబులం దనివి తీర్చుచుం బెద్దప్రొద్దు నిద్దుఱు ముద్దుగా నుండ న య్యెడ.

ఆ॥ కొట్టుదండ నెవఁడుఁ గొనక్షాని కావలి
లేక యుంటఁ జూచి ప్రాకటముగ
ముచ్చుచుట్టలెల్ల వచ్చి కొంపోయిరి

కొఱఁత నుండు శవము నరిది పడఁగ.

క॥ పదపడి కొఱ్ఱ మాయెనొ-గద, శవ మేమాయెనో, సుఖభ్రమ నుంటిం
గద యని యక్కడ నా భటుఁ-డదరుచు బెదరుచును వచ్చి యరసి కనంగన్,

మ॥ కొఱఁతన్ బీనుఁగులేక యుంటఁ గని యక్కుం గ్రుద్ధుకొంచున్ మహా
దరచేతం దరిలేక పెక్కుదరి ఖేదం బుప్పతిల్లంగనుం,
దరి యేలాగని యంగలార్చుచును బద్మాక్షీ సమీపానకున్
మరల న్వచ్చి సవిస్తరంబు వినిపింపన్ గాంత ధైర్యాత్మయై,

చ॥ జడిసెద వేటికో భటుఁడ, సారెకు నేటికి నంగలార్వ నీ
వడలఁగ నేల, యిట్లు విను మారయఁగా, నిజ భర్త పీనుఁగున్
వడిఁ గొనిపోయి యా కొఱఁత వారక వేయు మటన్న, నప్పుడుం
తడఁబడఁబోక వల్లె యని దానికి వాఁడటు లొప్ప నెంతయున్

గీ॥ అపుడు భటుఁడు తల్లతాంగి విభుని శవ
మంతఁ దత్సమాధియందుఁ దీసి
కొంచుఁబోయి యల్లకొఱఁత నెక్కించెను
రాజుచేత బాధ రాని పనికి.

క॥ అన్యోన్యముగా మఱి యా-కన్యామణి భటుని గూడి కామ్యార్థముల
య్యన్యాయమతిని గుడుచుచు-నన్యాలోచనలులేక హర్షత నుండెన్.

క॥ ఈ లీలలు విన్నావట-రా లోకులచర్యలెల్ల రాఁ గన్నావో,
యీలాగున నరకాగ్నికిఁ-బాలౌటకుఁ గాదె యిట్టి పను లొనరింపన్,

తే॥ ఈ ప్రపంచపుమాయలు నెంతవాని
నైన నాత్మను మఱపించి యలమటింపఁ
జేసి దైవము నెఱుఁగ వీక్షింపనీక
పాపిగ నొనర్చి నరకాగ్నిఁ బడఁగఁ ద్రోయు.

# ఆరవ వ్యత్యాసము.

## మనుష్యుని యొక్క యునికి.

ప్రపంచ సుఖభోగములు అనిత్య సుఖములని కనినపుడే, అటువంటి చెల్వపు మేలులను అనుభవించెడు మనుష్యుని యొక్క బగిసి యేమని ఎరుగవలసియున్నది. ఒక మూరెడు చిన్న శరీరము ధరించి హీన బలములో వర్ధిల్లి మృగమువలెనే జీవించి పురుగులకు గూడై జల మలముల గుంటయి, చంచల రూపమై, అలమట్లకు గురియై, ద్రోవ పొయ్యెడువాడై, భయపడెడువాడై, అనర్థమునకు సమర్థుండై, సకల నంజుడు రోగములు, చలి, మల జలము లూరెడి శరీరమును కలవాడై, మరణమునకు గులామై కాలము పుచ్చెడువాడే మనుష్యుడని యెరుగుదువుగాక.

ఈ కాని శరీరము యొక్క అల్ప సుఖములు ముగిసెడు గతి యేమనగ, ఇది గో సౌందర్యములో కొన్నాళ్లు నిగనిగలాడుచున్నాడు. రాగారాగా అవలక్షణరూపమై, ముఖము చుక్కిళ్లు బారి, కన్నులు గుంటలుపడి, పండ్లూడి బోసి నోరై, వీపు వంగి గూనియై, తల వణకునదై బట్టతలయై, నోట గళ్లలును, ముక్కున చీమిడియు యూరునదై చెవిటి వాడై చేతులు కాళ్లు అదరి నడుము వంకబోయి పైనఅంతయు బొరుగు లేచిన వాడై, అరువు దప్పినవాడై, మనస్సున చంచలుడై, సులభముగా చెడిపోవు వాడై యుండువాడే మనుష్యుడు అని ఎరుగుదువుగాక. వీని బగిసిని విచారించిన ముందరయ్యలు చాటించినదేమనగా; మనుష్యుడు గాంభీర్యమైన బురదయనియు, పిట్టగట్టి పెరిగెడి దూళియనియు కమ్ముకొనియుండు బూడిదయనియు క్షణములో దాటిపొయ్యెడు ప్రకాశమనియు తోడనే వాడిపొయ్యెడు పుష్పమనియు ఏకాలము నిలువని తాపస్వభావమనియు చాటించిరి. ఓరి నీచమనుష్యా! ఎంటివో నీశరీరము యొక్క అందము! ఇట్టి దుర్గంధ శరీరమునకు గానో చెడని

యాత్మను నరకమున త్రోసెదవు? ఈ కంపు శరీరముకోసరమో నిత్యానందపదవిని చెరచుకొనెదవు?

నీ శరీరమునకు నీ వికారములు కలిగియుండుటగాకుండ గుణమునకును నానా దుష్టతనములు కలవని వినుము. మనుష్యుడు కోపగించుకొనుచున్నాడు, ఆలోచించుచున్నాడు, నిందించుచున్నాడు చెరచుచున్నాడు, చెరచుటకును వంచించుటకును దాపరికమును చెప్పుచున్నాడు, అనీతి అన్యాయములను, దొంగతనములను, పిల్లిశూన్యములు చేయుటయు, విషాదులు త్రావుటయు, హత్య కామలీలలు దుష్టస్నేహము పట్టు మాయజిత్తులు టక్కుపిక్కులు మోస ఘాతుకములు, అల్పాహంకార గర్వపు హెచ్చులు, ఇవి మొదలగు దుర్గుణములు కలిగి వానిని అనుసరించుచున్నాడు. అదెట్లననగ, రోమాపురి చక్రవర్తియగు నెరోయనువాడు వ్యర్థ సంతోషము నిమిత్తమై కన్నతల్లిని చంపివేసెను. రోమాపురమునకు అగ్ని అంటించుమని చెప్పి కాలి మండుచుండు సమయమున తాను ఉన్నతమైన గోపురముపై కూర్చుండుకొని సంగీతపుపాటలు పాడ నేర్చుకొనుచుండెను. దుష్టహేరోదురాజు వైరాగ్యముచే ననేక పావనులగు పసిబిడ్డలను కొలపాతకము చేయించెను.

అస్సూయేరుడను రాజుయొక్క మంత్రి ఆమాననువాడు తాను వచ్చుచు పోవుచుండెడు రాజు వాకిట గాచియుండెడు వారలలో మర్దొకేయుడను వాడు మాత్రము తన్ను చూచి లేవకయు, ఆచారము చేయకయు యుండినది చూచి; సహింపజాలక వానిని చంప తూకుమ్రానిలో వేయనుండెడు సమయమున; రాజు ఈ సమాచారము విని, ఆ చేటు తలంచిన మంత్రినే వాడేర్పరిచిన మ్రానిలో ఉరిదీయుడని ఆజ్ఞ యిచ్చెను.

ఇదియునుగాక, అన్యాయము నిండిన కలాపము చేసి తన్ను కన్న తండ్రియని చూడక తండ్రిగారియొక్క రాజ్యమును తాను పరిపాలనము చేయవలెనని దండెత్తి తన పితయును రాజును అయినవానిని రాజధానిపట్టణమెల్ల దరిమి తానే రాజని కొన్నాళ్లు నేలుచుండుపట్ల వేరే దండు తనమీద వచ్చునదికని దానిని జయింపబోయినచోట దండు విరిగి పారిపోవునపుడు ఒక్క మ్రానికొమ్మలో తల వెండ్రుకలు తగులుకొని వ్రేలాడు సమయమున మూడు ఈటెపోటులతో అబలుడై చనినవాడు దావీదు రాజుయొక్క సౌందర్యముగల, చెల్వపు కుమారుడు అబ్సలోముడేకదా. కోపముచే వెంటెస్లాసను రాజు కత్తిదూసి యొకనిని నరుకుటకై పరుగెత్తి రాగా వాడా చేటును

తప్పించుకొని పారిపోయినది రాజుచూచి కోపపు పిచ్చి రేగి మిక్కుటమై తానే పడి చచ్చిపోయెను.

ఓరీ మనుజుడా! వింటివా, ఇవ్విధమున దుర్గుణములు మనుష్యులయందూరి వెళ్లుదు చెరచుటను అనుదినము చూచుచు వచ్చుచుండి, ఇటువంటి హీనమనుష్యుల స్నేహమును బాంధవ్యమును సహాయమును స్థిరమైన ఆస్పదమని నమ్మి పరమకర్తను మరచి ఆయనయొక్క సహాయమునైను ఇష్టప్రసాదమును నిత్యానంద రాజ్యమును వెతకక యనేకులు నానా దుర్మార్గములలో తిరిగెదరు! ఈ అనిత్యలోకపు చెల్వములను నమ్మికొని తమయొక్క నిత్య సౌందర్యముగల ఆత్మలను చెరచి ఆరని అగ్నినరకములో త్రోయుచున్నారు. అయినను ఈలోకముయొక్క అల్ప సుఖమును, మగ్గిపోయ్యెడు శరీర సౌందర్యమును, నాశనమయ్యెడు చెల్వమును, నాలుగునాళ్లుమాత్రమే నిలుచునని ఎరుగవా? ఓరి అల్పమనుజుడా! మూడు నాళ్లలో చూడగూడని కంపుబట్టి వికారమయ్యెడు ఈ శరీరముకొరకు నీయాత్మను నరకమున త్రోయుటది న్యాయమా? ఇదిగో దుర్గంధ శరీరమును నమ్మి పుణ్య మార్గములో నడుచుటకు నిది చాలకపోయిన నింకపై వినుము.

ఆదేమనగా, ఒక మనుష్యుడు ఒకనాడు వనమున అవసరముగా పోవుచుండునపుడు, ఒక దుష్టమృగము ఎదురుపడి, వానిని వెరపించునదిచూచి భయపడి పరుగెత్తెడు సమయమున నొక గుంటలో దొర్లుకొని పడెను. అట్టి వేళను ఆ గుంటలో నొక దరిన బలిసిన పెద్దమ్రాను కొమ్మలలో చిక్కుకొన్నందున అతడు గుంట అడుగున పడక కొమ్మలను పట్టుకొని పైకినెక్కి యొక కొమ్మమీద కూర్చుండుకొని క్రిందికి చూడగా తరుముక వచ్చిన దుష్టమృగము వానిని పట్టి తినుటకై మ్రాను క్రిందనే పొంచుకొని యుండి అతడు ఎప్పుడు పడునో యని యెదురు చూచుచుండెను. కొమ్మలపైనున్నవాడు మ్రాని అడుగున చూడగా, అందులో నల్లయెలుక, తెల్ల యెలుక లనెడు రెండు ఎలుకలు ఆమ్రాని వేరులు తెగ గొరుకుచుండునది చూచి అయ్యో! యీమ్రాను కొంతసేపటికి పడునుగదా యనుకొని అందుండి తప్పించుకొని పోవుటకై మ్రాని యందున గుబురుగానున్న పొదమీదికి నాలుగు పాములు ఆ పొదమీద నుండుకొని వీడు రాకుండ బుస్సుమని బుసపెట్టుచు తన్ను కరవ వచ్చునదిచూచి కొన కొమ్మలకైన నెక్కి పోదమని తిరుగ చెట్టెక్కెడు సమయమున ఒక కొమ్మలో నొక అకునుండి

కొంచెము తేనె పడునది చూచెను. ఆ తేనెను నోటబెట్టుకొనగా బహు తీపుగా నున్నందున బొట్టు బొట్టుగా పడెడు ఆ తేనెను చేతితో పట్టుకొని నాకుకొను చుండెనేగాని తాను పడెడు అవస్థను తప్పించుకొనవలెనని పైబుద్ధి మరచి యుండెను. వాడు పరాకై యున్నట్టే అంతలో సదరు రెండెలుకలు వ్రాని వే ళ్లన్నియు తెగకొరికినందువల్ల వ్రాను పెళ పెళ విరిగి పడగానే వీడు ఆ కష్ట గుంటలో దొర్లుకొని పడెను. పడినతో డనే అక్కడ పొంచుకొనియున్న దు ష్టమృగమునకు మేతయై నిర్భాగ్యుడై చచ్చెను.

ఓరీ శరీర పోషకుడా! దీని అర్థము తె లిసికొంటివా? ఇదిగో, ఆ బుద్ధిలేని వాని వలెనే అనేకులు భూలోకమున నడచెద రు. అదేలాగనగ, మనుష్యులు తల్లిగర్భ మునుండి ఉద్భవించినతోడనే దుర్మర ణము వెన్నంటుకొని వెరపించుచున్నది. అందులోనుండి తప్పించుకొని లోకమున జన్మించినట్టయిన జీవమనెడు వ్రాని యొక్క ఆధారమున మనుష్యుడు కొ న్నాళ్లు ఈ ప్రపంచమున నుండునపుడు, పుట్టిన శరీరములోనే విషముగల సర్ప ములవలె నుండెడు నాలుగు భూతములు ఒకటికొకటి విరోధించి శరీరమును చెర చి నాశనముచేయ యత్నించుచు ప్రతి దినము మనుష్యులకు విఘ్నముచేసికొని వచ్చుచున్నవి. నల్లయెలుక, తెల్లయెలు కలనెడు రాత్రిపగలు ఒకటై దినమై, ది నములన్నియుచేరి మాసమై, మాసము లన్నియు చేరి వర్షములై, దినములును వర్షములును ఈలాగు గడచి పోవగా మనుష్యునియొక్క ఆయుస్సు కుంగిపో వుచున్నది. కడసారి మరణమువచ్చి నే లపడిన వెనుక, దుష్ట మృగములవలె నుండెడు పిశాచులు వానిని పట్టి నరక పుగుంటకు నీడ్చుకపోదమని పొంచు కొని యున్నవి. ఓరీ పాపాత్ముడా, ఈ లాగు నిన్ను జుట్టుకొని యుండెడు మో సకరమగు చేట్లను మరచి, అవి తప్పిం చుకొను మార్గమగు పరమ పదవి త్రోవ విచారించక ఒక బొట్టు తేనెవలె నుండె డు ప్రపంచ సుఖ భోగములకు నాశప డుచున్నావు. ఈ అల్పపు చెల్వములు ముగియుటయు, జీవము తరుగుటయు, మరణము వచ్చుటయు, తలంచక నీ క పు శరీర అందమును మోసపుచ్చెడి యీ లోక సుఖభోగములను నమ్మి తిరిగితివా అదిగో తేనెబొట్టు కాశించి దుష్ట మృ గములచే చిక్కినవానివలెనే, నీవును లోక చెల్వభాగ్యములలో సుఖించుసమ యమున దిఢీలని ప్రాణము తెగి మరణ మైన తోడనే నరక పాతాళమందుండ పిశాచులచే తగులుబడి, యెన్న సెన్న

ట్టికి దెబ్బలు తన్నులు తినుటకును, నిత్య నరకమున తీరని అగ్ని బాధలనుభవింప ను పోదువు. నిత్య పరమ పదవి నొంద మనస్సుగలవాడు ఇవ్విధమున ఈలోక సుఖభోగములను నమ్మినట్టయిన, ఇట్టి మోసము వచ్చునని గ్రహించి మరణము వచ్చుటకు మునుపే వానిని వర్జించి నిత్యజీవమగు చెడని మోక్షభాగ్యమును పాలించెడు పరమకర్తను మాత్రము సేవించి, స్తుతించి నెరనమ్మి వారు కట్టడజేసిన వేదకల్పనల మేరగా మరణపర్యంతము నడువవలెనని యెరుగుదువుగాక.

# ఆరవ వ్యత్యాసము.

## మనుష్యని యొక్క యునికి.

వ॥ అవధరింపుము, తత్పరమానంద గురువులు నిట్లనియె: నేతత్ప్రపంచ మాయా జాలంబు లాత్మను మఱపించి దైవంబు నెఱుంగనీక పరమగతిమార్గంబుఁ దప్పించి, దురిత దుర్మార్గంబునం జొప్పడఁజేసి, యనంతరంబున ననంతంబైన నరకాగ్ని సముద్రంబులోఁ బడఁ ద్రోచెడి విధంబులను గురుబోధవల్ల నెఱింగి బుద్ధిమంతులయిన మానవులు నిట్టి మాయాప్రపంచంబు నమ్మక తెప్పున మోక్షరాజ్యంబునకై సన్మార్గంబుఁ జొచ్చి తరియించెద, రది యుచితంబు గావున, తదనిత్య లోకచర్యానుసారంబగు మేలులనుభవించుటకు నరుండు నిహశరీరంబునకు నింత యిచ్ఛావిహారమార్గంబుఁ జొరవలదది యెట్లన్న వినుము.

సీ॥ తొమ్మిది తూటుల తోలు మూసిన కుండ-హీనబలోన్నతి నెనసి యుండ,
మలమూత్రముల కెల్ల మాటుగాఁ దగుగుంట-మాంసఖండములెల్ల మనెడి పెంట,
సకల రోగములకు నికటమైన గృహంబు-లంపటులకు నెల్ల లక్షణంబు,
రోతయా శ్లేష్మాది రుధిరంబునకు బావి-చీవాట్ల కెల్లను జెడు తలంపు,
తే॥ ఇట్టి యొహ్యమౌ దేహంబు నేమిచెప్ప
వచ్చును, మఱి మరణమునకచ్చు ననఁగ,
నెచ్చరిక యేమి లేనట్టి పిచ్చిపిచ్చి

నరులకీ యసహ్యము మీఁద నాస పుట్టు.

క॥ కొన్నాళ్లు నుండుఁ బాలుఁడు-కొన్నాళ్లుం బడుచువాఁడు, కొన్నాళ్లకునున్
వన్నెల చిన్నెలఁ దిరుగఁగఁ,-గొన్నాళ్లకు వార్ధకమునఁ గూలును దుదరున్.

మ॥ మొగమున్ ముడుతలు పారి, లోచనయుగమ్మున్ గుంతలై, బొక్క నో
రగుఁ బండ్లూడి, శిరంబు దాఁ వణఁకు, మధ్యంబెంతో వంపొందఁగాఁ,
దగ వీపూఁగి, కరాంఘ్రులున్ వణఁకు, వాతం గళ్లలత్యంతమై,
నెగడ, న్మొక్కనఁ గాలు చీమిడియుఁ దన్నిర్భాగ్యమా ముప్పునన్.

తే॥ అట్టి వార్ధకమున నేమి యాడవచ్చు
నింటిపై నొంటిపై నాశయిచ్చు మర్లు
విడువఁ జాలక, దైవమున్ వెదకలేక
మీఁద సంసారసాగర మీఁదఁ గోరు.

మ॥ నరుఁడా యిప్పుడు వింటివో యరయఁగా నానా యశుద్ధంబు లీ
తఱి దుర్గంధశరీరసౌఖ్యమున కాత్మన్ ఘోరనిర్బంధమా
నరకాగ్నిన్ బడఁగాఁ దలంచి, పరమానందంబు పొందొల్లకే
దురితంబెల్లను బొందఁగోరు టది యా దుర్మార్గ దుర్వృత్తియున్.

వ॥ అది యెట్లనఁగ:

చ॥ మఱియొక రాయఁ డిట్లు వినుమా తన తల్లిని నిర్దయన్ వృథా
హరషము చే వధించె దురహంకృతి నీగుచు, రాజధాని వీ
టఁ రయమునన్ హుతాశనమురాశిదహింపఁగఁ జేసి యంతటం
దరికొని, వీఁడు మండునెడ దాను మహోన్నత సౌధ మెక్కియున్,

క॥ గానంబు వాడ నేర్చుచుఁ-గాన ముదంబున వసించె ఘన సౌధముపై,
మానవపతి కొన్నాళ్లకుఁ-దా నేగెను ఘోర నరకదావానలమున్.

క॥ మానవుఁడ వింటివటరా-మానవపతి దుర్గుణాల మఱియింకొకటిన్
మానుగ విను మనియెదనీ-మానసమున నాటఁ గాంతు మన దెట్లనినన్.

సీ॥ ఆమను మంత్రి యహంకార చిత్తుండై,-తను నేలుచున్నట్టి ధరణి విభుని
యొద్దనుండెడి సేవకోత్తముఁడుం తన్నుఁ-గని యొక్కనాఁడు వందనము చేయ
మఱచి పోయినప్పుడు, మఱి వాని జెడఁగొట్టి-వాని కుటుంబంబులోను గూడఁ
గొఱఁత వేయించఁగఁ గోపమునఁ దలంచు-సమయాన, నా మహా జనవిభుండు

తే॥ విని మనంబున సరిపోక వెనుకదీయ
కా పని తలంచినట్టి దుర్గ్లశము గల్గు
మంత్రి నేర్పరచినయట్టి మ్రానిలోన
వేసి యురదీయుమని యాజ్ఞ వెంట నిచ్చె.

క॥ ఇదిగాక యింక వినరా-పదపడి చెప్పెదను భూమిభర్తల చర్యల్
తదఘాత్ముల దుర్గుణముల-పదవుల, మానవుఁడ వింతపడంగాఁ నీకున్

సీ॥ పూర్వమం దొక రాజపుంగవుండను వాని-కొడుకులం దొకఁడు తుందుడుకువాఁడు
న్యాయమెఱుఁగక యన్యాయ దుర్మార్గుఁడై-కన్నతండ్రి యనక యా నరాధ
ముండును నిజజనకుం డేలునట్టి రా-జ్యంబెల్లఁ దా నేల నాక్రమింపఁ
దలపోసి పరధరాధవుల సైన్యంబులఁ-గూర్చియుఁ జనుదెంచి, కుటిలుఁ డనెడు

తే॥ నాఖ్యఁజెన్నొందు, దండెత్తె నబ్బువాఁడఁ,
దెగిన జయమును బొంది ధాత్రీశుఁ డపుడు
పాఱిపోయిన, నా రాకుమారుఁడంత
బాయక ముదాన రాజ్యంబు చేయుచుండె.

తే॥ వీరుఁడై తండ్రి నిత్తఱి వెడలఁగొట్టి
రాకుమారుఁడు సాకల్యరాజ్య మేలు
చుండెనయ్యెడ నొక పరక్షోణివిభుఁడు
వాని మీఁదికి దండెత్తి వచ్చె ననికి.

ఉ॥ అప్పరరాజుతోడ ననియందు జయింపఁగలేక వాఁడు దా
నప్పుడు నోడి వెళ్లఁగను నాతురతన్వడిమీఱ నేగుచో,
దెప్పున నొక్క మ్రానునను తీరని చిక్కులలో శిరోజముల్
గుప్పునఁ జిక్కఁబట్టుకొని గొబ్బున వెళ్లఁగ రాక యుండినన్,

క॥ ఆ సమయంబున నీ రిలు-తో సూటిగఁ బొడిచి విమతిదుష్టనృపతి సే
నా సంఘాతములెల్లను-వేసారక చంపిరిట్లు విపులాపు సుతున్.

మ॥ జనకద్రోహి యనంగ రాసుతునికిన్ జావొందుటల్ వింటివో?
మనుజాధీశుల చర్యలెల్ల నివిరా, మర్త్యుల్ మహామూఢులై
కన నిక్కువడి దుర్గుణాల నరకాగాధానలాంబోధిలోఁ
బడ సంపాదన చేసికొందు రఘమే కాంక్షించి యో మర్త్యుఁడా.

క॥ ఇటువంటి హీనమనుజుల-కుటిలత్వము లెఱుఁగలేక గొబ్బునఁ బొందొం
దుట బాంధవ్యము చేయుట-కిటు దగదుర, పరమకర్త నెనయఁగవలెరా.

క॥ కొంచక దుర్గుణములచే-నంచిత లోకప్రసుఖాల నందినపిదపన్
వంచనలేక నరకము ల-భించునురా యాత్మకవును బెల్లగు వెతలున్.

తే॥ మూఁడు దినముల కరయఁగా ముగిసి రాలి
పోయెడి శరీరమున కింక భోగమేల?
యనుచు సుజ్ఞానులై మోక్షమబ్బుటకును
గోరుచును జేసుగురునాథు జేరవలయు

వ॥ అది యట్లుండనిమ్ము.

సీ॥ ఒక మర్త్యుఁ డతివేగ మకళంకమున నేగ-మారాటవీభూమిమధ్యము నొక
దుష్టమృగంబు సుద్ధురత నేతెంచుట-నీక్షించి వాఁడును నెఱిభయమున
బరువెత్తుచో, నొక్క పల్లంబుదరి నున్న-బలు ధరణీజంబుపైకి నెక్క,
దృష్టించి చూచిన దుష్టమృగంబును-జెట్టు క్రిందికి వచ్చి చేరియుండెఁ.

తే॥ దఱుముకొన వచ్చినట్టి యా దౌష్ట్య మృగ భ
యమున భూజంబు దిగకుండె నంతవాఁడు
మూషకద్వయమును మాను మొదలు తెగఁగొ
ఱుకుట గని భయమాత్మని రూఢిఁ జెందె.

క॥ ఈలాగున దరువుండగ-నాలస్యంబేల పడు నటంచును, మదిలో
జాలఁగ భీతిల్లుచు వాఁ-డేలాగునఁబోదు నంచు నేడ్చుచుఁ గడిమిన్.

శా॥ అమ్మానంచున జొంపమైన పాదపైకెనన్ వడిన్ దూఁకినన్
నెమ్మానంచుఁ దలంచి చూచిన, జతుర్నీలాహు లందుండఁగా
నమ్మాయంచు భయంబునుం గదురగా హాహా యటంచున్ విచా
రమ్మున్ దుఃఖమునంది వాఁడప్పుడు పానాహారము ల్మానిష్ఠియై.

వ॥ ఇటు లా మానవుం డెటు పోయిన నొక్కొక చోట పొసఁగుటకు విస్మయాకు
లితచిత్తుండై తానిమ్మది యమ్మహీరుహాగ్ర భాగంబునందు శాఖలకుం జనుచు
న్నయెడఁ దన్మధ్యంబున నొక్క పర్ణంబుపయిఁ గందివ్మాత్రంబు మధు వుం
డెడిదిం గనుంగొని, యది యొక్కొక బొట్టు పడఁ దా నా బొట్లనెల్లఁ గైకొని
నాకుచు జిహ్వాచాపల్యంబునఁ దగు తన్మాధుర్యంబువలన నెద్దియు మఱ

చి స్వవ్యథానివారణ మార్గం బేలాగని తెలియఁబోక పరాకయి యుండెనంత.

తే॥ పంచపాది॥ మూషకద్వయము భూజమూలనుంతఁ
దెగఁ గొఱికి వేసినంతటఁ దెప్పున త్రు
మారుహము పెళ పెళ మని విరిగి పడఁగ
నపుడు వాఁడును భూమిపై నట్టె బడిన
దుష్టమృగము నరుని బట్టి తునిమెనపుడు

క॥ తా నెంత కళేబరమును-మానుగఁ బోషింపనేమి, మనుటది యగునా,
మానవుఁడ వింటివా, యా-మానవునివలెను మనీష మానుదు రఘులున్.

వ॥ అది యెట్లన్న వినుము.

సీ॥ మాతృగర్భమునుండి మఱియుద్భవించిన-తోడనే మనుజునిఁ గూడి పట్టు
కొనగ దుష్టమృగంబు నవెట్టి దుర్మరణంబు-వెఱపించుచుండును వేగముగను,
జీవనమను భ్రమాను మెచ్చగ నాధార-మగును నరుఁడు లోకమందుండఁ,
జనన మందిన యట్టి తనునందు నాలుగు-విషసర్పంబులవలె వెడలి నాల్గు

తే॥ భూతములు నొక్కొకటికి నెపుడును వైర
మగుచును శరీరమును జెఱుపఁగ నిలువక
దిన దినము విఘ్నమొనరించుకొనుచునుండ,
జీవన మనెడు భ్రమాను నశించి పోవుఁ.

క॥ మనుజుఁడు తెలిసి చెరి యా-దినములు నది బ్రదుకు రాత్రిదివము లనెడి రెం
డును మూషకములు కాగా,-కనుమా వినుమా యికెందు కనుమానంబా.

వ॥ ఆ జీవన మనెడు భుజంబు విఱిగి నేలఁ బడఁ జేయునదేమనఁగ: రాత్రిపగల
నెడు ఏతన్మూషకద్వయంబు నీకీభావంబై తదాయురుర్విజంబున వత్సరంబుల నె
డు మూలంబులం దెగఁగొఱుకుచునుండిన, మానవుండు ప్రపంచమాయా జా
ల మర్మకర్మా నిత్య సంపద్వైభవ లీలాచర్యలనెడి మధువు నాకుచు జిహ్వే
చ్ఛాసాఫల్యంబునఁ దగు తన్మాధుర్యంబువలన నెద్దియు మఱచి యనంతరత
బాగతంబనొక్కెడి స్వవ్యథానిర్బంధ దృఢంబులకు నైన భయముఁజెంది తరణో
పాయ మార్గం బెఱుంగనేరక పరాకయ్యుండునెడ,

తే॥ తద్దివారాత్ర మూషకద్వయము నరగ,
నా యురుర్వీరుహాబ్ద మనారతముగఁ

దెగc గొటికి వేయునంత, ధాత్రీరుహంబు
పడినc మనుజుండు దాం గ్రిందc బడునుగాక.

క॥ అంతట జాగొందక దృఢ-మెంతన దుర్మరణదుష్టమృగము జవానన్
బంతముగ వచ్చి నరకపు-గుంతకు నీడ్వcగను బట్టుకొని చను నదియున్.

తే॥ అపుడు నరకంబునకుc దీసినంత నరునిc
బట్టుకొని చుట్టుకొని తిట్టి కొట్టు నా పి
శాచు లనియెడి గాఢ భీషణపు దుష్ట
మృగముల యగణితంబు నేమి యనుదునిక

తరళ॥ ఇటులు కష్టపుమేని దూఱుచు నీ ప్రపంచపు మాయలం
గుటిల సౌఖ్యములెల్ల నమ్మక గొబ్బునన్ గురురాయనిన్
ఘటనగా బహు సేవ చేసినc గల్గు మోక్షము నొప్పcగా
నిటుల భక్తినిc గర్త దేవుని నీవు కొల్వcగc జెప్పితిన్

క॥ కాలము వెళ్లకమును దగు-కాలముగద యమల బుద్ధి గలిగి బిఱాన్
మేలుగc గైవల్యపదం-బేలcగ గురుc జేరవలయు నిహమున మనుజుల్.

# ఏడవ వ్యత్యాసము

## మరణము యొక్క విపరీతము.

నిబ్బరముగ బారెడు గుఱ్ఱముకన్న అతివేగముతో నురికెడు కాలములో జీవించెడు మనుష్యుడు బ్రతికెడు కాలమంతయు చూచినట్టయిన నొక క్షణమాత్రమే జీవించుచున్నాడని చెప్పబడుచున్నది. అదేలాగనగ, ఇదిగో వర్తమాన కాలములో చేయవలసిన క్రియలన్నియు చేసినతోడనే, గతించిన కాలమైపోయెను, పోయిన కాలము తిరుగ రాదు, మరియు వచ్చెడు కాలములో చేయవలసిన క్రియలను చేయ, ఉసురుతో నుందునో లేదో సందేహము కదా? అందువల్లనే లోకములో జీవించెడు మనుష్యుడు ఒక క్షణము మాత్రమే బ్రతుకునని చెప్పవలెనుగాని మరియొకటి కాదు. ఈ కొంచెపు కాలమును ప్రపంచ సుఖభోగములలో సెలవుచేసిన యెడల పరమగతి పొంద పుణ్య క్రియలచేయ కాలమెక్క

ళ? ఓరీ మనుష్యుడా! ఈలాగు లోకము న జీవించెడు మనుష్యుడు తాను జీవించు నాళ్లన్నియు ఒక క్షణముగా నుండగా, నీ లెక్కలో నేనాయేండ్లు అని గణించు కొనినను, ఒక క్షణములోనే నీవు మరణ ము పొందుదువు. ఈ కొంచెపు కాలము లో మరణము పొందక మునుపే పుణ్య మార్గము వెతకినట్టయిన నిత్యానంద మోక్షరాజ్యమున సుఖముగ నుందువు. ప్రపంచమును నమ్మి పాపపు త్రోవలో నడచితివేని చచ్చినతోడనే నరక పా తాళమున దొర్లుకొని పడుదువు.

అయినను మరణమును తప్పించుకొ నుదునని నిశ్చయముగా చెప్పగలవాడె వడు? ఎవడునులేడు. ఒక దినము వెనుకు ముందుగా చచ్చునది దిట్టమైనను, తనకు నేడో రేపో యెప్పుడో యెవ్వారెరుగ రు. ఇట్లుండగా మరణము రాదన్నట్టుగా క్షణకాలము మాత్రము జీవించెడు మను ష్యుడు దీర్ఘాయుష్సుగల వానివలెనే పుణ్యపు త్రోవను మరచి మరణమునకు కొరవక తిరిగి పాపమేగాని పుణ్యమును చేయనోపడు. అప్పుడు దిఢీలున దుర్మ రణము వచ్చి వాడు జీవించిన కాలమంత యు ఒక క్షణమువలె గతించి పోయెనని యు, ఆ క్షణకాలములో ననిత్యమైన ప్ర పంచ సుఖములను నమ్మినందుకు, ఇది గో నిత్య నరకమే ప్రాప్తించెననియు, ఈ లోకమున పాప మార్గమున జీవించిన కాలమంత పడిన ప్రయాసయంతయు వ్యర్థమే ననియు తెలియజేయును.

ఓరి మనుష్యుడా! సాలెపురుగు తన కు మేపైయుండెడి రోతైన యీగలను పట్టుటకు తన శరీరములో నుండెడి శక్తి ని నూలు నూలుగా త్రోసి, యీగలు పారాడెడు త్రోవలో నొక వలగా నల్లి బహు ప్రయాసతో తిరిగి యీగలు త గులుకొనునని పొంచి కాంచి యుండగా; ఇల్లూడ్చెడు స్త్రీ వచ్చి సాలెపురుగు యొక్క వలనుకని పొరకతో కొట్టియూ డ్చుక పోవును. అదిగో నేసెడి పురుగు వలను చేయుటకు సెలవు చేసిన కాల మును, పారాడిన పారాటమును, దిగిన దిగడమును, ఎక్కిన చురుకును, దాటిన దాట్లును, చుట్టిన చుట్లును ఒక్క పొరక వేటున వ్యర్థమై పోయెనని కనుక్కొ నెనుకదా! అలాగే నీవును ప్రపంచపు చెల్వముల ననుభవించవలెనని ప్రయా సపడుచు, కాలము జరిపి, ప్రాణమిచ్చి; లోకమున గొప్పవాడనగుదును, ఏలు దును, జయించుదును, మహారాజై సుఖ మున నుందును, అందుకై దండుగట్టి ద్ర వ్యములన్ని సంపాదించుదును, సకల సుఖభోగములన్ని అనుభవించుదును అ నుకొనుచు తరుణములో సుఖమును, ద్ర వ్యమును ననుభవించక ముందరనే, దుర్మ

రణము దిఢీలున వచ్చి యేమార్చి తలంచిన నానావిధములగు తలంపులను, దండించిన దండింపులను తడకట్టి నాశనము చేసి, నీవు లోకపు చెల్వములమీద దురాశలచే చేసిన నానా పాపములకు శిక్షగా నిన్ను నరకములో త్రొక్కివేయును.

ఓరీ పాపాత్ముడా, ఇందుకు నీకు తార్కాణము కావలసినట్లయిన నారంభించిన కార్యము ముగింపక చచ్చినవారి కథలను వినుము. ఓలోఫెర్నేసుడను దళకర్త బెత్తూలియా యను పట్టణము పట్టుకొని జయించి దానిని ఏలవలెనని బ్రహ్మాండమైన దండునుగూర్చి, పట్టణమునకు ముట్టడివేసి దానిని పట్టుదునని యుండు సమయమున, ఆ పట్టణములో నుండిన ఒక పుణ్యస్త్రీ తానున్న యూరు పరుని చేతిలో పట్టుబడరాదనియు, ఆ దళకర్తను నరకివేయుదుననియు తెగించి, పట్టణము విడిచి వెళ్లి, దళకర్త దగ్గరకు వచ్చి, లలిత వార్తలచే వానిని కుస్తరించి, యర్ధరాత్రిపొద్దున అందరును వాడును నిద్రపోయెడు సమయమున వాని తలనరకి యెవ్వరికిని కనబడకుండ పట్టణమునకు వచ్చెను. ప్రొద్దుననే వాని దళమంతయు తమ కర్త నిర్భాగ్యముగా చచ్చినది ఎరిగినతోడనే బుద్ధి కలంగి, బెదరి తత్తరపడి, చెదరి, పారిపోయి, అపజయము పొందిరి. అయ్యో పాపాత్ముడా, ఈలాగుకదా, నీ వెన్నంటి యుండెడు దుర్మరణము నీవు తలంచని కాలమునను, నీవు కట్టు ఇల్లు ముగియక ముందరను, నీవు పెట్టిన పంటను అనుభవించక ముందరను, తలంచిన కార్యము తీరక ముందరను, ఇచ్ఛించినది అనుభవించక ముందరనే, సంపాదించిన రూకలు వెచ్చముచేయక ముందరను, నీ జీవమును ఊడ్చుక పోవునది ఎరుగవా?

అంతియోక్కుడను పరాక్రమశాలి, తన పరాక్రమముచే ననేక పట్టణములను జయించి, తన వశము చేసికొని, ఒడ్డోలముగా అట్టహాసముతో, చరించుచు, కట్టిన సీమలును, ఏలెడు పట్టణములును, చాలవని, ఇంకను ననేక రాజ్యములను గట్టి యేలవలెనని ఆలోచన చేయుచుండునపుడు వాని శరీరమంతయు పురుగులు బట్టి పుచ్చి చచ్చెను. ఓరీ పాపీ కంటివో! ఈలాగు తలంచిన కార్యము ముగింపక ముందరనే మనుష్యులకు మరణము వచ్చెడు విధము? అట్లు మరణకాలము ఎప్పుడు అని ఎవరు ఎరుగుదురు? మరణమునకు ముందరనే నీ పాపపు ద్రోవను విడిచి పరమగతి పొంద పుణ్యములను చేయవలెను. ఈ అబద్ధ ప్రపంచపు మేలులను నీ శరీరారోగ్యమును నమ్మి తిరిగితివంటే, ఆత్మకు వచ్చెడు భయంకరపు చేటు వినుము.

ఇదిగో ఒక ధనాఢ్యుఁడు అనేక ద్రవ్యములను సంపాదించిన వెనుక వానిని సుఖముగా ననుభవింప వచ్చునని తలంచుకొని యుండునపుడు, మహా కఠినమైన వ్యాధివచ్చి మంచమున పడి సంపాదించిన ద్రవ్యములను అనుభవింపక ముందరానే మరణము తన్ను గుంటకు నీడ్చుకొని పోవ తయారయ్యెనని కని తన ద్రవ్యము లన్నిటిని దెచ్చి తన ముందర బెట్టించుకొని వానిని జూచి, నా ద్రవ్యమా, మిమ్ము విడిచి పొయ్యెదననెడు వ్యసనమింతంతకాదు; ఇదిగో యీ సమయమున ఒదవుదురని కదా మిమ్ము సంపాదించితిని, మరణమా, నా ప్రాణమును కొంచుకపోవద్దు; నా ప్రాణమా, యీ ద్రవ్యమంత నీకు గదా సంపాదించితిని. వీనిని అనుభవింపక ముందరనే నన్ను విడిచి పోవుదువా? దుర్మరణమును తడగట్టుటకు తెగువ జేయలేవా? ఈ ద్రవ్యము లన్నిటిని నీకు సంభావనగా ఇచ్చెదనని యొర్లుచుండగానే వ్యాధి పైబడి కుదించుకొని వచ్చునది గని జీవము విడుచునపుడు అనిన దేమనగా: నా జీవమా, నన్ను నీవు చెయి విడిచినప్పుడే నిన్ను దుష్ట పిశాచుల చేతిలో నొప్పగించెదననగా, చచ్చినవాని యాత్మను పిశాచులు నరక పాతాళమునకు ఈడ్చుకొని పోయెను.

అయ్యయ్యో, పాతకుఁడా, ప్రపంచపు చెల్వములు నమ్మియుండిన వానికి వచ్చిన మోసము వింటివి కదా? ఇకనైన ఈ యనిత్యపు చెల్వములను నమ్మక నీ మరణమునకు ముందరనే, నిత్యానంద మోక్షమునియ్య బలశాలులైన పరమకర్తను సేవించి, ఆయన చిత్తముచొప్పున నడువగలవాడవు. మరణము రాక మునుపే సుమార్గము వెతకక యుండుటెందుకు? దుర్గంధ నరకములో పడుట కొంచెమనియో, మరణమునకు ముందరనే పుణ్యమార్గము పట్టననుచున్నావు! జగడమందు ఆయుధము పట్టని బంటు జగడములో చచ్చునుగాని జయించువాఁడు కాఁడు. ఈలాగుననే మరణమునకు ముందు సుకృత మార్గములో నడువని వానికి పుణ్యమనెడి ఆయుధము దొరుకునా? దుష్ట పిశాచులతో ఎదిరించి జయము గొనవలసిన సమయమునకు వెతకని దేవకటాక్షము అప్పుడు తోడురాదు గనుక, దుష్టపిశాచులకు ఓడిపోయి వానిచే తగుపాటులబడి దుర్గంధాగ్ని నరకములో నిత్యకాలము పడబోదువనుట సిద్ధము.

ఈలాగునగదా అనిత్యలోకపు సౌఖ్యములను నమ్మియుండిన వాడొకఁడు, మరణ తరుణమువచ్చినపట్ల తన యీడేర్పునకు తగ్గ బుద్ధి విచారించక ముందటివలెనే ప్రపంచకార్యములలో మనస్సునుంచి తన దగ్గరనున్న వారలను జూచి,

ఆ సరకునకు వెల యేమి? బేరములో వచ్చెడు లాభమేమి? ధన ధాన్యములు పండిన విధమెట్లు? ఊరిలో సంగతులు ఏమియని యీ విధముగా నానా లోక కార్యములు విచారించుచుండెను. శరీరమును విడిచిపోవు ఆత్మకు ఏగతి వచ్చునో యని తలంచక యున్నపుడు ఆకస్మాత్తుగా మరణము వచ్చి అతని ఆత్మను నరక పాతాళమున పడవేసెను.

ఓ మతి చెడినవాడా, యీలాగున నరకమందు పడనో అబద్ధలోకపు చెల్వములను మాత్రము నమ్మి వెదకుచున్నావు. ఈలాగున పరమగతిని పోగొట్టుకొననో, సుమార్గము వెదకక యుండెదవు! ఇట్లు నీ యాత్మము నశించనో, మరణము కద్దని విచారించక, దీర్ఘాయుస్సు గలవానివలె, దాష్టీకము చేసికొని తిరిగెదవు! ఓరీ యభయస్థుడా, నెలలో చచ్చెదవని తెలిసినవాడు, ఈ లోకమును త్యజించి, తప్పక గతిచేరెడు మార్గములను లెస్స విచారించును గదా; నీకు నేడో రేపో, ఎన్నడో మరణము వచ్చునది ఎరుగవు గదా? కాబట్టి నీవు మరణమునకు వెరవక యున్నట్టయితే పరమగతిని పోగొట్టుకొని, ఆత్మను నరక పాతాళమున పడద్రోసికొనుదువు గదా? అట్లు పడక యుండునట్లు ఈ దినమే మరణము వచ్చునని తలంచి పరమ గతికయిన పుణ్యానుష్ఠానముల జేయ నెరుగుదువుగాక.

# ఏడవ వ్యత్యాసము.

## మరణము యొక్క విపరీతము.

వ॥ మఱియుఁ నమ్మహాత్ముండు బోధార్థిమానవులకు నిట్లనియె, ఇట్టి యస్థిరకాలంబులో మనుజుండు జీవించుట నొక్క నిమిషమాత్రం బని జెప్పందగుఁ గావున స్వకీయమరణావసరంబెపుడో, యది పరిజ్ఞానమునకుఁ గాదు, గనుక స్థిరకాలజీవిని యనెడుంబలె దురిత మాపాదించుకొనక పుణ్యసంపాదనమార్గంబు వెదకవలయు, నదియునుం గాక యనిత్యమైన ప్రపంచ చర్యల నమ్మినందువలన నరకమే లభించును. మఱి యట్లగాక యిది యస్థిరకాలంబని మనంబునఁ దలపోసి తాను జీవించుట నిమేషమాత్రం బని యెంచి తెప్పున జాగ్రత్వరుండై

పుణ్యమాపాదించెనేని, కేవల నిత్యానంద మోక్ష రాజ్యశుభగుండగు వినుము.

ఉ॥ మారుతవేగముం మఱియు మానస వేగము రీతిఁ గాలముం
బాఱఁగ నందులం బ్రతుకు పామరులెల్ల ననిత్యమైన మే
ల్గోరి ప్రపంచమాయలకు లోనయి కొంచెపుమేని నమ్మి ని
ష్కారణమౌ క్రియల్నడుపఁగా మఱి యేమి ఫలంబు మర్త్యుఁడా.

క॥ తా నెంత లోకచర్యల-పై నాస వహించి కష్టపడి యీ మేల్గన్
మానుగఁ గోరుచుఁ దిరిగిన-సైనాఁగ తదీయ లూత సామ్యముగాదే.

వ॥ అది యెట్లన్నను.

మ॥ తన యాహారముకైన యీఁగలకునై దానంతమైయందు నొం
దిన శక్తిన్ మఱి నూలు చేసికొను సర్విం లూత, యా యీఁగలుం
జను నాపద్ధతియందు నొక్క వలగాఁ జిక్కంగ నేర్పాటుచే
నొనరన్ వాటముగాఁగ నల్లి యటు పొంచుండుం గదా కోరికన్.

ఉ॥ ఈఁగలు మా తగుల్కొనునొ యిప్పు డటంచును బొంచి లూత యా
లాగున నుండు; దాని వెతలం దగు కష్టముకైనఁ జూడకే
బాగని యిల్లు నూడ్చెడిది పాయక వచ్చి నికేతనంబు నెం
తో గల పెంటనుం బొరకతోడను, గొట్టుచు నూడ్చు నెంతయున్.

క॥ ఓరీ మనుజుఁడ వింటివొ- యీ రీతిన్ లూత కష్ట మేమాయెను వే
సారక యది పాటాడిన- పాటాటం బొక్క పొరక పాలై పోయెన్.

చ॥ ఇటువలె మానవాధములు నేమి యెఱుంగక యీ ప్రపంచ సం
ఘటితపు మేల్ల చెల్వములకై బహు కష్టపడన్ వ్యధావిధం
బటమటగాఁ బ్రభుత్వ సుఖమాదిగ నార్జన యెంత చేసినం,
దటుకున నల్ల దుర్మరణ ధాటిని దప్పట నీకు నేటికిన్.

క॥ వ్యర్థ ప్రపంచపు మేల్లను-సార్థకమని నమ్మి నరుఁడు సద్గతిఁ గనలే
కర్థిని గాలము వెళ్లని,-రర్థకమున నుండఁగా, నరకమును బొందున్.

వ॥ ఆయిన మఱి యిదంత నిజమనిజమని భవదీయాత్మన వితర్కింప నేటికి? నీవు బోధార్థివై వినఁగలవాఁడవు, నీకిందులకుఁ దార్కాణంబుఁ గావలయునేని యారంభించిన కార్యములు ముగియింపక మృతులైనవారి కథలఁ జెప్పెద నాకర్ణింపుము.

సీ॥ క్షితియందు నొక మహా సేనాధినాథుండు-ముందు భూరి పరాక్రమ్ము దతండు
నిజ రాజ్య మేలుచు నింపార సుఖమునఁ-దనరారుచో, వాఁడుదగ్ర శౌర్య
భీకరంబైన సేనాకోటి దళకంబు-గూర్చుక యొక పరకుంభినీప
వరుని యుక్కణఁగించి వాని రాజ్యము గట్టు-కొన, రణసన్నాహ మొనర దాఁటి

తే॥ మిాఱి కదలి తదీయ భూమిాశవరుని
పట్టణముచుట్టు ముట్టడి పరఁగ వేసి
యున్న నయ్యెడ నావీట నొక్క పుణ్య
వతి యరుగుదెంచి వాహినీవరుని ద్రుంచె.

ఆ॥ ఇంత బలము గల్గు నీ దళకర్తను
నబలయయిన యొక్క యబల వచ్చి
యే విధానఁ జంపె నేమియుఁ జెప్పక
వినర యిట్లు నరుఁడ వీనులార.

క॥ పట్టణముచుట్ట నేసిన-ముట్టడి దళకర్త యనికి మొనసినయెడఁ ద
త్పట్టమున నొక మైదువ-పట్టుగ స్వపురంబు గట్టు పడరా దనుచున్,

చ॥ అని మది నూహ చేసి తదహర్పతి గ్రుంకిన వేళ నొక్కతే
యణకువ నేగుదెంచి మఱి యా దళకర్తను జేరి ధీరతన్
వినయ విధోక్తులం దనిపి వేడుక యాననఁ గుస్తరించి య
ర్ధనిశని నందఱున్ నిదురలందఁగ నేమఱ నిచ్చోఁ బోటరిన్.

క॥ ఆ సేనానృపుఁడేమఱ-నా సమయంబున బిఱాన నాతని శిరముం
గోసికొని యతి జవంబున-నా సుందరి మరల వచ్చె నప్పురి కపుడున్.

తే॥ ఇట్లు దళకర్త గూలిపోయిన నిశాంత
మందు వీక్షించి దళమెల్ల మదిఁ గలంగి
కొమ్మమూలాన దళకర్త గూలెననుచుఁ
దెలసి బెదరుచుఁ జెదరుచుఁ దొలఁగి రపుడు.

వ॥ ఇవ్విధముగ నీ వెన్నంటి యుండెడు దుర్మరణంబు, సంపాదిత నికేతన నివాస భోగకార్యసాధన మానసేచ్ఛా సుఖద్రవ్యానుభవాది యనుభవంబు లనుభవిం చుటకు ముందరగానే, తుదముట్టనీక జీవంబు నీడ్చుకొనునది యెట్లన్న వినుము,

సీ॥ క్రమ్మఱ నొక పరాక్రమశాలియైనట్టి-తొలి మహీతలపతితిలకుఁ డొప్పు

గ ననేక రాజ్యము ల్గట్టుక యొడ్డోల-గములోడి సంప్రీతికరణి నుండి
చేకొన్న రాజ్యము చెలువారఁ జాలద-టంచు నింకను మహోఘాకలోడ
ఘనత రాజ్యము లనేకంబులు కొని యేల-వలెనంచు నాలోచనలు నొనర్చి
తే॥ యుండెడి యనేహమున, వాని నుండకుండ
గాత్రమున బలు రోగ మొక్కటి పొడమెను,
పుచ్చి పురుగులు పడి యంతఁ జచ్చె వాఁడు
మానవుఁడ వింటివటర దుర్మరణవిధము.
క॥ ఇటు కార్యము ముగియింపని-యటు ముందఱనే ప్రసక్తమై కొనిపోవుం
పటుదుర్మరణము, నది వ-చ్చుట వేళ యెఱుంగరాదు నూటిగ వినరా.
సీ॥ ఒక ధనాఢ్యుండు ముందొనర నీ క్షితియందు-నేర్పుమీఱంగ ననేకమయిన
ధనము సంపాదించి తనరఁ బిమ్మట నది-యతిసౌఖ్యమునఁ దాను ననుభవింప
వలెనంచు మనములోఁ దలఁచి యుండిననంత-లో మహా కఠినమా రోగ మొకటి
తనకుఁ బుట్టినపుడు తన గొప్పయిన విత్త-మనుభవించక ముందఱనె బిఱాన
తే॥ నన్నుఁగొని పోవు మరణ మట్లున్న దనుచుఁ,
దథ్యముగ వాఁడు తలఁచుక ద్రవ్యమెల్లఁ
దనదు ముందఱఁ బెట్టించుకొని తదీయ
ధనమును గనుంగొని వచించె ధనికుఁ డపుడు.
మ॥ ధనమా, మిమ్మిటు వీడిపోవుటకుఁ జిత్తంబం దసహ్యంబె యాఁ,
మని సంపాదన యెంత చేసితి మిముఁ మత్కర్మ మీ వేళ కి
ట్లైనసెంగా మఱి యేమి సేయుదు, నయో యీ ద్రవ్యసంపాదనల్
నినుఁ గూర్చి గద సేసితిఁ దనువ, నిన్నేలాగున నీడుదుఁ.
ఉ॥ ప్రాయమ, యేమె నీకొఱకె భాగ్యము నింతగఁ గల్గి యుంటి, నీ
వీయెడ నన్ను వీడఁగ వివేకము పుట్టెనుగాని నిన్ను నేఁ
బాయఁగలేను ద్రవ్యము సమర్పణ చేసెద నీకు, గాని నఁ
బాయక యిప్డు నుండుము, యుపాయమ ప్రాయమ బోను న్యాయమా.
వ॥ అని యీ చొప్పునఁ దద్ధనంబుపయి భ్రమలు వీడంజాలక విలపించుచున్న ధని
కుని నిలువనీక కొనిపోఁగ దుర్మరణంబు బిఱానఁ గదిసిన వాఁడును వడిం బెద్ద
నిదుర పోయెనంత వాని యాత్మనుం బిశాచిచయంబు భయంకర దుర్గంధ పా

తాళి నరకానలాకూపారగతునిం జేయ నీడ్చుకొని చనిరొ వినుము.

తరళ॥ సతత మంచును నీ ప్రపంచపు సౌఖ్యము ల్మదిని నమ్మినన్
గతి లభించక పోవు వింటివ, కావున నిట్లు దలంపకే
మతి వహించి మనుష్యులెల్లఁ గ్రమాన దుర్మరణానలన్
ధృతిగ ముందఱగాని మోక్షస్మృతి న్వడిన్ వెదుకం దగున్.

పంచచామర.

పరాకులేక యేకచిత్తభక్తిచేత నాలకిం
పరా పరాత్పరుం బిడాన భావమం దెఱుంగఁగాఁ
దరింపఁజేయు మోక్షకరదండఁ జేరి యుండుఁడీ.
గురుం భజించునట్టి మర్త్యకోటి కబ్బు మోక్షమున్.

మత్తకోకిల.

సంగరాంగణ సంగ శూరుఁ డసంగతంబుగ నాయుధం
బంగుమీఱఁగఁ గేలబట్టక భండనం బొనరించకే,
దంగి కేరి జయింపనేరక తారి యాయ్యోఁడఁ గూలున
భ్భంగి దుర్మరణంబు నొందెడిపట్ల పందలు మర్త్యులున్,

మ॥ స్థిరహీనంబగు కాలమున్ జరుగ నిచ్చి మర్త్యమర్త్యుండు దు
ర్మరణోదగ్రరణాంగణ ప్రగత వేళన్ గేలఁ బుణ్యాయుధం
బరయన్ లేకటు దైవ భూరి కరుణాపాంగంబునుం దోడు రా
క రిపు శ్రేణులునా పిశాచుల కృతోద్బాధ వ్యథల్ జెందఁడే.

కం॥ కాలము జరిపెడు మనుజుఁడు-నీలాగున దుర్మరణ మనెడి రణమందుం
గేలను పుణ్యాయుధనహి-పోలఁగ నరకాగ్ని యప్పుఁ బొందఁడె పంద్రై.



# ఎనిమిదవ వ్యాఖ్యానము



## మరణము యొక్క విశేషములు.

పరలోక భూలోకములను సృష్టించిన నీతిబలుఁడై యుండెడు పరమకర్త ఆనతియ్య నవధరించిన వేదవాక్యమును గొని తిరుసభ అందరికి ఎరిగించునది ఏమనగ, మంటిచేత కలిగిన మనుష్యుడా, నీవు తిరుగా మన్నుగా పోదువని తలంచుకొనుమని వినుపించుచున్నది. ఓరి మనుష్యుడా, యెండముఖమునకు మంచు కరగు లాగున నీ శరీర సౌందర్యమంతయు మరణముచే నాశన మగునని ఎరుగగలవాడవు. రేపు పుచ్చి పురుగులు పట్టి చెడి మన్ను తినిపొయ్యెడి శరీరమునకు నాభరణములని అలంకారములని ద్రవ్యములని వెతకి సంపాదించి దానికి నీళ్లు పోసి మినుకుజేసి నగలను ధరింప ఆరాటపడుచున్నావు. అయ్యో పాతకా, చెడని నీ యాత్మకు ఒక మేలైనను జేయుట లేదే! ఇదిగో; నేడు పునుగు జవ్వాజులలో పరిమళించుకొని అల్లాడెడు శరీరము, రేపే పుచ్చి కంపుగొట్టును! ఈ మంటి కుండవంటి దుర్గంధ శరీరమునకు మాత్రమే ఆరాటపడుచున్నావు. మరణమైనది వచ్చినతోడనే నీశరీరము కదలని కట్టెవలె బిగిసి, చేతులుకాళ్లు చల్లబడిపోయి, నాలుక పడి ముఖమువాడి, హృదయము బీర్చి, కడుపుబ్బి శ్లేష్మము కట్టియూపిరి సన్నమై జీవ మెడబాసిపోవు సమయము ఎంతో భయంకరమైనది! బ్రతికియున్న కాలములో నీ శరీరమునకు గాను బహు ప్రయాసపడినదంతయు అప్పుడు వ్యర్థమని కనుగొందువు. జీవము ఎడబాసినతోడనే నీ కాయమైనది, అవలక్షణమయి దుర్గంధము విసరి పురుగులై పుచ్చి, ఊది కంపుగొట్టి, కడన ధూళియై చెడి మన్నుగా పోవునని ఎరుగుము గాక.

అయ్యయ్యో పాపాత్ముడా, ఈలాగు పురుగులకు మేతైపోవనా, శరీరము

సుఖముగా పెంచెదవు? ఇట్లు కంపుగొట్టనో పునుగు జవ్వాజుల పూసి తళుకు జేసెదవు. ఇట్లు ధూళియై పోవనా బహు ఆశతో శరీరమును మినుకుచేసి, చెడని యాత్మను మరచిపోచున్నావు? ఇటువంటి కష్టకాలము రాకముందరనే, దృఢమైన మేలుగానుండు పుణ్యముల వెతకుట అవసరము గదా? అట్లు వెతకినట్టయితే కదా శరీరము చెడిపోయినను నీ యాత్మము పరమగతి చేరునని దృఢమైన నమ్మకము కలుగును! కాలముండగానే పుణ్యమును వెతకక యున్నట్టయిన, మరణ తరుణమున శరీరము చెడి పురుగులు తినునట్లుగానే, ఆత్మ నరక పాతాళమున బడి నీచ పిశాచులచే తన్నులు బడి కాలిపోవుచున్నదని దుఃఖపడి చచ్చెదవు. అట్లు చావక యుండునట్లు ఈ ప్రొద్దే మరణము వచ్చునని సకల పాపములను విడిచి పుణ్యములను చేయ గట్టి ప్రతిజ్ఞ చేయుదువుగాక.

ఇవ్విధముననే యొక రాజకుమారుడు తండ్రి చచ్చిన కొన్నాళ్లకు వాని ప్రేతమును చూడవలెనని సమాధి తెరిపించి, ప్రేతమును చూడగానే, శరీరమూది కంపుబట్టి, పురుగులు లిబలిబమని తొలియునది చూచి, ఒడలు జల్దరించి అయ్యో యని బోరున ఏడ్చి, మొక్కళ్లుబెట్టి, ఇదిగో ఈ అవలక్షణపు పురుగులకు మేపుగానో శరీరమును పెంచుచున్నాము. ఈలాగు కంపుగొట్టనో, పరిమళ వాసనలను పూయుచున్నాము. దుర్మరణము వీరిని రాజు అని యెరిగి, ఘనముగా నెంచి సన్మానించినదా? లేదుకదా? పరదేశికి వచ్చిన పాటే, వీరికిని రాజేసెను కదా, అని తలంచి, ఇట్టి దుర్మరణము రాకముందరనే, ఆత్మను నిత్య పరమ గతికి జేర్చుకొనుటే కార్యమని చెప్పి, రాజ్యమును సకల సుఖములను విడిచిపెట్టి, పరదేశియై తిరిగి మరణ పర్యంతము పుణ్యపు త్రోవలో తప్పక నడిచి పరమగతి చేరెను. ఓరి మనుష్యా, మరణమును తలంచినందున ఈ మంచి విచారము వానికి వచ్చినలాగున నీకును వచ్చునట్లు, మరణము దగ్గరించి వచ్చుచున్నదని యిప్పటికి తలంచి నీకు ఆ సమయమున ఆదరవై యుండెడు పుణ్యమును సంపాదింపగలవాడవు. ఇప్పుడు వెతకని పుణ్యము ఆ సమయమునకు తటాలున వచ్చి, నీకు సహాయపడునని తలంచవద్దు సుమా.

ఇదిగో ఒక సేవకుడయినవాడు సేనాళ్లు ఒక రాజును సేవించి, కడన మహా వ్యాధిగా పడియున్నపట్లు రాజు వానిని విచారింప వచ్చి వానిని జూచి ఓరి తమ్ముడా, నీవు దిగులు పడవద్దు, భయపడబోకు. నీకు నేనున్నాను. నీకు

కావలసినది యడిగితే యిత్తునని చెప్పగా, సేవకుడు రాజును జూచి, అయ్యా, ఇదిగో నేను మిమ్మును ముప్పది యేండ్లనుండి సేవించినందుకు దాసునికి ఈ తరుణమునకు తోడగు సహాయముల నియ్యనవధరింపుడి. అవి యేవనగా, మొదటిది, నేను పడెడు వ్యాధి కఠోరము కొంతసేపయినను శాంతిపడి నిలువను రెండవది, మరణము నా జీవమును కొంచుకపోకుండ నన్ను తడగట్టుండి. ఈ రెండు కూడకపోతే, నేను మరణము పొందితినంటే అలుపు దీర్చుకొనుటకు ఒక మంచి స్థలమును నాకు కరుణించుడి యనెను. ఈ వార్తలు విన్న రాజు దిమ్మరపోయి, వానిని జూచి నీవు అడిగిన కార్యములు సకలమున కధిపతియయిన రాజాధిరాజులై యుండు పరమ కర్తచే నగునుకాని లోకరాజువల్ల నియ్య సాధ్యమగునా, యనెను. అప్పుడు సేవకుండు వేసటబొంది కన్నీళ్లు ప్రవాహముగా రాల్చుచు ఏడ్చి, దగ్గర నున్నవారలను చూచి యిట్లనెను. ఇదిగో, వింటిరో నేనీ రాజును ముప్పదియేండ్లనుండి సేవించినలాగున సర్వమునకు అధిపతియైన పరమ రాజును ఒక గడియయైన నెప్పుడైన సేవించియుండినట్టియిన నా మనస్సు ఆరాటమంతయు తీరునే? యీ రాజును సేవించిన నాళ్లన్నియు వ్యర్థమయి పోయెనని యిప్పుడు దిట్టముగా తెలిసికొంటిని. ఇకనయిన బ్రతికితినా మనల రక్షింప శక్తులైన పరమ కర్తను మాత్రము నే సేవించుదును. అల్ప విశ్వాసుల సహాయము నమ్ముకొని నడిచినది చాలునని చెప్పుచుండగా ఆత్మ యెడబాసి పోయెను.

హా పాతకుడా వింటివా? అయినను మరణము ఒకసారేనా? లేక రెండు మారులా? తొలి మరణములో నూరకయుండి మరు మరణములో నా యాత్మకార్యములను విచారించుకొనెదనని చెప్పనూహించెదవేమో; అయ్యయ్యో, ఒక్కసారికదా మరణము! రెండుమారులు రాదే. ఒక్కసారి మాత్రము మరణము వచ్చునని నిశ్చయమై యుండగా, అందులో మోసము రాకుండ, బహు హెచ్చరికగా నడిచితే కార్యమని తెలిసికొనుము. ఇదిగాక చచ్చినవారలు తిరుగ పుట్టుదురని కొందరు మూఢాత్ములు పల్కునట్టు నీవు వానిని నమ్మి మోసపోకుము! హెచ్చరిక. ఎందుకనగా: పిండిన పాలు తిరుగా స్తనమునకు ఎక్కునట్టును పుట్టినబిడ్డ తిరుగా తల్లి గర్భమున చొరనట్టును, పోయిన కాలము తిరుగా రానట్టును, రాలినఆకు తిరుగా మ్రానికి అంటనట్టును, చచ్చిన మనుష్యుడు తిరుగా పుట్టునది శుద్ధ అబద్ధమే సరి. అయినందువల్ల ఒకసారి మాత్రము చచ్చెడు మర

ణములో దుర్మరణము పొందకుండ జాగ్రతగా నుండగలవాడవు. లేనట్టయిన అనేకులకు వచ్చిన నిర్భాగ్యమయిన అన్యాయపు చావు నీకును వచ్చుననుట తప్పదు.

అదెట్లువలెననగా, ఇదిగో! ఒకరాజు కామసుఖములో కొల్లలాడి శరీరము అలపుదాకి, అలపార్చుకొనుచుండగా వాని వస్త్రమున వ్రేలాడుచున్న ఒకనూలు పోగునకు అగ్ని అంటుకొని మంటగా నెగసి, రాజు శరీరమునకు చొచ్చినందున క్షణములో శరీరము అంటుకొని కాలి చచ్చెను. ఓరి పాపాత్ముడా, వింటివా, తలంచని వేళ ఒక నూలుపోగు ద్రోవగా మరణము పిక్కటేసి వచ్చి ఆ రాజును చంపినట్టు నిన్నును చంపదని నీకు నమ్మకమైన పదమిచ్చిన వారెవరు?

ఇంకను వినుము; సిలేసీరసు అను వాడును, కోందను వాడును, స్త్రీ సంభోగములో ప్రాణముపోయి అబలచావు చచ్చిరి. తలారి మాణిక్య మనువాడు వినోదపు ఆట పాటలను చూచునపుడు క్రమించెను. అనక్రియోన్ అనువాడు ద్రాక్షపండ్లను భుజించుచుండగా అందులో నొక విత్తనము గొంతునపడి పొరబోయి ఊపిరి దిరుగక చచ్చెను. సెందోరనువాడు త్రాగిన పాలలో వెంద్రుక యున్నందున అది లోపలపోయి క్షణములో చచ్చెను. ఇవ్విధమున నే దియోనిరాజు పంపిన దండు ఎదిరి పటాళముల తరుము గొట్టెనని విని సంతోషము మిక్కుటమై ఊపిరి విడిచి చచ్చెను. ఓ మేరనువాడు అలసట పొంది చచ్చెను. దొమియాసనువాడు తాను వివాహము చేసుకొనిన దినమున తన భార్య చేతిని పట్టుకొని రథమెక్కబోయి ఒక కాలు పెట్టి ఇంకొక కాలు ఎత్తిపెట్ట పోగానే శరీరము దడబుట్టి తడబడి క్రిందపడి పీనుగాయెను.

అయ్యో పాతకుడా, సమయమును విధమును గుర్తింపక మరణము వచ్చునది వింటివో, వీరలందరు చచ్చినరీతి నీవును చచ్చుట లేదని దిట్టముగా నెరిగియున్నావా? తెలియకుండగ వీరలకు వచ్చిన దుర్మరణము నీకును రాకుండునట్టు ఇప్పుడే నీవు ఆ భయంకరమయిన కాలములో నిన్ను రక్షింప దగ్గ కర్తను నారాధించి వారి వేద కల్పనలను మీరక నడచుటే కార్యమని తెలిసికొనుము. మరణమునకు ముందరనే నీకు స్థిరమయిన ఆస్పదమై యుండెడు దేవ కరుణను సుకృత పుణ్యములవల్ల గైకొన తగ్గట్టుగా హెచ్చరికగా నుండినట్టయిన మరణమునకు భయపడక ఎదురు చూచుకొని యుండవచ్చును. ఆ దేవకరుణలేక చచ్చితివంటే నీకు నరకమే తప్పని కావని ఎరుగగలవాడవు.

# ఎనిమిదవ వ్యాఖ్యానము.

## మరణముయొక్క విశేషములు.

వ॥ అవధరింపుము. తత్పరమానంద నామధేయము నీంద్రుండు బోధార్థులైనట్టి ధరా సురాది మానవులకు ననుకంపాకటాక్ష వీక్షణంబుల నిట్లనియెను: తత్పరమా ధీశ్వరుఁడు వేదగ్రంథములలో నానతి యిచ్చిన వాక్యమేమనఁగ, మంటిచేతఁ గలిగిన మనుష్యుఁడ, మళ్లి మన్నుగాఁ బోయెదవను మాట యర్థము సభవారికెల్ల నిదిగో దీపింపఁ నే జెప్పెద నది యెట్లనగ:

ఉ॥ ఆతప వేళయందు హిమమంత హతంబగు రీతి నీ వయో
ఖ్యాతి భవద్వయోలలిత కాయము దుర్మరణంబుచే హతం
బౌతటి నేమెఱుంగక సమస్త సుఖోన్నతితో నలంకృతుల్
ప్రీతి వహించి చేసెదవు, పెంచెద వేటికి, నేలపాలగున్.

శా॥ ఈ ప్రొద్దెంత సుగంధ వాసనలకయ్యో పున్నగజవ్రాజులన్
దీపింపంగ సమస్తభూషణములం దీరైన నీ కాయమున్
తేపే పుచ్చియుఁ బుర్వులుం బడి మహార్తిం బొంది దుర్గంధమౌఁ,
జీపో మృద్ఘట సామ్యమైన తనువున్ శృంగారముం జేయఁగన్.

మ॥ మరణంబాగతమైన నిట్టి తనువేమయ్యెన్, నిరాలోల ని
ర్భర దారుస్థితి గట్టిగాఁ బిగిసి, కైపాదమ్ములుం జల్లనై,
యరిదినీవ్వడి బిటాన వాపడి, ముఖంబం దెండి, కన్మూఁతలై,
యరయన్ శ్లేష్మము గొంతు దట్టి, గడుపూఁద లప్పంబునౌ నూపిరుల్.

తే॥ ఇట్టి కష్టపు దేహాన కింత యేమి
టికి నయో ధూళియై పోదొ, సుకములందఁ
జేయునది నిజయాత్మను జెఱచి నరక
శిక్ష తప్పక పొందఁగఁ జేయునుగద.

ఆ॥ ఇంత సుఖమునంద నేమాయె భాగ్యము?

పరమ కర్తఁ జేరి భక్తితోడఁ
బుద్ధి నతని ప్రేమ పొందిన పుణ్యంబు
గలిగెనేని పరమ గతి కలుగును.

క॥ ఓరీ మానవుఁడా మఱి-యీ రీతిం జెప్పవలెల్ల నిటు నీకే గా
దారయ మర్త్యులకెల్లను-ధారుణిఁ దెలియంగఁ జెప్పెదర యింకొకటిన్.

సీ॥ పూర్వమం దొకరాచ బిడుతండు తనతండ్రి-మృతుఁడైన కొన్నాళ్లకతని శవము
వీక్షింపవలెనంచు విపుల సమాధిలో-శవమును దీయించి చాలఁ గాంచి
మేనూఁది దుర్గంధ మెనసి బల్పురుగులు-లిబిలిబి మనుచుఁ దొలిచెడిది గని
అయ్యయో యని వెక్కి యట్ట బోరున నేడ్చి-యట్టిశోకావేశ మణఁచి పలికె:

తే॥ నరయ నీ యవలక్షణంబయినయట్టి
పురుగులకు మేఁత గాఁబోలుఁ బుడమి మా క
ళేబరంబులు వైభోగలీల లెనసి
పెంచుదు మటంచు బహుప్రలాపింపఁ దొణఁగె.

గీ॥ ఇట్టి దుర్గంధము కొఱకె యింతగాను
మా శరీరములకు నాశ మంజులమగు
పునుగు జవ్వాదిమేలు వాసనలవస్త్ర
వులు నలఁదుకొందు మను దుఃఖకలిత వృత్తి.

వ॥ అని శోకావేశంబు చాలించిన పిమ్మట మనంబున నాకు నిదే గతిగదా యని తలంచి యట్లుగానీక యింకనయిన మదీయాత్మను బరమగతికిఁ జేర్చుట కెవ్విధంబని యెంచి విరక్తిమార్గగతుండయి సకల రాజ్యానుభవాది భోగంబులు విడిచి పరదేశి విధంబున సంచరించి మరణకాలపర్యంతంబును ధర్మతపోనిష్ఠాగరిష్ఠుండయి సుకృతమార్గంబునఁ దప్పక నడిచి పరమగతికి నర్హుండయి త్రిదాజకుమారుండు చనియె వినుము.

క॥ ఇయ్యెడ సంపాదింపక-యయ్యో పుణ్యంబు మరణ మందెడి వేళన్
నెయ్యమున రాధటన్నను- గుయ్యాలింపంగ దిక్కు కుంభినిఁ గలదే.

క॥ ఒక రాజునొద్ద గొలిచెడి-యొక సేవకుఁడుండె, మున్ను నుర్వీశ వాఁడా
సకల విభవముల నెప్పుడు-సుక మందుచునుండెఁ గొన్ని సుదినములందున్.

మ॥ అటు కొన్నాళ్లకు వానికిం గడ మహా వ్యాధి ప్రసక్తంబునై,

పటు శక్త్యున్నత హీనమై, పడిన యా పాట్లన్ బరామర్శ చే
యుటకై భూపతి వచ్చి వాని గని యయ్యో తమ్ముఁడా యంచు నీ
విటు డెందాన దిగుల్పడన్ వలదు నీ కెంతైన నే నుండఁగన్.
క॥ నీకేమియుఁ గావలసిన-బ్రాకటముగ నొసఁగెదనుర భయ మందకుమీ,
చేకొనఁగాఁ జెప్పుమనిన-వాక్రుచ్చెను సేవకుండు వాంఛంగడిమిన్।
శా॥ అయ్యా మిమ్ము భయాతిభక్తిమతులన్ హర్షింప సేవింప నా
కయ్యాలింపుఁడి, ముప్పదేండ్లగును, మీ కొల్వేను గొల్వంగ నా
కయ్యో భాగ్యము లేమిఁ దక్కువ, భవత్కారుణ్యమున్ గల్గి మీ
రియ్యన్ బూనితి రిప్పు డీఁగదవయా యే నియ్యెడం గోరెదన్,
మ॥ అది యెట్లన్నను విన్నవించెద మదీయ వ్యాధి యేతత్క్షణం
బిదిగో శీఘ్రమె దప్పిపోను, మరణం బిట్లా మదాత్మన్వడిన్
బిదపం దాఁగొనిపోక యుండ, సుకృతం బే నందు మార్గంబు నీఁ
గదవయ్యా, తడవేల చేసెదవు నాకా నిష్ట మిమ్మాఁడిలన్.
చ॥ అనవుడు నాలకించి నృపుఁడద్భుత మంది విచారచిత్తుఁడై
యనియె, గుణాఢ్య నీవడిగినట్టి సుకార్యము సేయ నోప నా
ఘనత మహానుభావుఁ డనుకంపకుఁ జెన్నిధిసర్వ భర్త దీ
ఘనుఁ డనఘుండు తత్పరమ కర్త యొసంగును, మాకుశక్యమే.
ఆ॥ ఇట్టి పనుల కెల్ల నిలలోన నమ్మహా
సర్వకర్త దయ నొసంగఁ గలరు.
మనుజపతు లొసంగ మఱి శక్యమే, యిట్టి
పనులు సాధ్యమౌనె వినర సుమతి.
చ॥ అనవుడు సేవకుండు విని హా యని వేసటఁ బొంది యయ్యయో
యని ధునిరీతిఁ బొఱు నయనాంబువు లారక యేడ్చు చిట్లనెన్
దనసరసన్ వసించిన బుధాళిని గన్గొని వింటిరా మహా
ఘనమతులార యీ వెతలు గానక నీమనుజేంద్రుఁ గొల్చితిన్.
తే॥ సకల సుగుణ కల్పశాఖి సర్వమునకు
కర్తయయిన పరమ కర్త నార్తిఁ
జెందుమతిని సుగతిఁ జెందుటకయి చేరి

కొలువనయితి హీనగుణినినగుచు

సీ॥ ఏతన్మహా మాన వేంద్రుని ముప్పది-యేండ్లు గొల్చితిఁ గాని యింత మాత్ర
మయ్యయో యొక్క నాఁడైన దత్పరమ క-ర్తను జేరి కొలువనైతిని దెలిసియు
యీ మహా దేవుని నేఁ గొల్చినయెడల-నిటులు నాకారాట మేల గల్గు,
నవనీపతిని గొల్చుటది యెల్ల నిప్ఫుడని-రర్థకంబయి పోవు నపుడు దెలియ

తే॥ నయితి నే నహంకృతిఁ జేయనైతి సుకృత
మేమి సేయుదు నిఁకనైన సేమమరయ
బ్రతుకునయ్యెడ ననుఁ బ్రోవ బలుఁడు పరమ
కర్త యని నమ్మి కొలిచెదర్ గ్రమములోడ

వ॥ అని యివ్విధంబునం బ్రలాపించియయ్యెడ సేవకుండు మృతుండయ్యె వినుము.

ఆ॥ వింటివటర నరుఁడ వెతల మార్గంబది
మఱియు నొక్కసారె మరణమిట్లు
కాదు, రెండుమార్లుగల్గు నీ సారికి
నాత్మ సుగతి చూత మనఁగవలదు.

చ॥ మరణము నొక్కసారె యని మానవు లుర్వి నెఱుంగ నేరకే
దురితమె గోరి యీతడవ దుర్మరణంబెను రాకముందె భా
సురసుకృతంబు సేయఁగను జాతమటంచుఁ దలంచి పాపులై
నరకదవానలాంబుధి నణంగను జచ్చెద రేమి చెప్పెదర్.

చ॥ మృతులగువారలు న్మరల మేదిని బుట్టెదరంచుఁ గొందఱుర్
గతి గనలేక, దుర్జనుల కానని కూఁతలు నమ్మి, వారి భా
షితములచొప్ప మోసములు చెందెద రెట్లన నాలకింపరా,
క్షితిగతకాలముర్ మగుడఁ జేరఁగవచ్చునె తథ్యమిత్తఱిర్

మ॥ ధరణీజంబుల రాలినట్టి యల పత్రంబుల్ పునస్స్వస్థల
స్థిర సంబంధ యథావిధిం దనరునే, క్షీరంబుల న్పిండిన
న్మరలం జంటికి నెక్కునే, శిశువు జన్మంబైన గర్భానకుర్
జొర మార్గంబును వెండియుం గలదె, యీ చొప్పు మృతిం బుట్టగర్

ఆ॥ ఒక్కసారి చావునొనరఁగ వచ్చును
నీ బ్రతుకుకుఁ గాన నెలమిలోడఁ

బరమకర్తఁ జేరి పరగఁ మోక్షసుఖంబు
గలుగుటకును గడియ గొలువరాదె
ఆ॥ ఒక్క సారి మరణ మొందినఁ బడపడి
తానొనర్చు పాపధర్మవిధుల
నరకమోక్షములును సరిమించ లభియించుఁ
గాన మరలఁ బుట్టు గలదె ధరను
క॥ పాతాళనరకమునఁ బడు-నాతనికిఁ మరల రాను నయమునఁ గలదే,
ప్రీతిగ మోక్షంబందిన-నాతనికిఁ మరల రాను నయమునఁ గలదే.

# తొమ్మిదవ వ్యాఖ్యానము.

## దేవయిష్టప్రసాద శ్లాఘ్యము.

మరణ కాలములో మనుష్యునికి సర్వేశ్వరుని యిష్టప్రసాదము దొరికినట్లయిన ఈ దేవయిష్టప్రసాద ఫలముచే కడతేరుదునని నమ్మికగా నుండవచ్చును. ఇదియుగాక మరణతరుణములో దేవకరుణను చేకొన ప్రతివాడు ప్రయాసపడవలెను. ఈ దేవకరుణ మరణసమయమున లేకపోయినట్టయిన పరమగతి చేరక నరకపాతాళమున కరుగవలెనని తెలియగలవాడవు; కనుక తమ్ముఁడా, దేవకరుణయొక్క మహిమనుగూర్చి కొంత వినుము.

దేవయిష్టప్రసాదము అనెడు దేవకరుణలేని ఆత్మ జీవములేని శవము; అఫలితమయిన బీడు, దేవకరుణలేని తపము అతపము, దేవ కరుణలేని జ్ఞానము అజ్ఞానము, దేవకరుణలేని శాస్త్రము నీటిమీది బుగ్గ, దేవ కరుణలేని జపమంత్రములు వ్యర్థమాటలు! దేవకరుణలేని సొంపు అసహ్యము; దేవకరుణలేని సుఖము అసుఖము నిర్భాగ్యము, దేవ కరుణలేని క్రియ అఫలము అని యెరుగగలవాడవు. ఇటువంటి దేవకరుణను గైకొనక పోయినట్టయిన మోసము వచ్చుననుట నిశ్చయము. అయినందున నీవు చేయు క్రియలను ఫలములో చేయ దేవకరుణ చేరియుండవలయును. అది లేక యీడేరుటకు తగ్గ పుణ్యము కాదనుటంజేసి దేవయిష్టప్రసాదము పొందుటకు అయిన ధర్మానుష్ఠానములు చేయగలవాడవు.

ఓరి పాపాత్ముఁడా, దేవకరుణ చేకొ

నునంత భాగ్యము ఈ భూలోకమున మ రియొకటి లేదు. దేవకరుణ చేకొనినవా డు సర్వేశ్వరుని దేవాలయమై యుండు ను, మోక్షరాజ్యమునకు ధన్యుండగును. దయారస కర్తకు స్నేహపుబిడ్డయై యుం డును. సకల పుణ్యములను ఫలముతో జేయ ప్రాప్తుండగును.

ఓరి మూఢాత్మా, యింత భాగ్యము ను రప్పించు దేవకరుణను రోతయిన పాపమునకుగాను చేయి విడువవచ్చు నా? దీనిని వెతకక అసడ్డగా నుండవ చ్చునా? ఇట్టి స్వామియొక్క వెలలేని వరప్రసాదమును ఈ లోకమంత వచ్చిన ను విడుచుటకు న్యాయము కలదా? దీని ని విడిచినయెడల ఒకప్పటికిని ఈడేర వనుట నిశ్చయమైన వాక్యముకదా? వె లలేని నవరత్నముల నిచ్చి ఒక పగిలిన పెంకు మంచిదని తీయువారు కలరా? స్థాపించిన దీపస్తంభమిచ్చి మంటితో జే సిన ప్రమిదను మార్చుకొనువాడు కల డా? ఓరి పాతకుడా, దేవయిష్టప్రసాద మును కొంచెమని యెంచి నీచపాపము నకై విసిరివేసి పోవుచున్నావు. ఇదిగో ఈ లోకములో గల యెల్లన్నియు సుగంధ పరిమళములనియు, సముద్రమంత తటా కములన్ని అమృతమనియు, కొండల న్నియు నవరత్నములనియు తలంచి, వీ నినన్నిటిని ఒక మట్టిగడ్డకై యిచ్చు మ తిచెడినవాడు కలడా? ఓరి పాపీ, వీనికం టే అతిశయించిన భాగ్యమగు దేవయిష్ట ప్రసాదమును అవలక్షణ పాప రోతకు గాను ఎట్లిచ్చి వేసి పోవుచున్నావు? పలు కులలో అగ్నికంటే పరాక్రమము కలద నియు, లోకమును వణకజేయు శౌర్యము కలదనియు, సమస్తమానవులకు గెలువ వీరశూరత్వములు కలదనియు, వీనినన్ని టిని గలవాడు ఒకబొట్టు తేనెకుగాను ఇ చ్చివేయునా? ఓరి పాతకుడా! ఈ శౌర్య పరాక్రమములకంటే అధిక పరాక్రమము కలిగిన దేవయిష్టప్రసాదమును స్వల్ప లోక సుఖములకుగాను ఎందుకు పారవే సెదవురా? అమృతమును అరోచించి వి షము వాసియనియు పరమగతి మోక్ష మును రోసి దుర్గంధ నరకమే వాసియని యు చెప్పువాడు కలడా? సౌందర్యము సొంపులు వద్దు, శోభన ప్రతాపము వద్దు, భాగ్యము చెల్వములు వద్దు, పర మగతివద్దు, అని చెప్పువారలను నిండు పైత్యకాండ్రని చెప్పవలెనుకదా. అ య్యో పాతకుడా, ఎందుకీ పైత్యమునకు మించిన పైత్యము కలిగి తిరుగుచున్నావు. పరమకర్త కరుణించెడు వెలలేని యిష్టప్ర సాదము సకల భాగ్యములు రాజేయు ఊటయై యుండలేదా? అట్టి భాగ్యమును వెతకక మూర్ఖుండై నిన్ను జెరచెడు పా పమును విడువనని సాధించెదవు కదా?

ఓరీ పాతకుడా, యీ భూలోకములో పేరు ప్రఖ్యాతియుండుటకు నాశించని వాడు లేడుకదా? ఇదిగో నీవు మాత్రము పాపమును విడువక నీచుడై యుండెద వను తెగువ యెక్కడిది? మండలకాంతి సూర్యునివలెనును, మేఘముల కాంతి నీళ్లవలెనును, మనుష్యుని కాంతి జ్ఞానమే యగును. ఆలాగుననే మనుష్యుని యొక్క ఆత్మకు కాంతి దేవ యిష్టప్రసాదమే సరి! అటువంటి యిష్టప్రసాద కాంతిలేని ఆత్మమేలాగున నుండుననగ, సూర్యుడు లేని మండలము అంధకారమైనట్టును, నీళ్లులేని మేఘము పంబైనట్టును, బుద్ధిలేని మనుష్యుడు మృగమును బోలినట్టును, దేవకరుణలేని ఆత్మ జ్ఞానములేని మృగముగానును అవలక్షణ దుర్గంధ శవముగానును ఉన్నదని యెరుగగలవాడవు.

ఓరీ పాపీ, దేవకరుణ లేకుండ చేయు పుణ్యములన్నియు పరమగతి జేర ఫలము నకు రావు. సకల పుణ్యములకు జీవమై యుండెడు దేవకరుణను నీచ పాపమునకు విడుచు కార్యమేమి? దుర్గంధ అవలక్షణపాపమును విడువక కడతేరుదునను నల్పబుద్ధి మరచిపోరా. ఎందుకనగ, పాపముచేత దేవయిష్టము దూరమై పోవునుకదా? ఇట్లుండగా పాపమును విడువక కడతేరుదునని తలంచబోకుము. దుర్గంధపు పీనుగులోనుండి సుగంధము వీచనట్టును సర్పముయొక్క నోటిలో అమృతము ఊరనట్టును, అగ్నిలో శీతలము జైలుదేరనట్టును, దుర్గంధపాపములోనుండి పరమపదముయొక్క ఆనందము రాదని దిట్టముగా నెరుగగలవాడవు. అయితే ఒకవేళ దుర్గంధపు కళపులోనుండి సుగంధము వీచినను, సర్పము నోటిలో అమృతమూరినను, అగ్నిలో శీతలము పుట్టినను, దుర్గంధపాపము విడువక ఒకనాటికిని పరమానందము పొంద సాధ్యముకాదు.

ఓరి పాతకా, యీ పరమ సత్యములను ఆలకించి వింటివా? ఇకనయినను పాపమార్గములను మనస్సార విడిచి దేవకరుణను కలుగజేసెడు ధర్మానుష్ఠానములను అనుసరించులాగున దండించి పాటుపడుము. ఎందుకంటే మరణము రాకముందరనే యీ దేవయిష్టప్రసాదము చేకొంటివేని నిన్ను ధర్మము కాచును. లేక పాపములోనే చచ్చినట్టయిన పరమకర్తయొక్క సముఖములో ప్రత్యేక తీర్పు విన నీవు చేరినప్పుడు ఏలినవారు నిన్ను అసహ్యించి విడిచి దుర్గంధ నరకములో నిత్యకాలము మండ పడద్రోయుదురు. అయ్యో పాపాత్ముడా ఈ భయంకరపు గొప్పచేటు నీకు రాకుండ ఈ మంచికాలములోనే అశుద్ధపాపములను తొలగించి సుకృత పుణ్యములను చేయ దొడగుదువుగాక.

# తొమ్మిదవ వ్యత్యాసము.

## దేవయిష్ట ప్రసాద శ్లాఘ్యము.

వ॥ అవధరింపుము, మఱియుఁ దత్పరమానందుం డిట్లు బోధించిరి, మానవులు నీ మాయాప్రపంచంబునందు మరణభయంబువలననైనం గాని సుజ్ఞానులై పరమగతిఁ జేరుటకుఁ బరమ కర్తను సేవించి తత్ప్రసాదానుమోద సంబంధులగుచుం దరణోపాయమార్గంబునకుఁగా మరణానకు ముందరగానె సర్వేశ్వర ధ్యానపూజావిధాన నిష్ఠాగరిష్ఠులై యమ్మహాదేవుని కరుణాకటాక్ష మాపాదించుకొన్న వారికిఁ గేవల పరమానందైక్య సంధానప్రాప్తం బగు వినుము.

తే॥ మరణకాలంబులో నటు మానవునకు
దేవయిష్టప్రసాదంబు సావధాన
మానితంబుగ నబ్బినా, వాని యాత్మ
పరమగతి కేగు నని నీవు పరఁగ వినుము.

ఆ॥ దేవకరుణ లేని ధీహీనుఁడగు వాఁడు
నరక వహ్నిజలధి కరుహుఁడగును,
గలిగెనేని పరమగతి లభ్యమగునట్టి
దేవకరుణ మహిమ దెలియఁ బఱతు.

సీ॥ కరమొప్పఁగా దేవకరుణ లేని తదాత్మ-భువియందు నిర్జీవశవము గాదె
కరమొప్పఁగా దేవకరుణ లేనట్టియా-బ్రతుకు నిష్ఫలమైన పాడు బీడు
కరమొప్పఁగా దేవకరుణ లేనిజ్ఞాన-మబ్బుండు లేని రేయఁనగఁ బరఁగుఁ
గరమొప్పఁగా దేవకరుణ లేనితవిచ్ఛ-చిలుక బూరుగ పండుఁ దలఁచుటొను

ఆ॥ దేవకరుణ లేని యా వైభవోన్నతం
బెల్ల ఘోర నరకహేతు వగును
దేవకరుణ గలిగెనా, వానికి లభించుఁ
గేవలాపవర్గ భావుకంబు

గీ॥ ఇట్టి దేవకరుణ గల్గు నెట్లటన్న
దేవయిష్టప్రసాదంబు దిరము నొంద
వలెన దెట్లన్న విను మది వాంఛ ధర్మ
విధి ననుష్ఠానములు సేయ వేడ్క నగును.

క॥ విన్నావ నరుఁడ యింతటి-కౌన్నత్యము దేవకరుణ గైకొను టెంతో
కన్నుల పండుగ భాగ్యము-నెన్నఁగ మఱి యొకటి గలదె యిలలోఁ గడిమిన్.

సీ॥ అరుదైన ఘన దేవకరుణఁ జేకొనువాఁడు-సర్వేశ్వ రాలయసన్నిభుండు
అరుదైన ఘన దేవకరుణఁ జేకొనువాఁడు-పరమ కర్తల చెల్మి దొరలఁ గలఁడు
అరుదైన ఘన దేవకరుణఁ జేకొనువాఁడు-మోక్షరాజ్య సుఖానుభోగి యతఁడు,
అరుదైన ఘన దేవ కరుణఁ జేకొనువాఁడు-ఘోర పిశాచుల దూఱి గెల్చు,

తే॥ ఘనత యగు దేవకరుణఁ జేకొనినవాఁడు
నఖిల పుణ్య ఫలానుభవాప్తుఁ డతఁడు,
నిట్టి ఘన దేవకరుణ వహించునట్టి
భాగ్యసౌఖ్యములకై వీడ భావ్య మగునె?

వ॥ అది యెట్లన: వెలలేని రత్నముల గల దీపస్తంభంబు నిచ్చి మృత్తికప్రమిద పాలుమాలి మార్చు హీనుండు గలడా? ఆలాగున నమ్మహా భాగ్యమా ఘనదైవేష్టప్రసాదము నల్ప లోకపు సుఖంబులకు వీడఁ దగునె? వినుము.

క॥ ఘన దేవేష్టప్రసాదము-ఘనమని మనమందుఁ జూడకయె కొంచెపు భా
గ్య నయంబైన ప్రపంచపు-టనిశము లేనట్టి మేళ్ళ నాశింతు రఘుల్.

ఆ॥ శోభన ప్రతాప సుందర పరిణామ
భాగ్య మెల్ల నాకు భ్రాంతిలేదు,
వలదు నాకు, లేమి వాటిల్లనగు చేట్లు
గావలసె నటంచుఁ గాంక్ష దగునె?

మ॥ ఇటులం దుచ్ఛపు భోగభాగ్యములపై నెంతో భ్రమల్ గల్గి తా
రిటు నిత్యం బగునట్టి యప్పరమ దేవేష్టప్రసాదం బయో
కుటిలాత్ముల్ దగ నొల్లరౌర వినరా ఘోరంబగుం, బాపసం
ఘట దుర్గంధ నికృష్టమైన నరకాగాధానలాబ్ధిం బడన్

తే॥ మోదమున దేవయిష్ట ప్రసాద మెనయ

ననిశమైనట్టి సకల భాగ్యములు కల్గు
నట్టి భాగ్యంబు వెదకక యన్యమైన
కుటిల భాగ్యంబు యోగ్యమె గోర నగునె.

ఉ॥ సూరుని కాంతి మండలము సొంపగు రీతి, మహాబిలంబునన్
వారిద మొప్పుచొప్పు విను వారక పూరుషుఁడుం బ్రపంచమం
దారయ జ్ఞానముం గొనఁగ దప్పక పొందును గాంతి నాత్మకున్,
ధారుణి నట్లు కాంతి గల ధన్యుఁడు నిష్టప్రసాదముం గొనున్

మ॥ అటు దేవేష్టప్రసాదముం గొనని జీవాత్మా విధంబెట్లనన్:
గుటిలంబై రవిలేని మండలమునన్ ఘోరాంధకారంబునై,
యిటు పానీయములేని మేఘముబలెన్ హీనుండుకాఁగా మఱిం
తట జీవాత్మ శవంబుచందముగనై తారున్ గదా, వింటివో

క॥ దేవకరుణ నొందక దా-నే విధముననైనఁ గాని యిలఁ బుణ్యములన్
గావింప నేమి ఫలమిది,-భావింపంగా మఱిన్ని పాపము వచ్చున్.

ఆ॥ అఖిల పుణ్యములకు నాధారమైనట్టి
దేవకరుణ విడిచి తెలియలేక
పాపమునకు నేల పడియెద రత్యాశ,
కరుణ విడువ నంత కార్యమేమి?

క॥ అలయికయైనను మనుజుఁడు-నిల దేవేష్టప్రసాదమెంతో భ్రమగా
నెలమిం గైకొనెనేనియు-వెలయఁగ నిత్యమగు మోక్షవిభవము వచ్చున్.

సీ॥ అగణిత దుర్గంధమగునట్టి శవములో-నుండి వచ్చునె సుగంధోన్నతంబు?
గూఢపాదానన గుహలోననుండి తా-నూరునె కోరఁ సుధారసంబు?
ఘోర మహా దావనీరయోని జ్వాల-లందు గల్గునె శీతలంబు వెలయఁ?
బర్వతాగ్రస్థితపాషాణమందు దా-సంభవించునె వికాసాంబుజంబు?

తే॥ నటుల నృత్య-భ్రష్ట నిర్వీర్య పటు భయంక
రాఘములయందుఁ గల్గునె రాజితమగు
సంతతానంద మోక్షరాజ్యానుభవము?
గరిమ దేవకరుణవల్లఁ గలుగుఁగాక.

మ॥ నరుఁడా వింటివొ నిత్యమైన పరమానందైకసత్యంబులున్?

సరసత్వంబున నింకనైన మఱి నీ స్వాంతంబు సుస్థైర్యమై
యరుదౌ దేవకృపారసంబు గలుగన్ హర్షించి సద్ధర్మసం
చరనిష్ఠావ్రతమందు నిల్పవలెరా సద్గత్యభీష్టార్థమై.

ఆ॥ మొనసి మరణమునకు ముందుగాఁ దద్దేవ
కరుణ గైకొనఁగను గార్యమదియు,
నిన్నుఁ గాంచును మఱి నిర్వాహకము సేయ
గాకయున్న నరకశోకివాదు.

# పదియవ వ్యత్యాసము.

## ప్రత్యేక తీర్పుయొక్క భీకరము.

మనుష్యునియొక్క ఆత్మ శరీరమును విడిచి యెడబాసినతక్షణమే నీతిశక్తులయి సకలమునకు అధిపతియగు కర్తయైన దేవుని సముఖమునకు వెళ్లి, తాను జేసిన పాప పుణ్యములగూర్చి నీతి విచారణ చేయబడనును, తీర్పు విధిని వినను నిలువబడును. అట్టి సమయమున, నీతి న్యాయము వగదెంచ వేంచేసి యుండెడువారు, ఆత్మ లోకములో నుండునపుడు వానికి జేసిన యుపకారములన్ని ఒక్కొకటిగా తెలియపరచి ఆ యుపకారములన్నిటికి ఏ మేలు ఎరిగి నడిచితివి, ఏ తీరు భక్తిగా నుంటివి, ఒక్కొక్కటికి తగిన బదులుత్తరము చెప్పుము, నీకు సంభావనగా మోక్షమును లేక ఆజ్ఞగా నరకము నియ్య తీర్పుచేయ వచ్చియున్నామని అదలించుదురు.

ఓరీ మనుజుడా, ఏమిలేని కాలములో నిన్ను కలిగించి పరమగతియగు మోక్షము జేర, దేవ వరప్రసాదము లనేకములు పాలించితిమి. అందుకు వలసిన కాలమును సుఖమును పరిహారమును బలమును బుద్ధియును ఇవి మొదలైన నానా మేలులను దయచేసి వీటినిగొని పుణ్యపుద్రోవలో నడువ బూనుకొందువని నీకు వేదకల్పనలను కల్పించి యిచ్చితిమి. వీనిని నీవు సులభముగా చెలాయింప ధైర్యమును, మాతృకయును కరుణింప, మేమే భూలోకమున మనుష్యుడై అవతరించి మాయొక్క నడతచే మాతృకయును, వాగ్దత్తముచే ధైర్యమును ప్రసాదించి కడను నీకొరకై పడరాని పాట్లన్నియు

పడి, మా రక్తమునంతయు చింది ప్రాణ మిచ్చితిమి. నీవు పరమగతి జేర మొదటి వాకిలైయుండెడు జ్ఞానస్నానమనెడు మేలును, మరివెనుక నీవు అనుదినము చేసిన ఘోరపాపములు విమోచన మగుటకు పాపసంకీర్తన మనెడు మేలును నీవు సన్మార్గములో స్థిరముగా నిలిచి, నిత్య జీవమును పొంద జ్ఞానభోజనముగా సత్ప్రసాదమును మేలును, ఇవి మొదలగు లెక్క మితములేని యుపకారములు చేసినాముకదా, వీనికన్నిటికి మేలెరిగి, నడిచిన రీతి యేదని యడుగుదురు.

పరమకర్త చేసిన యుపకారముల కన్నిటికి మేలెరిగినవాడై, అధిక భక్తియుంచి లోకమును వర్జించి పుణ్యమార్గములో స్థిరముగా నడిచి జప తప దాన ధర్మముల జేయుచు, పిశాచి తంత్రములలో జిక్కని పుణ్యాత్మయైనది దేవుని యెదుట యేమాత్రము పదరక నిలిచి వారి యొక్క తీర్పు వినును. లేక, పరమకర్త యొక్క మేలులను ఎరుగనిదై వారిని మరచి పిశాచితంత్రములలో చిక్కి పాపములేగాని పుణ్యములను చేయలేదని ఎరిగిన ఆత్మ తన పాపముల అవలక్షణమునుజూచి బుద్ధికలంగి భ్రమజెంది మనస్సు చంచలమై వారి సముఖమున గడగడ వణకుచు నిలుచును. ఎందుకనగా, పాపపు ఆత్మయైనది తన పాపపు మైకమును కనుగొని, నరక పిశాచియొక్క తంత్రములలో బడి దానిని నమ్మికొని దాని కందిన మంత్రములను నేర్చుకొని దబ్బరానలను టక్కుపిక్కులను కొలరోదనలను చాడీకొండెములను ఖండిత క్రోధ మద మాత్సర్యములను, మాతా పితల అక్రమపరచుటయును, దేవతిరునాళ్లను ఆచరింపక తిరిగినదియు, ఒక్కప్రొద్దు ఉపవాస జపధ్యానములను చేయక ఉండినదియు, కోప లోభ మోహాదులు ననుసరించుటయును, ఇవి మొదలైన సకల ఘోర కర్మములలో మరణపర్యంతము స్థిరముగా నుండినదియు, తేటగా కనిపెట్టి శరీర సుఖములను నమ్మి దేవుని దయను ధారబోసికొనినది ఎంతో గొప్ప నష్టమని గ్రహించి దిక్కుతెలియక బుద్ధికలంగి గడ గడ వణకుచు మానమై నిలుచును.

అదిగో ఆ సమయమున పిశాచియైనది అర్భటించుచు పెద్ద పులివలె రొప్పుచు పాపాత్ముని చుట్టుకొని నిలిచి, వాడు చేసిన లెక్క మితములేని పాపములను ఒక్కొకటిగా వర్ణించి వానిపై నేరముమోపి నిత్యాజ్ఞలకు తీర్పువగదెందుమని అడుగుచు పరమకర్త తీర్పు నిచ్చి చేయివశము చేయు పర్యంతము అగ్నిసంకెళ్లను చేతబట్టుకొని బహు ఆశలో కాచుకొని యుండును.

అయ్యో పాపాత్ముడా, ఇప్పుడు కర్తయొక్క నీతి కల్పనలను మరచి వారి ఆద్యంతములులేని కృపాకరములగు మేలుల సముద్రమును కొంచెమైనను ఎంచక తిరిగెదవుగదా? ఆ తరుణములో నీకు దిక్కేది? శరణమేది? నీకిట్లు తటస్థించును అని కొంచెమైనను భయపడక సకల పాపములలో తిరిగెదవు గదా? ఆయిక్కట్టు సమయమున నీకు ఏ యాదరవు చిక్కును? ఓరి పాపీ! అనేక దినములు వనములో వాసమై జప తప ఆదులలో సుకృత క్రియలలో కాలక్షేపముచేసి మహా ఘోర తపోధనులని పేరుపొందిన ఒకరికి సంభవించినది వినలేదా? తెలియ చెప్పెదము వినుము,

ఒక్కనాడు ఆ మునులైనవారు వనములో పరవశులై తమ యాత్మ ఎడబాసినట్టును న్యాయతీర్పు వగదెంచు పరమకర్తయొక్క సముఖమున నిలువబడినట్టును ఏలినవారు తన్నుజూచి నీవు చేసిన కర్మములన్నియు ఏ భక్తి విశ్వాసముల చురుకులో జేసితివని యొక్కొక్కటికి వగ జెప్పుమని అడిగినట్టును చూచినారు. ఆ మునికి ఆ సమయమందువచ్చిన భయమును వణకును మనశ్చాంచల్యమును ఇంతయని తమ క్రియలచే కనబరిచిరి. అదేలాగనగ, పరవశము తీరిన పిమ్మట తాముండుటకు మాత్రము ఒక చిన్న గుడిసెను కట్టించి అందులో దూరుకొని వాకిలిని రాతితో మూయించి తమకు వలసిన అన్నమును నీళ్లను అందుకొనుటకు చిన్నగవాక్షి కంతను విడిపించి, ఆ యంధకారపు గుడిసెలో పంద్రెండేండ్లు పర్యంతము ఒక్కరితో మాటాడక వెలపలికి రాక అందులోనే వాసమైయుండి కఠోర తపస్సుచేసిరి. కడను వారికి మరణము చేరివచ్చెనని వేరే మునులు కనుగొని వారి గుడిసె పగులగొట్టి లోపలికిపోయి వారిని చుట్టుకొని స్వామీ మా కేమయిన మంచిబుద్ధి సెలవియ్యుమని బతిమాలగా వారు వీరలనుజూచి చెప్పిరికదా? నా నేస్తులారా! నేను గనిన ఒక కర్మము మాత్రము చెప్పెదను. మరణ సమయమున పరమకర్త వాడు వాడు నడచిన నడతలు శోధించి అడిగెడు వగను ఖండిత భృగుతరమును చూపెడు ఉగ్రమును ఎంత సముద్రముగానుండునని మనుష్యుడు తెలిసికొనినయెడల ఒకనాటికిని పాపము చేయ మనస్సు ఒప్పడని చెప్పి కుంగి జీవము విడిచెను.

అయ్యో పాతకుడా, వింటివో! ఆ మునికన్న నీవు పుణ్యములో అధికరించినవాడవైయున్నావా? వారన్ని సంవత్సరములు ఘోరతపము చేసినను భయపడి గడగడ వణకినారని వింటివి గదా; ఒక

పుణ్యమునైన చేయ నెరుగని. నీవు కొంచెమైనను భయపడక శరీర సుఖములలో మాత్రము మనస్సుబెట్టి దినములన్నియు గడపెదవుగదా? మరణము చేరివచ్చి జీవము ఎడబాసెడు తరుణములో పరమకర్తకు ఏమి లెక్కజెప్పబోచున్నావు? అని కాలముండగానే తలంచితివంటే నీకు మేలు! లేదా నీకు వచ్చు భయంకరపు తీర్పు ఎట్టిదని కనుగొనుదువు. ఓరి పాపీ! అప్పుడు నీ యాత్మను మాత్రము నరకమున త్రోయుదురు. లోకము ముగియు కాలములోనో యనగ: పరమకర్త, చచ్చిన మనుష్యులందరిని ఆత్మ శరీరములతోకూడ లేపుటవల్ల అట్టివేళను నరకములో పడియుండెడు నీ యాత్మ ముందు విడిచిపెట్టి పోయిన శరీరమునే తిరుగ ధరించుకొని తన పాపాక్రమములకు భాగస్థురాలుగా శరీరముతోకూడ న్యాయతీర్పునకు లోనగును. ఆ భయంకరమైన దినములో దేవుని సముఖమునకు అందరితోకూడ నీవును వెళ్లెదవు. వారు దుష్టుల నందరిని శపించి నరకములో త్రోయునట్టు నిన్నును త్రోసివేయుదురు! అయ్యో పాతకుడా! ఆ గట్టుకానని అగ్ని సముద్రములో పాపాత్ముల కూటముతో పడి మునిగి కాలుచుందు వని భయపడితివంటే, ఇప్పుడే దేవ తీర్పును వేళ వేళకు తలంచి, భయపడి నీ పాపములన్ని వర్జించి పుణ్యమార్గము చేపట్టవలెనని ఎరుగుదువుగాక.

# పదియవ వ్యత్యాసము.

## ప్రత్యేక తీర్పుయొక్క భీకరము.

వ॥ మఱియుఁ బరమానంద తాపసేంద్రుండు నిట్లనియె: నిట్టి దేవకరుణ నీవు గైకొననట్టాయెనా, దురితంబువలన మరించినపిదపఁ బరమ కర్తలు తమ సన్నిధియందుఁ బ్రత్యేకపుతీర్పు నాకర్ణింపఁ జేసినపుడు వారలు నిన్ను నసహ్యించి ఏడి పాతాళ దుర్గంధ నరక దవానలాకూపారగతునిగా నొనరించెదరు గావున నీవు తత్సకార్యంబునందున సుమతిమంతుండవై దేవ కరుణ వడసి పుణ్యమొనరింపవలయు, వినుము,

క॥ మనుజుని యాత్మ శరీరము-విను మెడఁబాసినక్షణంబె వేగంబుగఁ దా
జనుఁ బరమకర్త సముఖం-బునకుం దాఁజేసిన యఘపుణ్యము లరయన్

సీ॥ సకలాధిపతియు నాయకలంక మూర్తియా-పరమకర్తల సన్నిధి రయమునను
దాను జేసిన పాపధర్మంబులఁ బరీక్ష-సేయుటకై చేరి శీఘ్రమునను
నిల్చి యుండఁగ, వాని నేర్పుగా నప్పుడు-గాంచి పరమకర్త లంచితముగ
వానికి జగతిని వసియించినప్పుడు- తారు చేసిన యుపకారములను

తే॥ పేర్మి నొక్కొక్కటియుఁ దెలిపించి తదుప
కారములకేమి మేల్జేయుఁగంగ నడచి
యుండి యేతీరు భక్తిగా నుంటివార
యనుచుఁ బరిశీలనలఁ జేతు రప్పుడు నరుని

క॥ తారొనరించిన మఱియుప-కారములన్నియుఁ దదాత్మకు నెఱుక చేయం
గా రయమున నిమిషములో-నారయఁ దెలిపించెదరు దయారసమొప్పన్

ఉ॥ ఏమిర మానవాధమ మఱేమియు లేనటువంటి కాలమం
దే మును నిన్నుఁ బుట్టనొనరించి, మహోన్నతి నీవు ముక్తికిం
బ్రేమను జేరునందుకు నభీష్టప్రసాదములైన మేల్లనున్
సేమముగాఁగఁ బాలనలఁ జేసితిమేగద యాలకింపరా.

మ॥ బహుకాలంబు సుఖంబు బల్మి పరిణామంబున్ మనీషాది త
ద్విహితంబై తగు మేల్కొసంగి మఱి నీవిచొప్పు వీనిన్ గొనే
మహనీయంబగు పుణ్యమార్గము చరింపం బూని పొమ్మంచు నీ
కిహమందుం ఘన వేదకల్పనలుగా గీర్తింప గల్పించితిన్.

తే॥ ఈ కరణి దుర్గుణములఁ దృణీకరింప,
ధైర్యసాహసములఁ బ్రమోదంబుగ దయ
సేయుటకును మనుజులమై క్షితిని వినుర,
మేమును నవతరించితిమిగద నరుఁడ

మ॥ ధర మచ్ఛర్యలచేత మాతృకను, వాగ్ధత్తాలచే ధైర్యమున్
బరిసాధించి భవన్నిమిత్తము తుదం బాట్లంది, నీవిప్పుడుం
బరమానందగతి స్థలంబునకు సద్భాగ్యంబుగాఁ జేర మే
మరయ న్నీకిటు లెన్నియెన్ని యొనరింపం గల్గెనో మర్త్యుఁడా.

వ॥ అదియునుంగాక నీవు పరమగతిఁ జేరఁ బ్రథమద్వారంబై యుండెడి తదీయజ్ఞా
నస్నానంబను మేలును, బిమ్మట భవద్ఘోర దుష్కర్మాఘ విమోచనంబగు

పాపసంకీర్తన మనెడి మేలును, నీవు సుకృతసన్మార్గంబున బహు స్థిరంబుగా వసించి నిత్యజీవంబునొంద సత్ప్రసాద మనెడి మేలును, నివి మొదలైన యమితంబగు నిత్యంబైన యుపకారంబు లొనరించితిమిగదా, యందుల కంతటికిన్ బ్రత్యుత్తరంబు లేవి యని యమ్మహానుభావులైన పరమకర్తలు మనుష్యాత్మల నొక్కొక్కటి నడిగెద రయ్యవసరంబున.

సీ॥ విను మప్పరమకర్త యొనరించినట్టి త-త్తదుపకారముల కంతటికి మేలు
లెఱిఁగి తద్దేవుపై వరుస భక్తియు నిల్పి,-మాయాప్రపంచ సమంచితమగు
చెల్వము విడనాడి చేరి పుణ్యపథంబు-నందు సుస్థిరముగా నధివసించి
భూనుత జపతపోదాన ధర్మములు త-ద్దయుఁ జేయుచుఁ బిశాచి తంత్రములకు
తే॥ లోనుగానట్టి పుణ్యాత్ముఁడైన యెడలఁ,
గర్త సముఖాన నిల్చి సత్కర్మమైన
తీర్పు నాలించి యమ్మహాదేవు కరుణ
వల్ల నపవర్గమందు నివ్వటిలు నతడు.

వ॥ మఱియుఁ బాపాత్ముల విధంబు వినుము.

సీ॥ పరమకర్తల మేళ్లు నెఱుఁగక తన్మహా-మహుని చిత్తంబులో మఱచి యప్పి
శాచుల దుష్టవిచార తంత్రోపాయ-ములకు లోపడి వాని పలుకు నమ్మి
మఱి వాని కందిన మంత్రము ల్పఠియించి-నేర్చుక పాపియై నీతి మాని
తక్కుపిక్కులు పెక్కు దబ్బఱానలు చాడి-కొండెము కామాది గుణము కలిగి
తే॥ మోహకార్యములో నిచ్చ మునిఁగి యుండు
నట్టి దుష్కర్మి మరణపర్యంత మెల్ల
పాపములను జేసినెడల నప్పుడు పరమ
కర్త సన్నిధి భీతిచేఁ గలఁగి నిలుచుఁ.

క॥ ఆ సమయమునఁ బిశాచియు-వేసారక యార్భటించి పెద్దపులివలె
వాసిగ రొప్పుచు బాపిని-నీసునఁ దగఁ జుట్టుకొనుచు నిట్లని పలుకున్.

శా॥ వీఁడే ఘోర దురంతపాతకి సుధీవిద్వేషి యంచున్ ధరన్
వాడుం జేసిన లెక్కలేని యఘముల్ వాటిల్ల నొండొంటినిం
గూడం బల్మరు మీద మోపి యపుడా ఘోరాజ్ఞ లిమ్మంచు మా
వాడున్ బాధలిడంగఁ దీర్పు నడుగుం ధాటి న్పిశాచు ల్వడిన్.

వ॥ ఇటు లప్పిశాచులు దురంతపాతకుని దత్పరమకర్త తీర్పు నొసంగి, కైవసంబు చే యుపర్యంతంబు, సంకెళులం జేతులం బట్టుకొని యుత్కృష్ట భయంకర భీకరంబుగాఁ గాచికొనియుండు నాకర్ణింపుము.

చ॥ మనుజుఁడ చెప్పెదన్ వినుర మానుగ నిప్పుడు మర్త్యులెల్లఁ నా
ఘన గురుఁడౌ మహామహుని కర్తసునీతుల వేదకల్పనల్
మనమున సంస్మరింపకయు మాయలఁ జిక్కి యెఱుఁగలేక యా
యనఘుఁ గృపారసాంబుధిని నారయ రెంచరు పాపులై ధరన్.

క॥ ఇటువంటి పాపి నరులకుఁ-బటుఘోరంబైన నరకపాతాళములో
నటు కడు బాధలు పడ నం-దెడు తీర్పునొసంగు వేళ దిక్కెవ్వరయా

తే॥ అట్టి యిక్కట్టు సమయాన నాదరవు ని
ది యది యంచును జెప్పునదింక నెవరు
పెద్దకాలంబు నడవిలోఁ బెక్కుతపముఁ
జేయువారికి గతి విను జెప్పెదనుర

సీ॥ ఒక మునిపుంగవుండొక కాననంబులో-నివసించి బహు తపం బవిరళముగ
నొనరించుచుండ, నొండొకనాఁడు తన యాత్మ-మే యెడబాసి నిమేషమునను
బరమ కర్తలముఁ బరఁగ నిలిచినట్లు-పుడమి నీవొనరించిన పుణ్యమెద్ది
యే భక్తి విశ్వాసమెవ్వారిని గుఱించి-కాపించితి వంటంచుఁ గ్రమముతోడ

తే॥ నొక్కొకటి వేరు.పడగను నొనరఁ జెప్పు
మనుట విని తాపసుండేమి యాడుదునని
చంచలత్వంబున నదరి యంచితముగఁ
జెప్పఁ జాలకయు నిలిచె నొప్పిదముగ.

వ॥ ఇవ్విధంబున నమ్ముని తపంబు చేయుచున్న కొన్నాళ్లకు నిత్తైఱంగునఁ జిత్తంబు నకుం గల గాంచిన నపుడు నదరి బెదరి తనకు మరణకాలంబు సమీపంబాయెనని చింతింపుచున్నతఱి.

చ॥ తనకు నివాసమైన యసదైన కుటీరము, దాని వాకిలెం
తన నొకబాయి మూఁత, మఱిదానికి నన్నజలంబు లందుకో
ననఁగ గవాక్ష మొక్కటి, ఘనంబుగ నట్టి కుటీరమందులో
నెనసిన యంధకారమున నిల్చుకొనేక మఱుమాటలేమియై

తే॥ వెలుపలికి రాక యెవరితోఁ బలుకులేక
యందు వసియించి యుండినవంతట కడ
సారి తనకటు మరణంబు చేరివచ్చు
ట వినిన విధంబు దెలిసిరి డాయ మునులు

క॥ మునులిటుఁ దెలిసి బిడానం-జను దెంచి కుటీరమంత సరగఁ బగుల్చఁ గొ
ట్టినఁ నేర్పుతోన జేరియు-జననుత మా కొకటి బుద్ధి దనఁ దెల్పుమనన్.

ఉ॥ అప్పుడు వారలం గని నయంబుగ నిట్లనె, నేస్తులార నే
నిప్పుడు గంటి కర్మ మొకటెట్లనఁ జెప్పెద నాలకింపుఁడీ,
తెప్పున నంచు నమ్మునిసుధీవరుఁ డాడఁదొణంగె నల్లతీ
రొప్పుగఁ దాను గన్నది నిరూఢిగ వీనులపండుగా గతిన్.

క॥ మరణం బందినపిమ్మట-నరులకు మఱి వారి వారి నడకల విధమే
పరిశోధించుచు నడిగెడు-తెఱఁగంతయుఁ జెప్పెను ముని స్థిరతరఫణితిన్

వ॥ ఇవ్విధమ్మున నమ్మునిపుంగవుండు స్వకీయాలాపంబెల్ల వ్యథాకలాపంబుగా బ్రలాపించుచందంబునం జెప్పి యిత్తెఱంగు నరుండైనవానికిఁ జిత్తంబునం బొడ చూపెనేని పాపానకు మనంబు నొపదని ముని జనంబులెల్లం గనుంగొనఁ దత్క్షణంబున మునివర్యుండు గ్రుంగి వాపడి జీవంబు విడిచె వినుము.

తే॥ అన్ని సంవత్సరంబు లనట్టి ఘోర
తపము సేసిన మునికా విధముఁ గలిగెను.
నరుల కేమట్టుకును బుద్ధినాస్తియయ్యెఁ
బుణ్యమొనరింప రయయో కుబుద్ధులగుచు.

తే॥ మరణ మందినపిమ్మటఁ బరమకర్త
సన్నిధికిఁ జేరినప్పు డే సతతమైన
తీర్పు పొందగా లెక్క యే తీరున మఱి
పలికెదరు మానవులు నిట్టి పంకములకు

క॥ కాలము వృథా యొనర్పక-పోలఁగ సుజ్ఞానమునను బుణ్యంబెల్లన్
వాలాయము సేయగ రా-దేలా, దురితంబుసేయ నెద్దరి పిదపన్.

క॥ నరులార వింటిరొకద-కరుణన్ బోధార్థి నరునకతి నయవినయ
స్థిర ప్రీతి నమ్మహాత్ముఁడు-వరుసగ నిట్లనియెఁ బిదప వాంఛదలిర్పన్.

# పదునొకండవ వ్యాఖ్యానము.

## పాత్తుతీర్పుయొక్క వగ.

సమస్త మానవులను ప్రతిపాలించెడు కారణదివ్యపరమసద్గురువును, అనంత నీతిపరులును, సుతుడైన సర్వేశ్వరుడును అయ్యెడు జేసునాధుడు తాము పరిపాలనము చేసిన మనుష్యులలో మోక్షము పొందినవారెవ్వరనియు తాము పాటుపడిన కష్టముల ఫలములను నిందించి ద్రోహులైపోయి నరకమునపడిన వారెవ్వరనియు తెలియపరచుదురు. అందుకై చచ్చిన వారలందరిని ఆత్మ శరీరములతో లేపి, వారు వారు చేసిన కర్మములకు తగిన తీర్పు ఎట్టిదనియు, కొందరికి సంభావనగా మోక్షమును కొందరికి నిత్య వేదనయగు నరకమును ఏ న్యాయముతో పాలించిరనియు, సకల మానవులు ఎరుగునట్లు ఒక కాలమును నియమించి యున్నారు. ఆ కాలమునకు పేరేమననగ, సర్వసంహారకాలమని తెలియగలవాడవు.

అదిగో ఆ కాలమున పరమకర్తయైన జేసునాధుడు సమస్త మానవులు ఎరుగను, చూడను, వినను, వేంచేసివచ్చి తమ తిరువాక్కుచే ఆనతిచ్చెడి వాక్యమేమనగ: "చచ్చినవారలారా! జీవంతులై లేచి తీర్పునకు రండి" అని పలుకుదురు.

ఇదిగో యీ మహా బలత్కారమైన వచనము వెళ్లినతోడనే చచ్చినవారలందరును ముందరి శరీరములనే తిరిగి ఎత్తుకొని, జీవంతులై లేచి, న్యాయ తీర్పును విన, కర్తయొక్క పాదములకడ వచ్చి నిలుచుదురు. అయితే అట్టి లోకాంత్యకాలము ఏ సంవత్సరమో, ఏ నెలో, ఏ దినమో యని న్యాయతీర్పు దీర్చెడు పరమకర్తకు మాత్రమే తెలియునుగాని మరి యొకరికి తెలియదు. ఆకాలము చేరివచ్చునపుడు కలిగెడు గురుతులును నడిచెడి క్రమములును ఎటువంటివని వేదవాక్యములలో చదివి ఎరుగవచ్చును.

అదేటువలెననగ, సూర్యుని యొక్క ప్రకాశము మరుగైపోవును, చంద్రుడు రక్తవర్ణమై తోచును, గగన నక్షత్రములు వృక్షములయొక్క ఆకులు ఘోరమగు గాలికి రాలిపడినట్లు రాలిపడును. చర్మము సుగ్గినట్లుగా గగనము సుగ్గును. భూమియు బహుగా వణకును. అట్టి భూకం

పములో దీవులును, పర్వతములును మిట్టిమిట్టిపడి యుప్పులై, పాతాళమున దొర్లుకొనిపోవును. మనుష్యులలోనంటే, తమలోతాము ఒకరొకరిపై మహా క్రూరనిష్ఠురులై వక్రించుకొని యుండునదిగాక కఠిన రాజీకములును ముక్కుడి ఘోర రోగములును చావులును కలిగి బహు గందరగోళము నిష్ఠుర కష్టములు కలుగును. కడన గగనమునుండి యగ్నివాన కురిసి సర్వ లోకమాద్యంతమును కాల్చి భస్మీకరించును. ఇదిగో ఇవే లోకసంహారమున కందిన గురుతులు అని ఎరుగగలవాడవు!

పృధివి, అప్పు, వాయువు, ఆకాశమనెడు నాలుగు భూతములను మనుష్యుడు గొనియుండుటవలన శాస్త్రులు మనుష్యులను చిన్న లోకమని చెప్పుచున్నారు. ఈ చిన్న లోకమనెడు మనుష్యునికి అంత్యకాలము చేరివచ్చునపుడు వాని యందుండెడు నాలుగు భూతములును క్రమముతప్పి ఒకటికొకటి వక్రించి క్రిందిట్లు మీదిట్లయి మనుష్యుని తొందరపరిచి బహు చక్కదనముతో చెల్లాడెడు మనుష్యుని కొంతసేపులో కదలని కట్టెవలె చేయును. ఇదిగో అట్టి మరణ సమయమున రెండు కన్నులు పంబరేగి, చెవులు [illegible] నాలుకఎండి, చేతులు కాళ్లు [illegible] ఉబ్బి, రొమ్ము ఎగదట్టుకొని, గళిమారి, ఉసురుడిగి, జీవముబాసి, దుర్గంధ శవమగును. అలాగుననే యీ పెద్దలోకము ముగియుకాలములోను పరమకర్త యిపుడు ఒక తూకముగానుండ జెప్పి కట్టడ జేసి యుండెడు క్రమము దప్పి ముందర జెప్పబడ్డ భయంకరమయిన గురుతులు పరమకర్త లోకమును వగదెంచుకాలమునకు ముందుగా సంభవించును.

అలాగుననే, లోకమంతయు అగ్ని అంటుకొని భస్మముచేయుచుండగా లోకమునకు న్యాయము వగదెంచు పరమకర్త జేసునాథస్వామి జ్యోతిర్మయమైన ఒక మేఘ భద్రాసనముపై మహా మహిమతో కూర్చుండుకొని, ఒలివెత్తు అను పర్వతము మీదికి దిగివత్తురు. వారు పరమండలమునుండి దిగి వచ్చునప్పుడు అందుగల తొమ్మిదివిలాస సన్మనస్కులు ఆయావిలాస సభలకు ఒప్పిన మహారూపలావణ్యములతో, పరమకర్తకు సేనుకముందు పరివారముగా చేరుకొని ప్రతాపములో రాగా, వారు సర్వలోకమును ప్రతిపాలించిన బిరుదుగా, స్లీవ నిశానిని వారిముందుగా ఎత్తుకొని, జేజేజయమని స్తుతులు మహానంద సంగీతములతో బోరుకొల్పగా, దిగి వచ్చెదరు. పరలోకభూలోకములకు రాజ్ఞియు సన్మనస్కులకు రాజ్ఞియు పాపులకు శరణము

ను అయియుండెడు నిత్య కన్యస్త్రీయైన దేవమాత సువర్ణ రత్నఖచితమైన సింహాసనముపై గూర్చుండుకొని తమ తిరుకుమారుని కుడిపార్శ్వముననుండగా, పరమకర్తతోకూడ యీ లోకములో సంచారముచేసి వారు కలిగించిన సత్యవేదమును, వారుచేసిన అద్భుతములును, లోకము రక్షించ వారుపడిన శ్రమలును, సర్వలోకమునకు తెలిపి, తాము చాటించెడు వేదము నిజమని, తమప్రాణమునే ధారబోసిన పండ్రెండుమంది అపోస్తులును ఒక్కొక్కరు మహా రాజులకు యోగ్యమైన వైభవములతోకూడ, న్యాయకర్తయొక్క ఈ తట్టున ఆతట్టున కూర్చుండి యుందురు.

ఇట్టి సమయమున సమస్త మోక్షవాసులయొక్క ఆత్మలు బహుదినములుగా చెడిపోయి యుండిన తమ శరీరములను తిరుగ ధరించుకొని తమకుగల అక్షయసూక్ష్మలఘు ప్రకాశములనెడు నాలుగు వరములు శరీరములలోను పొందినవారలై, మహా సౌందర్యముతో జీవంతులై న్యాయకర్తయొక్క కుడిపార్శ్వమునకు వచ్చి నిలుతురు:—దుర్గంధనరకములో బడియున్న ఆత్మలును తమ అవలక్షణ దుర్గంధ శరీరములను ధరించుకొని వచ్చి నరకముయొక్క కఠోరబాధలన్ని తాము ఎత్తిన శరీరములలోనే అనుభవింపుచు జెప్ప తరముగాని బాధలతో జీవంతులై లేచి, తీర్పును వగదెంచు పరమ కర్తయొక్క ఎడమ పార్శ్వమునకు జోసఫాత్తను కొండ కనములో పిశాచులచే ఈడ్వబడుదురు.

అదిగో అట్టివేళను పరమ కర్తయొక్క శోభన ప్రతాప సౌందర్యరూపలావణ్యసముఖమును అతివినోదశోభనములో నేలినవారి కుడిపార్శ్వముననుండెడు నవవిలాససభ సన్మనస్కులును మోక్షవాసులును పొందియుండు మహిమ ప్రతాపమును, వారు మహారాజులవలె సుఖించి యుండుటయును పైన చెప్పబడిన పాపాత్ములు గని ముఖము చిన్నచేసికొని అయ్యయ్యో! వీరలకు సరిగా మేమును పుణ్యమార్గములో వేదకల్పనల చొప్పున నడిచియుంటిమేని వీరలతోగూడ మహిమగల వారలముగా నుండవచ్చునే! ఇదిగో సకల ఘోరకర్మముల మార్గమున నడిచినందువల్ల గదా, యీ యాజ్ఞ సిద్ధించెను, ఇప్పుడు ఈ బాధలన్ని పడెదము. అయ్యో, వీరలనే గదా మేము పరిహాసముచేసి నిందించితిమి. ఇపుడు వీరలు పరమ కర్తయొక్క చనువరులై, మహా రాజులుగా ఎన్నటెన్నటికిని కుశలమై యుందురని కొంచెమైన సందేహములేక కంటిమి. అయ్యో, మేము గదా మతిచెడ్డ వారలుగా నడచి

సత్య మార్గము జారితిమి! మేముగదా సుమార్గము తప్పి, గతి దెలియని వారలవలె పాపపుద్రోవలో ఇష్టానుసారముగ నడచి అలసితిమి, మేము అహంకారముతో పొంగి కామభోగములలో సుఖించి నడచినందుకుగదా యీ నరకమే మాకు గతియాయెను. మేము అనుభవించిన సుఖము చెల్వము భోగములన్నియు, నీడపోయినట్టు వ్యర్థమాయనై పోయెను. ఈ సమయమున ధర్మము యొక్క ఆదరవు కానమే! ఇక మాకు దిక్కేమి యని చెప్పి పండ్లు పటపటమని కొరుకుచు, శరీరము వణకుచు, మనస్సుమండి, భయముచే వ్యాకులపడి, అయ్యయ్యో, మన తప్పుచేతనే పరమగతి పోగొట్టుకొంటిమని యేడ్చి మొత్తుకొని తీర్పు అయ్యెడిపర్యంతము పదరుచు కాచుకొనియుందురు.

# పదునొకండవ వ్యత్యాసము.

## పాత్రుతీర్పుయొక్క వగ.

వ॥ అవధరింపుము, పరమానంద మహాత్ముండు బోధార్థి మానవునకు, కేవల మోక్ష
రాజ్యానుభవంబు నొందువం దలంచి యిట్లనియె.

సీ॥ ఏతత్సుకాలమందే న్యాయమున దత్పు-రమకర్త లొనరింప నమరునట్టి
క్రమ మాచరించి తత్కరుణ సంపాదించి-కొని తీర్పువేళల కొనర సుకృతి
నైయున్న; లోకాంత్యమందు మర్త్యుల నంద-ఱని యాత్మలం దచ్ఛరీరములను
గూడఁగా దమవెంటఁ దోడుక దమ సము-ఖానకు రాఁజేసి యరుగు వేళఁ

తే॥ బరమకర్తలు వీక్షించి పరమపుణ్యుఁ
డైనవానిని గైవల్యమందఁ జేసి
తీర్పులోఁ గల్మషాత్ముల గర్వ మణఁగ
నరకమందఁగ నటు చేసెదరు బిఱాన.

క॥ ఇది గుఱ్ఱెఱిగి మనుష్యులు-మది సుజ్ఞానంబు నిల్పి మతిమంతులునై
తుదఁ గైవల్యము నొందగ-ముదమగును వినుర మనుష్య ముగిసెడి జగతిన్.

సీ॥ కర్త బహుళీముగ కష్టములను బాటు-పడఁగఁ బొందిన జ్ఞానఫలములటులు

నిందించి ద్రోహులై నీతిమాని దురాత్ములై ఘోర నరకానలాంబురాశి
యందు నాజ్ఞలఁ జెందునట్టి వారెవ్వార-గుదురో ఈ భూమి నిక్కవఁగఁ జేయు
కర్మంబులకు నెట్టి ధర్మ తీర్పొయటంచు-సకల మానవులకు సరగ నిట్లు
తే॥ తెలియఁ జేయుటకై ధరిత్రీతలంబు
పొగడ నుతికెక్కు యొకకాల మొనరు నాఁట
తారు వత్తురు భూమికి దైవకర్త
పరమగురు జేసునాథుండు భవ్యగుణుఁడు.
తే॥ అట్టికాలంబునకు నామమెట్టు లనిన
సర్వసంహారకాలంబు చాలునదియె
యప్పు గారణసద్గురువైన జేసు
నాథుఁడు సమస్త లోకైకనాథుఁ డనఁగ.
వ॥ తన్మహావహ్నిం డఖిలమానవు లెఱుంగఁగా నవలోకింపఁగా నాకర్ణింపఁగా
నేగుదెంచి క్రమ్మఱం దత్సర్వసంహార కాలాంతంబున మృతులైయున్న వార
లనెల్ల స్వకీయ తిరు వాఙ్ముఖంబున: "నో మృతులార, జీవంతులై తీర్పుకు
రండనిన," నా మహాద్భుతాశ్చర్యమైన తిరువాక్కు వారి ముఖవారిజంబున వెలు
వడినతోడనే మృతులైనవారలెల్ల శవంబులై యున్న నిజ శరీరంబులను దా
ల్చుకొని బిఠాన చనుదెంచి తీర్పు నాలకించుటకై యప్పరమ గురుపాద రా
జీవయుగ సన్నిధానంబున నిలిచెద రాలింపుము.
క॥ కావునఁదల్లోకాంత్యం-బా వేళ నెఱుంగఁగూడ దది యెపుడగునో
యేవత్సర మే మాసమొ-యే వాసరమో ధరిత్రి నెఱుఁగ నవశమే.
వ॥ మఱియు లోకత్రయ జనన స్థితి మోపసంహారకుఁడైన పరమకర్త యెఱుంగు.
క॥ వినురా మనుజుఁడ మఱి ద-ద్దిన మేతెంచెడి తదీయ దిష్టమునందుం
గనుపట్టు క్రమములెట్లన-ననియెద వేదార్థమందు నాడిన కరణిన్
సీ॥ గాములకేని ప్రకాశంబు మాటొను-వనజారి శోణిత వర్ణమాను,
సాలపుటాకులు రాలిన చందమఁ-దారలెల్లఁ బడును ధరణి నప్పుడు, జ
త్రుంగును లోకము, గగనంబును బడును-కిటకిటం పటపటనిక్కట్టు మనుచు,
నాక్కొక్కొ టొర్సుక యుర్వీధ్రముల్ వ్రక్కలై మిట్టిపడి దొర్లి యల్ల విపుల
తే॥ మైన పాతాళమునఁ బడు నపుడె, దహన

వృష్టి తెప్పునఁ గురియు నికృష్టముగను
సాకలిత లోకమత్యంత మేకముగను
గాలనగు సర్వసంహారకాలమందు

తే॥ ఇట్టి చిత్రవిచిత్రములెల్లఁ గల్గు
సర్వసంహార కాలప్రసక్తమందు
గుఱుతు లివి యని నరు లెఱుఁగుదురు మదిని
వింటివటరా మనుష్యుఁడ వీనులలర

సీ॥ జ్యోతిర్మయాకార నేతయై యొక మేఘ-భద్రాసనంబున భాసురముగ
మహనీయమహిమతో వహిమీఱఁ గూర్చుండి-తన చుట్టుఁ బరివేష్టితమగునట్టి
పరమండలంబునఁ బరఁగు తన్నవ సభా-లలితవత్సన్మనస్కులును బిరుదు
గా ఛత్ర చామర కరణము ల్చేఁబూని-జయజయధ్వనులఁ బ్రస్తవము సేయ

తే॥ సరస సాహిత్య సంగీత సరభసములఁ
బొగడి భక్తితోడ నుతింపుచుఁ గొలవంగఁ
బరమ కర్తయయిన జేసుగురువు విశ్వ
పాలన వహించుచుండు నొప్పారుచుండ.

క॥ ఈలాగున పరలోక ధ-రాలోకంబులకు నెల్ల రాజ్ఞి యనంగా
నాలీల దేవమాతయు-బాలామణికన్య యనఁగఁ బరఁగు నుతింపఁ

తే॥ అట్టి కన్యామణియు మరియమ్మ యనఁగ
నిజతిరుకుమారుఁడగు జేసు నేత కరయ
వెలసి దక్షిణపార్శ్వసుస్థల సువర్ణ
సుమణి సింహాసనమునఁ గూర్చుండునంత,

వ॥ అప్పరమ కర్తయైన జేసునాథునితోఁ గూడ తల్లోకంబులోఁ గమనీయాకారుల్లై
సమంచి తానందంబున సంచారంబు చేసి, యతండు గల్పించిన సత్యవేదకల్ప
నలను నద్భుతంబులను లోకము రక్షించఁ బడిన తదీయ పరిశ్రమంబులను ఆదిగా
గల ప్రయోజనంబులను భువనంబునకుం దెల్పి, తారు చాటించెడి వేదంబులు
నిజంబులని ఘనంబుగ స్వకీయ ప్రాణంబులు సమర్పించిన తద్ద్వాదశాపోస్తులు
నొక్కొక్కరు న్యాయకర్తలై పాయక జేసునాథుని సన్నిధి నిలుతురంత.

సీ॥ అపవర్గవాసులౌనట్టి సమస్తమహా-నాత్మలెల్లను బహు నాళ్లనుండి

చెడిపోయియున్నట్టి కడు తమ యొడళ్లు-వడి నెత్తుకొనెడియయ్యెడల మిగుల
సూటిగా నక్షయ సూక్ష్మలఘు ప్రకా-శమనెడి నాల్గువరములు నొంది
సౌందర్యములతోడఁ జక్క-సజీవులై-లేచియు న్యాయ మాలింపఁ బరమ

తే॥ కర్తదక్షిణ పార్శ్వానఁ గ్రమముతోడ
భక్తి సుఖమును సంభ్రమం బలవడంగఁ
గేలుదమ్ముల మోడ్చుక లీలనిట్లు
నెలమి సంప్రీతితో నందు నిలిచియుండ,

తే॥ తదవసరమున నరకపాతాళమందు
బడిన యాత్మలు దుర్గంధమైన నిజశ
రీరములఁ దాల్చుకొని వెతలెల్లఁ బడుచు
నపుడు జీవంతులై వత్తు రరయ నరగ.

తే॥ పరమకర్త శుభప్రతాపసముఖమున
నతి మహా సంభ్రమములచే మతిముదంబు
లై యతనిఁ జుట్టుకొనియున్న యా నవసభి
కులగు మహానీయ సన్మనస్కులనుఁ జూచి,

తరళ॥ పరమ కర్తల దక్షిణంబగు పార్శ్వమందు వసించు న
ప్పరమ భక్తులఁ జూచి తెప్పునఁ బాపులెల్ల నయో యటం
చరయ వారికిసాటి మీఱఁగ జాలపుణ్యము సేయఁగా
నెఱుఁగమైతి మటంచు నేడ్చెద రెంతయు న్మతి వింతగాన్.

క॥ మనమును బుణ్యము చేసిన-మనమును సుఖ మందఁగల్గు మన మీ బాధల్
గననేటికి నయ్యో యీ-ఘనులవలెం బరమ ముక్తి గలుగదు మనకున్.

క॥ మనమెంత యిమ్మహాత్ముల-మన మెంతని పరిహసించి మాటికి నిందిం
చిన వీరి కేమి కొదవ-య్యెను, వీరలు పరమకర్త నెనసిరి పేర్మిన్.

చ॥ గరిమగ వీరలే పరమకర్తల నేస్తము గల్గియు న్మహా
సరసత రాజరాజులన సంస్తుతి కెక్కి శుభంబు పొందఁగాఁ
బరమపదాప్తులై నిలువఁ బ్రాప్తు లటంచు మనంబులోన నే
మెఱుఁగఁగ నేరమైతి మిటు హీనమనుష్యులమైతి మక్కటా.

మ॥ అపుడు న్వీరల నెంత తిట్టితిమయో హాహా యసందేహమై

యిప్పుడుం జూచితి మిచ్చటఁ మనమె ధీహీనంబుగఁ దుష్కృతి
న్విపరీతంబుగ సంచరించితిమిగా విభ్రాంతిచేఁ గామసౌ
ఖ్యపుభోగంబుల నమ్మి చెందితిమి లౌక్యంబైన భాగ్యంబులఁ.

ఆ॥ సత్యమెల్ల వదలి సన్మార్గము నీడి,
గర్వమునను లోకఘనమె నమ్మి
నడచినందు కింత పడరాని పాట్లను
బడఁగవలసె నంచుఁ బరితపించి,

వ॥ ఈప్రకారంబున నరకనివాసులై యుండెడి పాపులు దమలోఁ దాము నాడుకొనుచు నిక్కంబుగా మన మొనర్చిన దుష్కర్మంబైన దురితంబువలన మనకు నరక పాతాళగతి ప్రాప్తంబయ్యెఁగదా యని శోకించుచు వికారంబైన దుశ్చేష్టలు పశువున్నప్పుడు న్యాయమార్గంబుచొప్పునఁ దీర్పయ్యెడి పర్యంతంబు నప్పరమకర్తల వామభాగంబున నుండెదరంత.

# పండ్రెండవ వ్యత్యాసము.

## పొత్తుతీర్పు వగడెంచుట.

సర్వమునకును శక్తిపరులును, పరమకర్తలును, ప్రతివాడు నడచిన రీతికి తగ్గట్టు సమస్తులకు ఆజ్ఞగాని, సంభావనగాని ఇచ్చువారును, నీతి న్యాయము తీర్పు వేంచేసి వచ్చువారునైన జేసునాధస్వామియొక్క తిరుసన్నిధానమందు మందర చెప్పినలాగున వచ్చినవారలందరు జీవంతులై తమ తమ పాప పుణ్యములకు తగ్గ ఆజ్ఞయైనను, సంభావనయైనను, పొందవచ్చుదురు. అట్టి పరమ కర్తయైనవారు తను కుడిపార్శ్వమున నుండెడు పుణ్యాత్ములు మరణ పర్యంతము దాన ధర్మోపకారములలోను, దైన్యము, తాళిమి, జపతపాదులలోను, విశ్వాస భక్తి నమ్మికములలోను, విరక్తత్వశ్రవణ ధర్మాదులలోను, స్థిరముగా నడిచి, లోకము, పిశాచి, శరీరము నెడి మూడు శత్రువులయొక్క మహా వధులలో చిక్కుకొనక స్వామి చిత్తమునకు సరిగా నడిచినందువల్ల నిత్యమోక్షమే సంభావ

వగా నిచ్చెదమనియు తమయొక్క ఎడమపార్శ్వమున నుండెడు దురాత్ములు వేదకల్పనలను మీరి అజ్ఞానులై, పతితులై, దొంగతనము, అహంకారము, కోప లోభ మోహ మద మాత్సర్యములు, భోజనప్రియము సోమరితనములు వీటికి గులాములై, దుర్మనః పిశాచులను నమ్మి వానికి పొందిన మంత్ర తంత్రోపదేశములు, పిల్లి శూన్యములు మాయజాలములు ఇవి మొదలగు మహా పాపకర్మములలో మరణపర్యంతము నడిచినందువల్ల వారలకు ఆజ్ఞగా నిత్యనరకమే విధించెదమనియు, ఇట్లు ఒక్కొక్కడు చేసిన పాపపుణ్యములను ఒక తృణమైన మరుగులేక సకల జనులకు బహు తేటగా తెలిపిన మీదట న్యాయములో తీర్పు నిచ్చెదరు.

అంతట తమ కుడిపార్శ్వమున నుండెడు ముక్తులను ఘన సంతోష ప్రేమ నిండిన దివ్య దయ వెలిగెడు కరుణా సముద్రముఖములో జూచి, మా పితచే ఆశీర్వదింపబడిన భాగ్యవంతులారా, లోకారంభమునుండి మీకై యుంచి యుండెడు మోక్షరాజ్య మనుభవించి కుశలులై యుండ రండి యందురు. ఆ వెనుక తమ ఎడమపార్శ్వమున గడ గడ వణకుచు, నిలుచుకొనియుండు పాపాత్ములను మిక్కిలి కోపముగల ముఖములో ఉరిమి చూచుచు, ఉరు మురిమి పిడుగుపడిన లాగు వగదెంచు భయంకర తీర్పు ఏమనగా: ఓరీ నిర్భాగ్యులారా, నన్ను నిరాకరించి, పిశాచుల నమ్మి, వాని మాయలలో దగిలి మీ యిచ్ఛచొప్పున నడిచితిరికదా, ఇదిగో వానికిని, వానిని నమ్మిన పాపాత్ములకును, కలిగించియుండెడి నిత్యాగ్నిలోనికి పొండి యని శపించి అందరిని ఏక కూటముగా నరకములో త్రోయుదురు.

పరమకర్త యీ భయంకరమైన తీర్పు వినిపించినతోడనే, భూమి యదరి గడ గడ వణకి, నేల చీలి, ఘోర పాతాళముగ నోరు తెరవగా, ఆ త్రోవగా పిశాచులును, పాపాత్ములును చుట్టుకొని దొర్లి పడి ఆరని యగ్నిసముద్ర నరకములో బడి మునిగి యేకాలమునకైన బైటికి వెళ్లజాలక, పడినపాటై, ఆరక తీరక మండెదరు. ఈలాగు పాపాత్ములందరు పిశాచులతోకూడ దుర్గంధ నరకమున బడినతోడనే పరమండలమును భూమండలమును కర్తయొక్క తిరుకట్టడ చొప్పున మహా శృంగారాలంకృత రూపలావణ్యమై మారి నవలోకమువలె నిష్కళంక పవిత్రముగా తోచి సూర్యప్రకాశముగా వెలుగును. అంతట న్యాయమును వగదెంచ వచ్చిన పరమకర్తయైనవారు తమ్మును చుట్టుకొని పరివారమైయుండెడు అగణిత సన్మనస్కులను పుణ్యా

త్ముల‌ను వెంటగూర్చుకొని జయశీలప్రతాపములతో ఒడ్డోలగముగా జేజేయను స్తుతి పొగడింపులతో మోక్షరాజ్యమునకు తర్లి పుణ్యాత్ములకు నియమింపబడిన చెడని భాగ్యము నియ్య్య పరలోకము జేరి అందు అంత్యములేని భాగ్యములను సంభావనగా నిచ్చెదరు, ఆ మోక్ష రాజ్యములో ముక్తులకు కలుగు ఆనంద మహిమ ప్రతాపపు వరుసలేలాగని వర్ణించి చెప్ప తత్తళించినను వచ్చెడు వ్యత్యాసములో సాధ్యమైనంతవరకు చెప్పి చూపుదుము.

ఇదిగో బుద్ధిమంతులైన వారలు ఇప్పుడు చెప్పబడ్డ రెండు తీర్పులలో, తమకొకటి తప్పక సిద్ధించునని యెరిగి ఆ రెంటిలో తమకేది మేలోయని కాలముండగానే విచారించి యీ దినమే రెంటిలో నొకటి తెలిసికొనవలసియున్నది. మోక్షము కావలయునంటే యీ స్వల్పముగా బ్రతుకు కాలములో ప్రపంచమును నమ్మి వ్యర్థముగా గడపక ధర్మమార్గమును పట్టి సన్మార్గములో నడవవలెను. అందుకై పొత్తుతీర్పును అప్పటప్పటికి తలంచుట మహా ప్రయోజనముగా నుండును. ఇందుకు దృష్టాంతముగా అజ్ఞాని రాజైన వాడొకడు, సత్యవేదస్థులును చిత్తరువుపనిలో బహు నెలవరియునై యున్న ఒక మునిని రప్పించి ఒక పటములో భయంకరమైన చిత్రమును వ్రాసికొని రండి యనెను. ఆ మునియైనవారు పొత్తుతీర్పుయొక్క భయంకర విశేషములను బహు తేటగా వ్రాసి రాజున కందించి దాని వివరమును తేటగా వినిపించి చూపగానే ఆ రాజు ఆ పటమును చూచి దాని వివరమును విని మనస్సు తత్తళించి పదరుకొని ఇటువంటి భయంకరమైన తీర్పునకు తప్పించుకొని పొయ్యెడు తెరువేదని యడిగెను. అందుకు మునియైనవారు దబ్బర దుర్మతములను విడిచి నిజమైన యేక దేవుని ఆరాధించి వారి కల్పనల చొప్పున మరణపర్యంతము నడిచితిరేని ఆ తీర్పులో భయపడక యుండవచ్చునని. ఆ మునులు చెప్పిన సద్బుద్ధిచొప్పున రాజు తన దబ్బర దేవతలను విడిచి సత్యవేదమును చేకొనెను.

హా ఓరి పాతకుడా! పొత్తుతీర్పుయొక్క వర్ణింపు విని భయపడుచున్నావా! లేదంటే నిజమును మరచిన మూఢుడై పోతివా? లేక అది యంతయు వట్టిదని నాస్తికుడై యున్నావా? అట్టి భయంకర తీర్పులో నాకేమి భయమని దృఢస్థుడైతివో? అయ్యయ్యో మూఢాత్మా ఘోరతపము చేసిన వనవాసులు సహా దానిని తలంచి వణకి కృశించిన దెరుగవా? ఓరి పాపాత్ముడా! విశ్వాసము కలవాడవై యీ భయంకర తీర్పునకు భయ

పడకయుండ ఆశించితివేని ఇప్పుడే యీ మంచి కాలములోనే నీ పాపముల న్నియు మట్టుకట్టి దేవ కల్పనలచొప్పున నడచి ఆ తీర్పులో ఆదరువై యుండెదు సుకృత మార్గము పట్టి పరిశుద్ధుండవై నడవవలెనని ఎరుగుదువుగాక.

# పండ్రెండవ వ్యత్యాసము.

## పొత్తుతీర్పు వగదెంచుట.

వ॥ అవధరింపుము. పరమానంద తాపసేంద్రుండు నత్యంత కృపాపాంగ నిరీక్షంబుల భోధార్థులైన మానవులకు పొత్తుతీర్పు వివరించి యిట్లనియె:

### దండకవృత్తము.

శ్రీమన్మహా నీతి సన్మార్గచర్యన్ శివశ్రేయసాధీశులౌ జేసు
నాథాహ్వయుస్వామి లమ్మేఘు సింహాసనాసీనులై న్యాయమార్గంబు
చొప్పెప్పుచుండన్, మృతింబొందువారెల్ల జీవంబుతో లేచి యేతెంచి
యు, న్మన్మదీయాఘు పుణ్యాలకైనట్టి తీర్పాజ్ఞ సంభావన ల్వేగి
రం బీవయా యంచు నెంతో వగందీర్పుకై కాచియున్నంతఁ, దారెంత
యుం గూలుపర్యంతమున్ దానధర్మోపకారక్ష మాసత్యవేద క్రి
యాభక్తి సన్మార్గ చర్యా క్రమంబుల్ మది న్నమ్మి నెమ్మిన్ స్వకార్యంబు
లెల్లం దిరున్యాయచిత్తానకున్ సమ్మదం బొప్పఁగా మెప్పుగా సంచ
రింపం, బ్రమోదంబుచే నంతటన్ వారి కెల్లం దగన్ ముక్తి సంభావ
నల్ ఖ్యాతిగా నీయఁగా బూని; తారెంతయుం జేరి జారత్వ చోరత్వ
కార్యంబుల న్నిల్గుపర్యంత మజ్ఞానులై యొందు నిచ్ఛావిహారంబు
గా నిచ్చలుం గోరి కామాది తత్షడ్గుణా ల్మాటితో వీటుపాటొంది
దుశ్చేష్టలన్మీటి దుర్మార్గ చేతః పిశాచంబుల న్నమ్మి దుస్తంత్ర
దుర్యంత్ర దుర్మంత్రము ల్వానిచే నేర్చి మార్జాల శున్యాదిమాయల్ మ
హా పాపకర్మంబు లీరీతి గావించి యన్యాయులై వారికిం గ్రూర
మానాజ్ఞలీఁ బూని; యొక్కొక్కఁడుం బెక్కుగాఁ జేయు నప్పాపపుణ్యాలు

మాకేమియుం బెట్ట కాసర్వమర్త్యాళికిం దేటగాఁ దెల్పి యామీఁద
టన్ న్యాయమార్గంబులోఁ దీర్పు గావించుచున్ స్వీయహా దక్షిణాస్థాన
భాగంబు నందుండు పుణ్యాత్ములన్ సత్కృపం జూచి యో సజ్జనశ్రేష్ఠు
లారా జగత్సృష్ట్యారంభ కాలంబునందుండియున్ మీకుఁగా నున్న
నిత్యాపవర్గ స్ఫురద్రాజ్య భోగంబు భోగింపరండా యటంచుం గ
టాక్షించుచు న్వామపార్శ్వంబునందుండు పాపాత్ములం గాంచి యో పాపు
లారా మహాగర్వులై మీరు మమ్మున్ దిరస్కారముం జేసి దుర్మార్గు
లై యప్పిశాచంబుల న్నమ్మి మీయిచ్ఛరీతిం జరింపంగ మీకైన
యన్నిత్య దుర్గంధ ఘోరవ్యథా నారకానాథ దావానలాంభోధి
లోనం బడం ద్రోం డటంచున్ వగం దీర్పు గావించినంతం బిశాచుల్ దు
రంతాఘులంజుట్టి యాభీష్మపాతాళ దుర్నారకాగ్నిం బడంద్రోసి
యెన్నంటికిన్ సద్గతుల్నాస్తియై యుండఁగా మెండుగా ఖండ ఖండంబు
లుం గాఁగఁ బెన్బాధలం బెట్టఁగా బెట్టుగాఁ గొట్టఁగాఁజేసి యామీఁద
టం బాపుల న్నారకాగ్నిం బడం జూచి యా పిమ్మటం దారు నందుండి
వేత్తర్లి యందున్న సంఖ్యాకులౌ సన్మనస్కుల్ మహా పుణ్యవంతుల్ త
గం జుట్టునుం జేరి జేజేయటంచుం గడున్ వేఁడుచుం గొల్వనిత్యాను
మో దోత్సవోత్సాహ లీలాలసత్సంభ్రమం బొప్పఁగా మోక్షరాజ్యంబు
నం జేరి యందుండు నంతంబు లేనట్టి భోగంబులం జాల నిశ్చింత
తోడన్ నిరాటంక మొప్పంగ భోగింతు. రా జేసునాథుండు రక్షించు
నెవ్వారు నీ దండకం బెన్నఁడేనిం బఠింపన్ ధరన్..

క॥ ఏ మట్టుకైన మనుజుఁడు-ధీమంతుండై బిడాన దేవుని దెలియం
బ్రేమన్భక్తిని సుకృతం-బేమరకయ చేయఁ దగదె యిహమం దరయన్

వ॥ ఓరి మానవుఁడ యిందుకొక ప్రశంస వాక్రుచ్చెద వినుము.

సీ॥ ధరఁ బూర్వమం దొక ధరణీపుఁ డజ్ఞాని-యై రాజ్యభోగభాగ్యంబు లనుభ
వించుచో నొకనాఁడు విస్మయంబుగ నొక్క-తాపసేంద్రుఁడు తన స్థానమునకు
నేగుదెంచినఁ జూచి యేమిది చోద్యమో-యని మునిం దాను డాయంగఁ బిలిచి
ప్రేమతోఁ గూర్చుండఁ బెట్టుక యిట్లనె-మునివర్య నాకొక్క ముచ్చటైన

తే॥ చెల్వుమీఱంగఁ జిత్ర విచిత్రములను

మీ చమత్కారచాతురి మెఱయ నొక్క
పటము వ్రాసుక రండు పెంపమర సరగఁ
జూడఁ గన్నులపండుగ చోద్యముగను

క॥ అని నయవినయ విధోక్తుల-జనపతి వచియింపఁ దాపసాగ్రణి మాబా
గని ముదమునఁ జని వ్రాసుక-చను దెంచెను బటమునందుఁ జతురత లెసఁగన్

ఆ॥ పొత్తుతీర్పుకర్మ భూరివిశేషంబు
తేటపడఁగ వ్రాసి తెచ్చినట్టి
పటము రాజునకును బరిశీలనగఁ దెల్పి
చూపినంత రాజు చోద్యమందె.

మ॥ పటముం జూచి విచిత్రమంది ధరణీపాగ్రేసరుం డంత హృ
త్కటమున్ వ్రక్కలునై భయంబొనరి హృత్రాసంబులోఁ బల్కెనిం
కిటులున్ నాకు నిదే గదా గతి యటంచేలాగు నౌనే తరిం
చుటకున్ మానివరేణ్య యానతియవే సూక్తంబు వాటిల్లఁగన్.

ఆ॥ మౌని శేఖర యిటువంటి మహాదుగ్ర
భీషణంబునఁగల తీర్పు లెట్టు తప్పి
పోయెడి తెఱఁగు తెరువు నింపొనర నాకు
నానతీయవె కరుణతో నయముఁ జెంద.

వ॥ అని యనేక విధంబుల నమ్మౌని నతిభక్తితోడం బూజించి కైవారంబులు చేసి
యడిగిన నవ్వసుంధరాజానికి తాపసాగ్రణి యిట్లనియె.

శా॥ భూపాగ్రేసర వింటె దుర్మతములం బోఁగొట్టి సద్భక్తితో
నాపోజ్యోతినిఁ దత్పరాత్పరుని లోకాధ్యక్షు సర్వేశ్వరున్
రేపున్మాపెడఁబాయకే కొలువ నర్థిం గల్గు గైవల్యముం
జూపేప్రొద్దు మనంబులోన నతనిం జూడంగఁ బుణ్యంబగున్.

తే॥ ఇత్తెఱిన్ దేవునర్పించు నింపు వ్రతము
మరణపర్యంత మదియు సమ్మతముగాను
నమ్మి నడచినవానికి నెమ్మితోడ
దీర్పులోపల నిర్భయ స్థిరముగాదె.

క॥ సర్వేశ్వరునిం గొల్చిన-నిర్వాణశుభంబు గల్గు నిరుపమలీలన్

సర్వజగత్పతి కర్తను-నుర్వి న్నమ్మినను బుణ్యమొందుట యరుదే?

వ॥ అనవుడు విని యాద్ధరాజాని కేవల సుజ్ఞానమార్గుండయి మునిహాళి బోధార్థం బులవలనఁ దన్నుఁ దానెఱింగి యమ్మహాత్ముని యుపదేశముచొప్పున సత్య వేదంబుఁ జేకొని మరణకాలపర్యంతంబు తపోనిష్ఠాగరిష్ఠుండై యంత్యంబున మోక్షరాజంబునకుఁ జనియెనంత.

తే॥ నరుడ వింటివా యెటువంటి నరునకైన
సత్యవేదవ్రతముచొప్ప సంచరింప
మోక్షరాజ్యంబు వానికి ముదములోడఁ
గలుగుఁ, దన్మోక్షరాజ్యంబు గరిమ వినుము.



# పదుమూఁడవ వ్యత్యాసము.

మోక్ష వివరము.

ఒక మహాత్ములైనవారు మోక్ష రాజ్యముయొక్క పరమానందమును అందులోగల అనంతశోభన ప్రతాపమును వ్రాసి వర్ణింప వచ్చునని యుండగా, ఒక ఆశ్చర్యకరమైన దర్శనమునుగని శబ్దమును వినిరి. ఆదేమనగ గట్టుకానని సముద్రముయొక్క జలమంత నీచేత ఒక కట్టలో నిలుపకూడునా? లోకమంత నీ యరచేతిలో చేర్చి పెట్టుకొన కూడునా? సూర్యచంద్రనక్షత్రములయొక్క అయనములను నిలిపి తడగట్ట సాధ్యమగునా? ఇదిగో యివి యన్నియు నీచేత

నైనను మోక్షరాజ్యముయొక్క ఘనో వాక్కు కందని నిత్యమైన మేలులను జె ప్పతరము గాదనెడి శబ్దమాయెను. ఇట్లు వారికి ఎరుక చేయబడియుండగా మోక్ష ప్రతాప మహిమలను మరుగులేక వర్ణిం ప వచ్చునని యెంచువారలు గలరా? అయినను వేదప్రమాణములో మోక్ష పెద్దరిక మెంతయని చెప్పియున్నను అది మనుష్యునియొక్క బుద్ధిలో అణగనం దువల్ల అణగినదిమాత్రము పరిపరివిధము లుగా వర్ణించి చెప్పుటచే దానినీడను మాత్రము వివరించి చెప్పుటయగును, గనుక చెప్పినందులోనే మోక్షానంద భా గ్యమంతయు అణగియున్నదని తలంచ వద్దు. ఆ పరమభాగ్యము బుద్ధికిని మన స్సునకును మహా అతిశయించి యున్న దని తలంచుము.

మొట్టమొదట మనకు కనబడు పరమండ లముయొక్క విశేషములను సావధానము తో వినగలవాడవు. సూర్యచంద్ర నక్ష త్రముల పైగా ఉన్నత గగనమైయుండె డు అత్యంత శోభనము నిండిన పరమం డలమే మోక్షరాజ్యమని ఎరుగగలవా డవు. ఆ పరమండల రాజ్యముయొక్క విశాలమును ఉన్నతమును ఎంతయనిన ఇదిగో భూమినుండి దినదినము ఇరువది యైదు ఆమడల దూరము రెండువేల యేండ్లు నడిచిపోతే సూర్యచంద్రులుండె డు గగనముయొక్క పేరుపులుదాటి నక్ష త్రము లుండెడు మండలమునకు చేరవ చ్చును. అక్కడనుండి దినము ఇరువది యైదామడల ద్రోవగా తిరిగి రెండువేల సంవత్సరములు నడచితే నక్షత్రమండల ము దాటవచ్చును. అదిగో ఆయున్నత మునుండి భూమండలమును నెమకి చూచి తే ఒక చిన్నరవగా దోచి తోచనట్టుం డును అనియు, అక్కడినుండి ఒక పెద్ద కొండకు సమానమైన గుండును దొర్లిం చి విడిచితే భూమిమీద పడుటకు తొం బది సం॥లు చెల్లుననియు వేదపారాయ ణులు వ్రాసి యుంచినారు. ఇవ్విధమున నక్షత్ర మండలము దాటి మరి పైగాపో యి, దినము ఇరువదియైదు ఆమడల ద్రో వగా నలువదివేల యేండ్లు పర్యంతము నడచితే ఆనంద మోక్షరాజ్యము బహు దూరము అదిగో కనిపించుచున్నదని చె ప్పవచ్చునుగాని ఇంతదూరములో ను న్నదని చెప్ప సాధ్యముకాదు. ఇదిగో బుద్ధికందని యింత ఉన్నతములో ఘన దర్శన సంతోష దర్శనమయ్యెడి మో క్షరాజ్యమున్నదని ఎరుగుదువుగాక. దా ని యున్నతము కూడినమాత్రము చెప్పి చూపితిమి గాని ఆ రాజ్యముయొక్క విశాలము ఇంతయని కొంత వినుము.

సముద్రములోను, భూమిలోను ఉం డెడు ఇసుకయెంతో అంతయు నొక్క

క్కటిగా నెంచి అందలి రవలన్నియు అన్నిలోకములుగా తలంచుకొనుము. ఇట్లు అగణితంబైన లోకములన్ని ఒకటిగా జేర్చి ఎత్తుకపోయి మోక్షరాజ్యపు విశాలములో పెట్టినట్టయిన నీ అగణితంబులైన లోకముల విశాలమంతయు మోక్షరాజ్యపు విశాలమునకు సరియగునో లేదో యని తోచకయుండునట. ఈలాగు మనోవాక్కులకందని యున్నతమును విశాలమును గొనియుండెడు మోక్షరాజ్యములోనుండెడు నేలయును దానిని జుట్టుకొనియుండెడు పరమండలమును ఎప్పటికిని అలంకారశోభన ప్రభావములో నిండినదియు రత్న దీపములచే అలంకరింపబడినదియు ఘనసంతోష సుగంధ పరిమళములు విసరి పరిమళించునదియు, సకల భాగ్యములు కలదియు, సన్మనస్కులు పాడెడు అత్యంతానంద వినోద సంగీతరాగములు ఎడతెగక వినబడునదియు, ఆద్యంతములులేని జ్యోతిర్మహిమ గల పరమకర్తను ముఖాముఖిగా నిత్యకాలము దర్శించి వారి మట్టులేని ఘన సంతోషమునుగని యుప్పటిల్లెడు భాగ్యస్థలమయినదియునే మోక్షరాజ్యమని చెప్పబడును.

ఇదిగో బుద్ధికందని ఇంత సంతోషానందమునిండి ఇంత దూరభారోన్నత విశాలములు కలిగిన పరమ రాజ్యములో సంచరించు మోక్షవాసులు లఘువను వరమునుకలిగి ఒక క్షణములో ఎక్కడికైనను రానుపోను చలాయించుదురు. ఈ భూలోకములో పరమకర్తయొక్క కల్పనలను అతిక్రమించకయు మీరకయు నడచిన ఆయా పుణ్యాత్ములయొక్క ఆత్మశరీరమును విడిచి యెడబాసినతోడనే ఒక క్షణములో మోక్షరాజ్యము చేరును. లోకముగింపున మోక్షములోనుండెడు ముక్తులీభూలోకములో మునుపు కొనియుండిన శరీరము నెత్తవచ్చి, ఆత్మ శరీరములతో జీవంతులగుదురుగదా? అదిగో వారలెత్తిన శరీరము పరమ భాగ్యము పొందిన ఆత్మతో చేరినమాత్రమున ఆ యాత్మకుగల నాలుగు వరప్రసాదములు ఆ శరీరమునకును వచ్చును. అయినందున ఎత్తిన శరీరమునకు ఒక్కనాటికిని క్షయములేకను వచ్చిపోవుటకు కష్టములేకయు తడలేకయు ప్రకాశ శోభనముచేత సూర్యునివలె ప్రకాశించుకొని యుండడము అక్షయము, లఘువు, సూక్ష్మము, ప్రకాశము అను నాలుగు వరములకు కలిగిన అర్థమని ఎరుగగలవారలు. ఇట్లు ఈ దొడ్డ నాలుగు వరములచే వెలుగు మోక్షవాసులు నిత్యకాలము మోక్షరాజ్యములో కుశలులయి యుండెదరు.

ఇటువంటి శోభనమేలులు నిండియుండెడు మోక్షరాజ్యములో వాసమైయుం

డెడు భాగ్యశాలులయొక్క ఆనంద ప్రభాశోభనాలంకారములను, వీరశూరబల పరాక్రమములను, రత్నములచే ఖచితమైన రాజాంగభద్రాసనములపై కుశలమును, కొదవలేని భాగ్యసుఖానుభవములు అనుభవించు శ్లాఘ్యమును, సుకృత ప్రభలయొక్క యలంకార రమ్యములను, పూర్ణ శాస్త్రముయొక్క ఘనతలను, అక్షయ లఘువు ప్రకాశ సూక్ష్మ విధానములను, మరణపిశాచి కడమ దురితములపై కలిగిన అభయములను, సకలమేలుల సంపత్తులను ఒక్కొక్కరు కొదువలేక పొంది సతతకాలము మహారాజులై ఆనందించుటను వర్ణించి చెప్ప సాధ్యముకాదు. కరుణాసముద్రుడై యుండెడు దేవునియొక్క మితిలేని ఘనసంతోష దర్శనము నెడతెగక నిత్యకాలము చూచుకొని ప్రతాపించుటచే ఎంతయో సంతోషమును ఆనందమును మోక్షవాసులకు కలిగియుండునని వార్తలచే రూపించి చెప్పువారలెవరు? ఎవరివల్లను కానేరదు. అయితే మట్టులేని పరంజ్యోతియైన పరమకర్తయొక్క నిత్యానంద సంతోషమధురదర్శనమును కాంచుసందుచేత, మోక్షవాసులకు నెంత యానందమును భాగ్యమును కలుగునని మన బుద్ధిచే నెంత యోచించినను చెప్పలేము. అందులో శాస్త్రులైనవారలు నానా యుపములచే తెలిపెడు ప్రకార మేమనగ: లోకములోగల ఆశ్చర్య పుష్పములయొక్క రూపలావణ్యమును, రత్నదీపముల ప్రకాశమును, స్వర్ణముయొక్క మిణుకు తళుకులను, చంద్ర సూర్య నక్షత్రముల యొక్క ప్రభాశోభనములను ఇవియన్నియు నొకటిగా గూర్చినయెడల ఆశ్చర్యరూపలావణ్యప్రభాశోభన మగును కదా; ఇదిగో ఈ శోభనమంత మోక్షరాజ్యముయొక్క చిన్న రశ్మియొక్క శోభనమునకు సరిగానుంచినను, సూర్యుని ముందు బొగ్గు నుంచినలాగు నుండుననిరి. అటువంటి రూపలావణ్య శోభన ప్రభలు నిండిన మట్టులేని పరమ కర్తయొక్క ఆనందఘనసంతోష దర్శనముయొక్క మధురమును క్షణముసేపు అనుభవించుటకు నరకముయొక్క కఠోరబాధలన్ని లోకము ముగియు పర్యంతము మంచి మనస్సుతో సహించి యుందునని పిశాచి ఒక ఋషీశ్వరునితో పల్కినది ఎరిగి యున్నాము.

వింటిరో, క్రీస్తువులారా, పరమ కర్తయొక్క ఆనంద దర్శనమును కాసంతసేపు మాత్రము అనుభవించుటకు దుర్గంధ నరకముయొక్క కఠోరములన్నియు లోకము ముగిసెడు పర్యంతము అనుభవింతునని దుర్మనసుగల పిశాచులే చెప్పినయెడల దేవునియొక్క మట్టులేని

ఘనసంతోషదర్శనమును సదా కాలము అనుభవించి ఉప్పటిల్లి కుశలమైయుండుట కుగాను, నీలోకనిష్ఠుర బాధలన్నియు మంచి మనస్సుతో సహించియుండవలెను గదా. హా, పాతకుడా, ఈ మట్టులేని ఘనసంతోష దర్శనమును కొంచెపరియో పాపమును వర్జింప స్వల్పప్రయాసమైన పడనేరవు. వాక్కుకందని ఆ పరమానందము నీ కెందుకనియో సత్యవేదమును చేకొనకయు, వేదకల్పనలను సరిగా ననుసరించకయు నున్నావు. ప్రయాసపడకయే నిత్యభాగ్యము పొందుదుననియో అశ్రద్ధగా నున్నావు. ప్రయాసపడకయే నిత్యభాగ్యము పొందెదననెడి పిశాచి బుద్ధిని విడిచి, సుకృతమార్గము నడిచి, కలుగు దురితములను సహించుకొని మరణ పర్యంతము నడువ తెగువ జేయగలవాడవు.

ఇదిగో నీకు ఊరడింపుగా నొక విశేషము చెప్పెదము వినుము:—వేయి సంవత్సరములు పరమ కర్తయొక్క సముఖములో నున్నను నిన్నబోయిన దివసము వలెనే ఉండునని తప్పులేని వేదోదాహరణములు చదివిన ఒక ఋషిశ్రేష్ఠులైనవారు మనఃచంచలులై యోచించిన దేమనగ: వెయ్యేండ్లు అనేక నాళ్లేయి యున్నవి కదా, ఇన్నాళ్లు కర్తయొక్క సముఖమున నుంచినయెడల ఒక గడియ కాలమైనను తోచక, నిన్నబోయిన దినమువలెనే ఉండుట ఎట్లనో ఏమో యనుకొనుచు చంచలపడుచుండగా, రూపలావణ్యమై పాలవర్ణమైన ఒక పక్షి మెల్లమెల్లగా రెక్కలు కొట్టుకొని, ఎగురుచు ఆ ఋషిసమీపమునకు వచ్చి, ఇంపైన రాగమెత్తి పాడెను. అప్పుడు ఋషిశ్రేష్ఠులైనవారు పక్షియొక్క ఇంపయిన రాగము విని మహా సంతోషపడి, దానిని పట్టుకొందమని యందుకు చేరిరి. అయినను అది చిక్కక, మెల్లమెల్లగా నెగురుచు నా ఋషి తన్ను వెంబడించి వచ్చునట్లు జేసి, ఆ మఠము విడిచి ఒక తోపునకు బోయి మానిపై గూర్చుండి కొంచెముసేపు ఇంపయిన సంగీతము పాడినందున, ముని పరవశులై మైమరచి నిలుచుండ అది ఎగిరి పారిపోయెను. అపుడా ఋషిశ్రేష్ఠులైనవారు ఆనందపరవశమునుండి బుద్ధి తెలిసి మహా ఆయాసముతో నంగలార్చి, అయ్యయ్యో ఇంపుగల పక్షి నాచే పట్టుబడక పోయినను నింక కొంచెముసేపైన నిలిచి పాడకపోతివా? ఇంతసేపు పాడినట్లు ఇంకను కాసంతసేపు నాకు ఊరడింపుగా పాడక నన్ను దుఃఖములో విడిచిపోతివో యనుచు తిరుగ మఠమునకు పోవుదమని తలంచి తిరిగిరి. అప్పుడు వచ్చినబాట మారుపడియున్నందున, దిక్కుదెస కనిపెట్టజాలక తత్తరపడి నిలిచి

ఏ పార్శ్వమునందు మరము కానవచ్చు నోయని చూచుచు కడకు మఠము చేరి నారు. అయినను తమ మఠము ముందుండిన ప్రకారము నుండక యందులో నుండి నవారలు తమ కాలములోనుండిన వారలు కారని మహాశ్చర్యపడి పైన చెప్పిన పక్షి వర్తమానమును అక్కడనున్న వారలకు తెల్పిరి. వారలు వీరి పేరును, వీరు చెప్పెడి ఒక గడియ లెక్కనును తెలిసికొని, పూర్వకాలపు పుస్తకములను ఎత్తి చదివి వీరి పేరును సంవత్సరమును కని వీరు మఠమును విడిచిపోయినవారే యని ఎరిగి మున్నూరు సంవత్సరములుగా నాతోపులో పక్షియొక్క సంగీతమును వినుచుండిరని తెలిసికొన్నారు.

హో పాతకుడా, ఒక సన్మనస్కుడు పక్షిరూపముగా ఋషికి కనుపించి పాడిన యింపయిన రాగమును మున్నూరు సంవత్సరములు వినినను రవంతసేపు వినినట్టు ఆ ఋషికి తోచెను కదా? మోక్షరాజ్యమందలి అనేకకోట్ల సన్మనస్కులు పాడెడు మహాయింపయిన రాగములను, సకలమేలుల స్వరూపియైయుండెడు సర్వేశ్వరుని ప్రత్యక్షముగాను ముఖాముఖిగాను దర్శించుటలో వచ్చెడి పరమానందమును ననుభవించి కళల పడియుండెడు మోక్షవాసులయొక్క మనోవాక్కాకందని భాగ్యమును కొంచెమైన యోచించి నీ పాపమార్గములను విడువవా? ఇటువంటి అశ్రద్ధతనమును విడిచి పరమ పదవినిపొంద ధర్మమార్గములో నడువగలవాడవు; ఎందుకనగ కారణదివ్యగురుడైన యేసునాథుండొసగిచ్చిన తిరువాక్య మేమనగ, "జయముగొనిన వారిని మాతో కూడ మాయాధీనభద్రాసనములో నుండ జేసెద" వన్నారు. ఇందుకర్థమేమనగా, లోకము పిశాచి శరీరములగు మూడు శత్రువులను సుకృత పుణ్యములచే జయించి సన్మార్గములో నడిచినవారికి మాత్రమే పైన చెప్పిన నిత్యానందపదవిని పాలించుదురుగాని ఆ మూడు శత్రువులను జయించక పాపమార్గములో నడిచిన వారలను నిత్యనరకములోనికి త్రోయుదురని అర్థమగును.

ఓరి పాపాత్ముడా, వింటివో, ఇదిగో ఈ లోకములో నాలుగునాళ్లు పాపసుఖమును వర్జించి సుకృత మార్గములో తపస్సుచేసినపిదప ఘనసంతోష దర్శనము యొక్క పరమపదవిని పొందవచ్చును, లేక ఇందు మూనాళ్లు అశుద్ధ సుఖద్రవ్యములను ననుభవించినపిదప నిత్యకాలము వండెడు నరకములో పడవలయును, ఈ విధముగా మంచి కాలములోనే యెంచి చూచి మేలైనమార్గము పట్టవలెనని యెరుగుదువుగాక.

# పదుమూఁడవ వ్యత్యాసము.

## మోక్షవివరము.

వ॥ అవధరింపుము, కడను బరమానంద గురువు మోక్షభాగ్యము మానవులకుఁ
దెలియఁబఱిచి యిట్లనియెఁ:

క॥ అటువంటి మోక్ష రాజ్యము-నెటువంటి దటంచు ననఁగ నేటికి వినుమా,
యిటు సెప్పెద నో మనుజుఁడ-పటులీలన్ మోక్షరాజ్యప్రాభవ మిపుడున్.

సీ॥ పూర్వమందొక మహాత్ముండు తా నొకనాఁడు-మోక్ష రాజ్యానికౌ మోదమంద
గలయట్టి శోభనంబుల వాస్తవము గాను-వర్ణింపఁ బూర్తిగా వ్రాయవచ్చు
నని మదిఁ దలపోసి యంతట నొకనాఁడు-నిదురపోయిన వేళ నెమ్మి నతని
కద్భుతంబుగఁ గలయం దొక్క శబ్దంబు-వినఁబడగాఁ దాను వేగ లేచి

తే॥ హాహ యంచును దల యూఁపి యా ప్రశంస
యందఱుకుఁ జెల్లుఁగాన నానందమంద
నదియు నెట్లన్నఁ జెప్పెద నాలకింపు
మేను వినినట్టి శబ్దార్థ మేమనఁగను:

క॥ కడలేని యపారంబగు-కడలిం గల జలమునంత గట్టొక్కటిలోఁ
గడుఁ గట్టు కట్టవచ్చునె-వడి జలము న్నిలుప నెవరి వశమౌఁ జెపుమా

క॥ జక్కవల నేస్తకాఁడును-రిక్కలదొర మొగులు మొదలు రిక్కలు నడచే
చక్కయనము నిలుపంగాఁ-జక్కఁగఁ దడకట్ట నెవరిసాధ్యము చెపుమా.

మ॥ ఇవి నీచే నగునేని దత్పరమ హర్షేచ్ఛా విహారంబుగన్
భవుకంబై తగు మోక్షరాజ్యపదవిన్ బాగొప్పఁగా వ్రాసి యె
క్కువ వర్ణించెద వంచు శబ్దమొనరెన్ ఘోషానికాశంబుగన్,
భువిలో నవ్విధమెన్న శక్యమె భళా బుద్ధింత లేదొఁగదా.

వ॥ వినరా మానవ మోక్షరాజ్యమహిమలను వర్ణింపఁగ శక్యమెవ్వరికి లేదు.

తే॥ అయిన నా నేర్చు విధమున నట్టి మోక్ష

రాజ్యమహిమలు చెప్పెదరా మనుష్య,
మనసు కణకవశ్యైనది యనఁగఁబోక
చెప్పి చూపఁగరాని విశేషమనర.

వ॥ ఆ మోక్ష మహిమ యెట్లున్నను

సీ॥ ఏడు గుణ్ణముల తేరెక్కి నేర్పరి మండ-లంబును బరమండలంబు నృక్ష
మండలంబుల మించి మఱిమీఁద మహ నీయ-రుచిర ప్రతాపసారోన్నతమగు.
తదనంతరము శుభాత్యంతమై తగు పర-మండలమున నిండియుండునట్టి
మోక్షరాజ్యంబని ముదముతో నెఱుగంగ-వలయును మర్త్యుఁడా వెలయ వినుము.

తే॥ ఘనత నప్పరమండల ఘన విశాల
దీర్ఘ లలితోన్నతంబు న దెట్లటన్నఁ
జెప్పిచూపఁగ రాదు ప్రసిద్ధముగను
సుందరం బెన్న మతి వాక్కు నందదౌర.

క॥ దిన మిరువదియై దామడ-లన మార్గము రెండు వేలు నబ్దంబులుగాఁ
బనివడి నడిచినపిదపను-ఘన పరమండలములోనఁ గడవఁగ వచ్చున్.

తే॥ పిదప దిన మిన్ని యామడల్ పేర్మినిన్ని
వేలయేండ్లను నడచినెడల సరగున
తారకామండలంబును దాఁటవచ్చు,
రవగ గనుపట్టు నంద ధరణిని జూడ

ఉ॥ అక్కడనుండి శైలనిభమైనది యొక్కటి గుండుద్రొబ్బినం
జక్కఁగఁ దొమ్మిదౌ పదుల సంఖ్యను వత్సరముల్ తగం జవం
బొక్క ఊ బట్టి నీ ధరణిపైఁ బడ నంచును వేదవేత్తలు
మిక్కిలి వ్రాసి చెప్పెదరు వేలుగ మానవ యాలకింపరా.

సీ॥ అచట దినమునకు నరయగా నిరువది-యామడ ల్మార్గంబు నేమఱకయు
నలువది వేలగు నబ్దంబు లమరగా-నడచిన యంతట నదిగో నసఁగఁ
గాన్పింపవచ్చును ఘన మోక్షరాజ్యంబు-నా మోక్షరాజ్యంబు నచటికైన
నెంత దూరంబని యెన్న శక్యము కాదు-వింటివో మర్త్యుఁడా వీనులలరఁ.

తే॥ బొగడ మతి వాకు కందని భూరి నిత్య
పరమసంతోష దర్శనభవ్యమోక్ష

రాజ్యమహిమంబు నింతని రమణ నెన్న
వశమె యెవ్వారికైన నీ వసుధలోన.

క॥ నా నేర్చు విధము సెప్పెద-మానవ వినరా తదీయ మహితామృత రా
జ్యానకు నెంత విశాలం-బానన నింతనఁగ రాదు ప్రణుతింపంగన్.

ఉ॥ ధారుణి మీదఁ గల్గు సికతంబును శంబరరాశిలోన నొ
ప్పారెడి వారి బిందు సికతౌఘము నంతయు నొక్కటొక్కటొ
నారజ మెంచ నెంత యగు నగ్గణితం బగునట్టి లోకముల్
మీఱిన నవ్విశాలమును మీఱు విశాలము మోక్షరాజ్యమున్.

తే॥ ఇటుల మది వాకు కందని యెన్నికైన
యున్నత విశాలములు గొనియుండునట్టి
మోక్షరాజ్యంబులో నుండు దక్షితితల
మునను మణి దీపములు వెల్గు ఘనముగాఁగ

క॥ ఎడలేని శోభనప్రభ-లెడలేని సుగంధ పరిమళేష్టప్రదమున్
కడగుఱుతులేని నీతిని-దొడవగు నప్పరమకర్త తోషణమచటన్.

తే॥ పరమకర్త సుభూరి సంభ్రమ విశాల
హర్షమైనట్టి దర్శనం బమరఁ గాంచి
యుప్పతిల్లెడి భోగభాగ్యోన్నతమగు
మోక్షరాజ్యంబు నేమి చెప్పుదును నీకు.

వ॥ ఏతత్ప్రకార దూరభారంబైనట్టి మోక్షదేశంబునకు నమ్మోక్షవాసులైన పు
ణ్యాత్ములు రానుబోను నొక్క క్షణికమాత్రంబు గావున నిద్ధరాతలంబున
దుం బరమకర్త యొనరించిన కల్పనలచొప్పునం దప్పక నడచినపుణ్యాత్మ
యాత్మలు నిజశరీరంబులతోడ జీవవంతులై యొక్కొక్కరు వెక్కసంబు
తన్మోక్షరాజ్యంబుఁ జేరినపిమ్మట, నమ్మహద్భాగ్యానుమోదప్రాప్తంబగు
త్మలు చేర్పఁబడినందువలన నాత్మలకుఁ గల్గు నక్షయ సూక్ష్మలఘు ప్రకా
బులనెడి వరచతుష్కంబువల్ల నల్లన దచ్ఛరీరంబుల కొకప్పటికి నక్షయరా
త్యంబై పరఁగునదియుంగాక, మోక్షరాజ్యంబునకు రానుబోను దుర్లభ
నంబై క్షణికదూరంబగుఁ దచ్ఛరీరంబులు నత్యంత శోభనప్రకాశ భావంబు
రవినిభంబుగాఁ బ్రవర్తిల్లుచు ననంతకాలంబును నపరిమిత కుశలంబైయుండు

దదీయశరీరంబుల ననువర్తించెడి యాత్మలు పరమ సౌఖ్యంబు నొందు వినుము.

సీ॥ ఇటువంటి శోభనం బెనయు నా మోక్షవా-సులునగు భాగ్యశాలులు నితాంత
పరమ సంతోష ప్రభాశోభనంబుల,-బల పరాక్రమముల, భవ్యకరము,
రాజాంగమైనట్టి రత్నభద్రాస నా-సీన వైభోగవిశేషములను,
సత్పుణ్యమార్గసంచర పటుత్వంబును,-రసికతాగుణగణరమ్యములను,

తే॥ ఘనత పూర్ణ కలాశాస్త్రగరిమ లక్ష
య లఘు సూక్ష్మప్రకాశ నిధులును మొదలు
గానుఁ జెలఁగుదు; రిట్టి సాకల్యసంప
దలు కొదవ లేక యుంట నా తరమె పొగడ.

తే॥ ఎల్లకాలము రాజరాజేంద్రులగుచు
నద్దయాకంధియగు కర్తయొద్ద నిలిచి
ఘన సముద్దర్శనంబును గాంచుకొనుచు
నుండెదరు వారి నెన్నఁగ నుర్వి దరమె?

తే॥ మట్టులేని పరంజ్యోతి మహితహర్ష
ఘన మధుర దర్శనంబును గాంచినందు
చేత నమృతాధికమునంత ప్రీతిభాగ్య
మనుచు మన బుద్ధి వివరించి యనఁగఁ దరమె?

క॥ మనబుద్ధిచేత యోచిం-పను జెప్పను గూడదంచు పరమమనీషుల్
ఘనశాస్త్రులైనవారును-వినిచిరి యుపమలను, వానివిధమెట్లన్నన్,

ఉ॥ లోకములోని యద్భుతములొందెడి నూనముఁ అందు గల్గు లీ
లాకృతి బాలవర్ణముల, లాలితసన్మణిదీప శోభన
ప్రాకటకాంతి, కుందనపు బంగరు కమ్ముల మిన్కులెల్లఁ, ద
తోకహితాబ్ధతారకల గూడిన దీధితి కాంతులన్నియున్,

తే॥ అట్టిశోభనకాంతి యా యమృతరాజ్య
మందుఁ గల యొక్క రశ్మిరమ్యంబునకును
సాటి చేయుటలెట్లన్న; జలజసఖుని
మ్రోల నొక బొగ్గు నిల్పిన లీలగాదె

సీ॥ ఘనతగా నిటువంటి కమనీయ శోభన-ప్రభలు నిండిన మోక్షపదవియందు

నంబును జూచుచు నప్పరమానంద-మనుభవించుచు భవ్యమందునట్టి

తే॥ మోక్షవాసుల మితిలేని భోగ భాగ్య
ములిటు, పుణ్య సుకృత మార్గమును నడిచియు
పాపము విడవ, మీకును ప్రాభవమగు
కరము సంతోష వార్ధి వేగిరము రాదె.

తే॥ పరమ గురు జేసునాథుండు నరుడుగాను
నానతిచ్చిన వాక్యంబు నదియు నెట్ల
టన్న, జయమును జేకొన్న ననఘులకును
సార్థముగ వారితోఁ బరమార్థ మొనరుఁ.

వ॥ అదియునుగాక: పిశాచి శరీరంబు లోకమను శత్రువులత్రయంబుం జయించి సుకృతులైనవారికి నిత్యానందం బొసంగెదమనియుఁ, దదీషణత్రయగతులైనవారలను ఘోరదుర్గంధనరక నీరధియందుఁ గూలఁద్రోసెదమనియు వాక్యార్థంబుగాన మానవుఁడు తత్పాపసుఖంబు త్యజించి త్రోచిన మాత్రంబు దపంబాచరించి పరమసంతోషవనధియం దోలలాడుచుం మోక్షంబందవలయును.

తే॥ వింటి వటరా మనుష్యుఁడ వీనులలర,
ధర్మ పుణ్యము సేయుము ధైర్యముగను
పాప సుఖమును వర్జించి తపము చేసి
సుకృతివై పరలోకముఁ జేరవచ్చుఁ.

క॥ నరులార తెలియలేదా-వఱుసన నేఁ జెప్పుచున్న వాక్యము లెల్లన్
దీరముగ మీరును సర్వే-శ్వరుఁ గూర్చి తపంబు సేయవల సుపదపటికిన్.

ఆశ్వాసాంతము

మాలినీవృత్తము॥ సకల భువనకర్తా, సర్వలోకైకభర్తా,
సకల భువనహర్తా, సర్వ లోకానువర్తా,
సకల సుజనపోషా, సంతతానంద వేషా,
సకల దురితనాశా, స్వామి సర్వేశ్వరేశా

గద్యము॥ ఇది శ్రీ జేసునాథస్వామి వరప్రసాదలబ్ధ కవితాధురీణ కాశ్యప సగోత్ర పవిత్ర సామంతపూడి పాపనార్య పుత్ర మల్లయ నామధేయప్రణీతంబైన యనిత్యనిత్యవ్యత్యాసంబను మహా ప్రబంధంబునందు సర్వంబు సంపూర్ణము.

# పదునాలుగవ వ్యత్యాసము.

## మనుష్యుని యొక్క అంత్యగతి.

అంత్యమును చూచుకొని ప్రయాణము చేయవలెనను వేదాగమోదాహరణ వాక్యముచొప్పుననే సముద్రము ఏళ్లకు గతి స్థలమైనందున, ఏళ్లన్నియు సముద్రమును జూచుకొని పోవుచున్నవి. రాతికి భూమి స్థలమైనందున, ఆకాశమునకు విసరివేసినరాయి తిరిగి భూమిమీదనే పడుచున్నది. అగ్నికి స్థలము ఆకాశమైనందున, మండెడు నిప్పుమంటలు ఆకాశమున కెక్కును. ఇట్లు ఇవి తమకు తగ్గ స్థలమును వెతకి పోవునట్టు, మనమును మన పరమ గతియైన మోక్షరాజ్యమును పొందవలెనని నడచుచు పోయిచేరవలెను. నదరు బుద్ధిలేని వస్తువులు, బుద్ధిగల మనుష్యులు తమ గతిని వెతకిపోవలెనని బుద్ధి నేర్పుచున్నవికదా. ఇది యిట్లుండగా బుద్ధిగల మనుష్యులు ఆనంద పరమపదవి యయ్యెడు మోక్షమును జేరుటకై కలిగింపబడియున్నందున, ఒక గడియసేపైన దానిని చూడక వెతకక యుండరాదు. మనము జీవించు కాలమంతయు మన అంత్యస్థానమగు మోక్షము జేరతలంచుచుండవలెను. మోక్షమును పొందుటకే లోకములో జన్మించియున్నారము. అయినను మన కడగతియనెడు మోక్షము జేరవలెనని మన మనస్సుపెట్టి నడువవలెనని కొంచెమైనను తలంచక, నాలుగు నాళ్లలో చెడిపోవు ప్రపంచపు చెల్వములు భోగములను ఆశించి, అందు మీద జ్ఞాపకముంచి అవే తమకు గతి యన్నట్టు వానినిమాత్రమే వెదకి తమ అంత్యమగు మోక్షము నొంద తలంచకయును పరమపదము ఏమని ఎరుగకయును తిరిగెడువారలకు లెక్కలేదు.

ఒక లోకశాస్త్రిజ్ఞుడు దీనిని కనిపెట్టినందున, మంచి మిట్టమధ్యాహ్నవేళ దీపమును వెలిగించి చేతపట్టుకొని అనేక మనుష్యులు చేరియున్న గుంపులోనికి పోయి యింత మందిలో బుద్ధిగల మానవు డెవడని తెలిసికొన వచ్చితినని నెను. రాత్రిలోకదా, ఒక మనుష్యుని వెతకులాడునట్టు వాడు పట్టపగటిలో దీపము వెలిగించి వెతకినందుకు కారణమేమనగా: లోకమందలి మనుష్యులలో బుద్ధిన్యాయముచొప్పున నడుచువారలే వెలుతురులో నడుచుచున్నారుగాని యితరులం

దరు అంధకారపు చీకటిలో తడమాడు చున్నారు. వెతకవలసిన గతిని వెతకక, వెతకరానివి గతి యన్నట్టుగా వెతకుట వల్లను బుద్ధి న్యాయమను దీపపు వెలుతురు లేనందునను అంధకారములో నున్నారని ఆ శాస్త్రి ఎంచెను. ఈలాగుననే మనుష్యులు ఈ లోకమున స్థిరములేని యిల్లు కలవారలై ద్రోవనడుచు వారలై యుండగా, తమ యంత్యగతి యేదని, దానిని కనుగొను మార్గమేదని వెతకక, భూలోకమున ఎల్లకాలము జీవించుదు మన్నట్టు తమ స్వల్ప అయుస్సులో మాయ లోకపు చెల్వములను ఆశించి అభిలషించెదరు. అందువల్ల మనుష్యులు తమ యిల్లగు పరమపదము జేరక త్రోవతప్పి మోసపోవుచున్నారు.

ఇల్లు మోసములో చిక్కుకుండకదా, అనేకులు ద్రవ్యవంతులు, తమ ద్రవ్యములు పరమపదవి చేర ఆటంకములుగా నున్నవని తెలిసికొని ద్రవ్యములను వర్జించి పారవేసి మరణపర్యంతము పరదేశకులుగా సంచరించిరనియు, అనేకులు లోక బహుమాన గౌరవ ప్రతాపములు పరలోకము జేర విఘ్నముగానున్నవని కని మాయలోకపు చెల్వములను గౌరవములనుత్యజించి దరిద్రులుగా నడిచిరనియు, లోకపు సుఖభోగములు మోక్షము చేర అభ్యంతరముగా నున్నవని ఎరిగి అనేకులు వానిని అసహ్యించి రోసి వనములలో దూరి దాగుకొనిరనియు, ఆర్చిశిష్టుల చరిత్ర పుస్తకములలో చదివి యెరుగవచ్చును. అందుకు సాదృశ్యములుగా ఒకటి రెండు విశేషములను వినుము.

యౌవనప్రాయమును రూపలావణ్యములును కలిగియున్న ఒకడు తన ముఖలావణ్యము తనకు పాపకారణముగా నున్నదని భయపడి సొంపైన తన ముఖమును అవలక్షణముచేసి శరీరసౌందర్యము చూపకుండ వంటపని చేసికొని పాపములేక మరణపర్యంతము ధర్మపు ద్రోవలో నడిచెను. ఈలాగుననే యింకొకరు దొడ్డ జ్ఞానులని పేరొందినందున, లోకులు తమ్ము గౌరవించి సన్మానించుదురని భయపడి పిచ్చివాని వేషమెత్తి లోకమును వర్జించి పరలోకము జేర పుణ్యము చేయుచుండిరి. ఈలాగుననే రాజులైయుండిన అనేకులు రాజ్యపరిపాలనములో ప్రపంచపుచింతలేగాని పరమపదవి పొందు మార్గములేదని చూచి రాజ్యమును విడిచి సన్న్యాసత్వము బట్టి పుణ్యముచేసి నిత్యానంద రాజ్యమున చేరిరి. ఇదియంతయు పరమపదమున పొందుటకే చేసిరిగాని మరి యొకటికాదు. ఎవడైననేమి తనకు అంత్యమైన ప లోకమును చూచుకొని నడవవలసినర డల పాపములకు కారణముగా నుండె

అర్థమేమనగా: దున్నువాడు పట్టిన మేడిని దున్నెడు భూమిని చూచుకొని పోయినయెడల పని యగునుగాని వెనుక చూచుచు పోయినయెడల చేపట్టిన పని కొనసాగదు అన్నట్లు లోకమున జన్మించిన మనుష్యుడు కొన్నాళ్లు ఇందు పుణ్యముచేసి, కష్టపడి, మోక్షరాజ్యము జేరవలసియుండగా పుణ్యముచేయ ప్రయాసపడక, మాయసుఖములను వెతకినయెడల ఆత్మకు చేటు కలుగును. లోకమున పడిన ప్రయాసమంత వ్యర్థమగును. తుదను నరకమున బడును. ఓరీ పాపాత్మా! నీవిట్లు పడకుండ నుండునట్టుగా, నీ గతియైన పరమకర్తయొక్క ఆనందరాజ్యమును ఎల్లప్పటికిని చూచుచు, అందు చేరవలెనని సుకృతపుణ్యములను చేయ తెగువ జేయుగలవాడవు.

అయ్యయ్యో పాపి! పొర్లి పారెడు ఏళ్లును, ఎగసి మండెడు నిప్పును, ఆకాశమున విసరబడిన రాయియును మధ్యను నిలువక, ఏళ్లు సముద్రమును చూచుచు పోవును, మండెడు నిప్పు పైకెక్కిపోవును, ఆకాశమున విసరిన రాయి భూమిమీదనే పడును. ఆకాశమున విసరినరాయి, రాళ్లలోపడిన పగిలిపోవుననియు, ముండ్లలోను, బురదలోను పడిన నందులో గుచ్చుకొని మురిగి పోవుననియు, ఆకాశమందే నిలుచునా? లేదుకదా, ఎక్కడ పడిననేమి? తన స్థలమును, గ[...]యైనన భూమిమీద పడిన చాలున[...] తక్షణమే భూమిమీద పడుచున్నదిగదా[...] ఈలాగు సకల వస్తువులు తమ గతి స్థ[...]ములను చూచి పోవుచున్నవి.

అయ్యో! మతిచెడినవాడా, నిన్ను సృష్టించినవారును, సర్వశక్తులును అ[...]న పరమకర్త నీకు గతియు, అంత్యస్థ[...]మునై యున్నారు, వారి ప్రత్యక్షదర్శ[...]ము చేసిననేగాని నీ ఆశలు తీరవు. కాబ[...] నీకు గతియైన ఏక దేవుని ఆరాధింప[...]యుచు, వానిని చూడవలెనని అభిల[...]షతో మోక్షరాజ్యము చూచుకొని ప్ర[...]యాణము చేసి, సుకృత మార్గములో [...]రు గైస్తకయును నుండడమేమి? హా, పాపి! నీ కడగతిని పొందుటకై దుఃఖపరితప[...]లను, వ్యాధికష్టములను, నిందావమా[...]నులను పడవలసియుండగా, వానికి [...]యపడి, నిన్ను కలిగించిన దేవునికి ద్రో[...]హము చేయుచేటికి? నీవు పైకొన్న స[...] వేదనను వదలుపకన్న కష్టబాధలు[...]నను, చచ్చినను పరవాలేదని విశ్వా[...]ము గోసు పుణ్యములో ప్రవేశించవలవదు[...] ప్రామాణికత్వముగా నుండెడు వారల[...] కదా మోక్షరాజ్యము అబ్బును! అం[...] వలన నీ పరమగతియైన జీవుని వె[...] పోవలసినదేగాక దుర్మతములను, అ[...]పాశ దుర్గుణములను, పాపచర్యలను

ఉలుటలేదని సాధించినయెడల నీకు తప్పక నరకమే సిద్ధించునని యెరుగగలవాడవు.

కాని మోక్షరాజ్యము చేరుటకై కావలసిన పుణ్యములను ఎరుగగనుదువేమో? అట్లయిన కొన్ని సుబుద్ధులను వినుము: 1. నిన్ను కలిగించిన ఏకవస్తువగు దేవుడొకరు కలరనియు, వారు కరుణించిన సత్యవేదములో మాత్రమే పరమగతి లభించునుగాని, మనుష్యులు కల్పించిన యితరమతములలో చిక్కదనియు శ్వసించవలెను. 2. పరమగతి చేర మనస్సుపెట్టి పాపములను వర్జించి సత్యవేద కల్పనలను అనుసరించి పుణ్యములను చేయుచు వచ్చినట్టయిన పరమగతి పొందవచ్చునని నమ్మకముగా నుండవలెను. 3. నిన్ను సృష్టించిన ఏక దేవునిమాత్రము సకల వస్తువులకన్న అధికముగా నిండు మనస్సుతో స్నేహింపవలెను. ఇదిగాక విమర్శ, నీతి, ధైర్యము మట్టుతో చేరిన తపస్సు ఈ నాలుగును పై చెప్పిన మూడు దైవికపుణ్యములతో నీ హృదయమునందు స్థిరముగా కలిగియుండుము. లేనట్టయిన నీ గతియగు మోక్షము చేరలేక నిత్యకాలము బాధలుపడ నరకమున బడుట తప్పదు. హో పాతకుడా! శీఘ్రముగా కఠోర పాపములను త్యజించి, నిర్మల హృదయుండవై చేయవలసిన పుణ్యములను చేసి, సన్మార్గమందు ప్రవర్తించి మోక్షముచేర ప్రయాసపడగలవాడవు.

అనిత్యానిత్య వ్యత్యాసము
వచనకావ్యము
సమాప్తము.



లోకపుచెల్వమును విడిచి పుణ్యములను తకి నడుచునుగాక, లేకపోయిన పరలోకము జేరనోపక నరకములోపడుట తప్పదు. ఈ దొడ్డకార్యమున నీకు మరికొన్ని బుద్ధులు చెప్పుచున్నాము వినుము.

చిత్రకారుడు చెక్క త్రోపుడు పట్టెడి ప్రమాకును ఫలాని పనికి నని తలంచి చేయక ఊరక చెక్కుచు పోవుచుండినట్టయిన వాడు పడిన ప్రయాసచే పొయ్యికి కట్టెలు చెక్కినట్టాయెనుగాని యింకేమి ప్రయోజనము కానము. ఈలాగుననే ప్రయాణము చేయువాడు బయలుదేరక ముందర ఫలాని ఊరికిపోవలెనని గురించుకొనక పోయినయెడల నడిచెడు ఆయాసమునకు ఊరట యెక్కడ? దిక్కు తెలియక పిచ్చివాని చందమున తిరుగునుగదా! ఇట్లు చేపట్టిన కార్యమునకు ఒక తాత్పర్యములేక అంత్యగతి తలంచక చేసినట్టయిన ఆ కార్యము వ్యర్థమై పోవును. ఇట్లుండగా బుద్ధిగల మనుష్యుడును ఏయొక తాత్పర్యమునులేక నడువరాదు. ప్రతివాడు తాను లోకమందు జేయు క్రియలను తన యీడేర్పునకుగాను చేసినట్టయిన పడినప్రయాసకు ఫలము కలుగునుగాని ప్రపంచసుఖభోగములను కోర్చి చేసినయెడల తన పరమ పదవిని జేరక నరకములోనికి తన యాత్మనుపడద్రోయుచున్నాడు.

ఇంతటి పాతకమునకు భయపడక ఫాల్పడినవానికి కారణసద్గురువు వచించిన సద్బుద్ధి యేమనగ: లోకమంతయు మనుష్యనికి ఆదాయముగా నున్నను తన యాత్మను నష్టపరిచినను, వానికి లాభమేమనిరి! ఈ వేదవాక్యము చొప్పున లౌకికమాయాసుఖములను చెల్వ్యములను వెతకుటలోను అనుభవించుటలోను పాపము వచ్చుచున్నదిగాని పుణ్యమురాదు, అని బుద్ధిగలవాడు యోచించి నరకమున పడకుండ లోకపుసుఖములను వర్జించి పరలోకము జేర ధర్మమార్గములో నడువగలవాడు. లోకమును దాని చెల్వ్యములను నమ్ముటచే ఆత్మకు ఛేదమని తెలుప పరమకర్త చెప్పినదేమనగ: సూదిబెజ్జములో ఒక ఒంటె దూరవచ్చునుగాని ధనవంతుడు మోక్షరాజ్యము చేరుట దుర్లభమనిరి. హో, పాపాత్ముడా! పరమకర్త వచించిన వాక్యము తప్పునా? తప్పనట్టయిన లోకముయొక్క మాయసుఖభోగములను వదలను అను తెగువ నీకున్నదా? కాలముండగానే ఈ మంచిబుద్ధి ప్రకారము పరలోకము పొంద పుణ్యములను చేసి సత్యవేదము ప్రకారము వర్తింపగలవాడవు.

ఇదిట్లుండగా మేడి పట్టుకొని వెనుక చూచువాడు మోక్షరాజ్యమునకు అర్హుడుకాడని దివ్యకర్త సందలించిరి. ఇందుకు